| | రూ. | అ. |
|---|---|---|
| | ప్రతి 1-కి రూ. | అ. |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు ... | 10 | 0 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము, క్రొత్తకూర్పు | అచ్చు | |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది ... | 1 | 8 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) ... | 1 | 0 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము ... | 2 | 0 |
| దశకుమారచరిత్రము, పద్యము కేతనకవి ... | 2 | 0 |
| దశావతారచరిత్ర, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, భాగవతములోనిది ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 2 | 0 |
| నలచరిత్ర, ద్విపద, చక్రపురి రాఘవాచార్యప్రణీతము | 2 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము, తిక్కనామాత్యప్రణీతము | 1 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 1 | 0 |
| ,, క్యాలికోబైండు ... | 1 | 8 |
| ,, వేంకటనాథరాజకవికృతము ... | 1 | 4 |
| ,, క్యాలికోబైండు ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 1 | 4 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము ... | 3 | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు, శ్రీధరమల్లె వేంకటరామకవి | 2 | 0 |
| బసవపురాణము, పిడపర్తి సోమనాథకవి ... | 3 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కఁగ ముద్రితము ... | 6 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 3 | 0 |
| భక్తిరసశతకసంపుటము I 20 శతకములు ... | 3 | 0 |
| ,, II ... | 3 | 0 |
| ,, III ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I ... | 3 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద ... | 5 | 0 |

| | | ప్రతి 1-కి రు. | |
|---|---|---|---|
| రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము | ... | 3 | |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | |
| వసుచరిత్రవిమర్శనము | ... | 1 | |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము | ... | 7 | 8 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది | ... | 1 | 8 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణము | ... | 3 | 8 |
| వివేకసింధు, కొండనార్యప్రణీతము | ... | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ | ... | 2 | 0 |
| వైశ్యపురాణము, శ్రీగురు భాస్కరాచార్యకృతము | ... | 1 | 4 |
| వీరభద్రవిజయము, పోతనకృతము | ... | 2 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 1 | 0 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 1 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది | ... | 2 | 0 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి | ... | 1 | 8 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 1 | 0 |
| శుకసప్తతి, కదిరిపతికృతము | ... | 1 | 8 |
| సమీరకుమారవిజయము, నూతనముద్రితము | ... | 1 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవి విరచితము | ... | 1 | 8 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, తాత్పర్యము | ... | 5 | 8 |
| ,, అట్టబైండు | ... | 3 | 8 |
| సుదక్షిణాపరిణయము, తెనాలి అన్నయకవి (క్రొత్తకూర్పు) | | 1 | 0 |
| హరివంశము, క్రొత్తకూర్పు, ఎఱ్ఱాప్రగడ | ... | 6 | 0 |
| హరవిలాసము, శ్రీనాథకవి | ... | 1 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి | ... | 1 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణకవి | | 5 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

# విషయసూచిక.

విషయము. పుట.



## చతుర్థాశ్వాసము.



## పంచమాశ్వాసము.




కనుపర్తి అబ్బయామాత్యుఁడు రచించిన గ్రంథములలో రెండే మనకు లభించినవి. ఒకటి అనిరుద్ధచరిత్రము, రెండవది పురూరవశ్చరిత్రమను కవిరాజమనోరంజనము. వీరేశలింగముపంతులువారు కవుల చరిత్రములోఁ గవిరాజమనోరంజనము నిట్లు ప్రశంసించిరి. “వసుచరిత్రమునకుఁ దరువాతఁ గవిరాజమనోరంజనముతోఁ దులతూఁ గఁదగిన ప్రబంధము లొకటి రెండుకంటె నెక్కువగా లేవు...బాల్యమునందు రచింపఁబడినదగుటచే అనిరుద్ధచరిత్రము పురూరవశ్చరిత్రమంత ప్రౌఢముగా లేదు. కవి సాహిత్యమునందుమాత్రమే గాక సంగీతమునందును బ్రవీణుఁడైనట్లు కనఁబడుచున్నాఁడు.”

వీరేశలింగముపంతులువారీ గ్రంథమును మిగులఁ బ్రశంసించుట గ్రంథప్రశస్తికి దృష్టాంతము. అబ్బనామాత్యుఁడు కౌండిన్యసగోత్రుఁడు. ఆఱువేల నియోగిబ్రాహ్మణుఁడు. గుంటూరుమండలములోని కొండవీటికి రెండామడలదూరములోనున్న కనుపర్తి యీతని నివాసస్థలము. నేఁటికిని గవివంశీయు లట వసించుచున్నారు. ఈకవితండ్రి రాయనమంత్రి. తల్లి నరసమాంబ. మంగళగిరి నృసింహస్వామి యీతని యిష్టదైవము. నరకృతికొల్లక యిక్కవి తన రెండుగ్రంథములను దేవాంకితము గావించి ధన్యుఁ డయ్యెను. ఇక్కవి పూర్వులలో బసవప్రధాని “కొండవీటిపుర రాజ్యోర్వీశ్వరులు మంత్రిగాఁ జేపట్టిన” జేరొందెనఁట. అంతియగాదు “కనుపర్తి బుక్కపురి ముఖ్యబహుగ్రామస్వాస్థ్యానుభవగ్రామణి”యట. కనుపర్తికి మిగులఁ జేరువలో బుక్కపట్టణమున్నది గాన కవి కొండవీటిసీమవాఁ డనుట నిస్సంశయము. కవి పూర్వులప్రశంస కాలనిరూపణమునకుఁ దోడ్పడుట లేదు.

వసుచరిత్రమును బాగుగ ననుకరించినకతన అబ్బయామాత్యుఁడు వసుచరిత్ర రచనకాలమున కీవలివాఁడనుట స్పష్టము. కవివంశజులలో నిప్పటితరమున సూర్యనారాయణ యనువా రున్నారు. ఈయనవయస్సు 42 సంవత్సరములు. ఆయననుండి పురుషులను దీసికొన్నచో సుబ్బయ్య-శ్రీనివాసరాయుఁడు-సుబ్బరాజు-వెంకన్న-పెద్దిరాజు-గ్రంథకర్తయగు అబ్బరాజు వంశవృక్షమువలనఁ గన్పట్టెడి. అనఁగా సూర్యనారాయణగారికిఁ బ్రకృతగ్రంథకర్త ఆఱవతరమువాఁడు. తరమునకు ముప్పదియేండ్లవంతున లెక్కించినచో అబ్బయామాత్యుఁ డిప్పటికి నూటయెనుబదియేండ్లక్రిందట క్రీ. శ. 1750 ప్రాంతమున నుండె ననుట స్పష్టము. ఇంతకంటె బలవత్తరములగు సాధారణములు లభించువఱ కీనిర్ణయము విశ్వసనీయమని మాతలంపు.

కవిరాజమనోరంజనము రసవత్తరమగు ప్రబంధము. కవి వర్ణనములకుఁ బాటుబడినట్టులఁ గథాకల్పనమునకుఁ బాటుపడలేదు. "ఆద్యసత్కథల్ వారివిపుష్టిరత్నము" లన్నట్లు ఇందలికథాంశము పురాణములనుండి యథావిధముగఁ బ్రబంధములోనికి మాఱినది. ఈమార్పునకు అష్టాదశవర్ణనలు అంత్యనియమపద్యములు చిత్రకవిత మున్నగుకవితాశిల్పములు తోడ్పడినవి. అంతియగాని ప్రధానపాత్రముల నాదర్శప్రాయముగఁ జిత్రించుట, ప్రకరణోచితముగఁ గథనుసృజించుట మున్నగు నూతనవికాసము లీప్రబంధమునఁ గానరావు. మృదుమధురమగు నీకవికవిత స్వాతంత్ర్యముగనున్నంతవఱకు మనోజ్ఞముగనున్నది. వసుచరిత్రము ననుకరించినకావ్యములలోఁ గొంతకొంత పేలవము కనిపించుచున్నది. ఎట్లైన నేమి సమకాలికగ్రంథములలో మిన్నయనుట సత్యము. ప్రధానకథాబీజముఁగొని కాళిదాసిందలికథనే తారుమారొనరించి విక్రమోర్వశీయమునఁ గథాసంస్కరణానైపుణ్యమును బ్రకటించినాఁడు. నాటకములఁ బ్రబంధములుగ మార్చుకాలమున నున్నయిక్కవి యిందులకు వొరకొనమి సంతాపకరము. అబ్బనామాత్యుని మనోహర

కవిత నూతనకథాకల్పనకుఁ దోవదేసిన నెంతరమణీయముగ నుండునో గదా!

అబ్బయామాత్యుఁడు పలుతావుల వసుచరిత్రము ననుకరించినాఁడు. కొన్నితావుల వ్యాకరణనియమములఁ గూలఁద్రోసినాఁడు. ఇతని స్వతంత్రరచనము మృదుమధురపదభూయిష్ఠమై తెలుఁగు నుడికారములందలి తీయతీయముల వెదజల్లుచుండును. శృంగారనైషధములోని కొన్నిపద్యముల కనుకరణము లితనికవితలోఁ గలవు.

సీ. "శిక్షాదివిద్యానటీనృత్తరంగస్థలా
యతనాయమానజిహ్వాంచలుండు."

శృంగా-ఆ-1. ప-46.

సీ. "నవకీర్తినర్తకీనాట్యరంగావధీ
కృతచక్రవాళధాత్రీప్రపంచు."

కవిరా-ఆ-1. ప-87.

చ. "ఇతఁడు దరిద్రుఁడై నవుచు నేర్పడ నర్థిలలాటపట్టికన్
శతధృతి వ్రాసినట్టిలిపిజాల మనర్థము గానియట్లుగా
వితరణఖేలనావిభవవిభ్రమనిర్జితకల్పభూరుహుం
డతఁడు దరిద్రతాగుణమునందు దరిద్రుని జేయు నాతనిన్."

శృంగా-ఆ-1. ప-57.

మ. "అయమర్థిజనయంచు యాచకలలాటాంతస్స్థలిన్ బ్రహ్మని
ష్ఠయతిన్ వ్రాయవహించునట్టి లిపియర్థంబుల్ విశేషాన్వయ
క్రియగా నర్థమవారిగా నొసఁగి యర్థంజేయు వాగీశువ్రా
తయు నాత్మీయవితీర్ణయున్ రిత్తముగా ధాత్రీశు నేర్పట్టిదో."

కవిరా-ఆ-1. ప-93.

వసుచరిత్రము ననుకరించినపద్యములనుగూడఁ జూపుట ప్రకృతము కాకపోదని ఒకపద్యమును జూపుచున్నారము.

ఉ. "కొండఁట విల్లు వేపఁలలకుండలిరాజఁట నారి యమ్మనం
గుండఁట జైటిపల్లియఁట పుస్సెనవాఁడఁట యెంతురెంతు భ
ర్గుండెడి నిందుపౌరుషమొకో యని గెల్వవె ముజ్జగంబు లు
ద్దండత నొక్కతుంటవిలు దాలిచి యంటినగందుతూపులన్."

వసుచరిత్రము.

ఉ. "నారఁట లేఁటి, జోక నళినారఁట, తేరఁట చిల్క సౌరభో
ద్గారఁట, విల్లుప్రాశనయగారఁట చుట్టము శైత్యపుణ్ సదా
చారఁట కమ్మగట్టు పరిచారఁట కోయిల కేతనైభవ
వ్యారఁట యిట్టినీకొమదుగువారఁట లోకు లిదేమిచిత్రమో."

కవిరాజమనోరంజనము.

అనుకరణపద్యమున సంధిలోపములు చాలగలవు. గ్రంథవిస్తరభీతిచే నిం దుదాహరింప మానితిమి. కవిరాజమనోరంజనమున, రసవత్తరము లగుఘట్టము లెన్నేని కలవు. మొదటియాశ్వాసములోని రాజనీతులు ఆత్మవిద్యోపదేశము, ప్రత్యేకశంసనీయములు. రెండవయాశ్వాసము లోని తారాశశాంకసమాగమముగ సభ్యముగ సంగ్రహరూపముగ నుండి దుర్నీతిని బరిహరించుచున్నది. వసిష్ఠస్తుతి కవికిఁగల యుభయభాషాకవితానైపుణ్యమునకుఁ దార్కాణగా నున్నది. ఇలాకన్య పురుషుఁడగుటయు రాజకుమారుఁడు స్త్రీయగుటయు వీరలు పరస్పరము మోహించుకొనుటయు నిరువురకుఁ దనయుం డుదయించుటయు శివానుగ్రహంబునఁ బూర్వరూపంబులు దాల్చుటయు మిగుల మనోహరముగ రెండవయాశ్వాసమున వర్ణింపఁబడినవి. మూఁడవయాశ్వాసము నుండి ప్రధానకథ యగుపురూరవశ్చరిత్ర మారంభమైనది. ఊర్వశీపురూరవుల సమాగమమునకుఁ గాంక్షించుట, మలయానిలాద్యుపాలంభములు చెలికత్తియల మోదార్పులు మున్నగు కథాభాగములు విశేషభావసమన్వితములై మనోహరముగ నున్నవి. ఊర్వశీపురూరవుల కీయాశ్వాసమున వలపు మొలకలెత్తినవి. సమాగమవిధము నాల్గవయాశ్వాసమునఁగలదు. మైత్రావరుణుల తపోభంగముఁగావింప నింద్రుపంపున

ఊర్వశి ధరణి కవతరించి శాపతప్తురా లయ్యెను. శాపఫలము భూలోకమున వసించుట. ఊర్వశికిఁ దీర్ఘము స్వార్థము గలసివచ్చినది. తరువాత నీయిరువురికలయిక(సమావేశము) సందర్భశుద్ధిగ సరసముగ రసవత్తరముగఁ గవి చిత్రించినాఁడు. ఈయుభయులప్రేమ నిష్కళంక మైనదె. ఏకహృదయముగ నిరువురు వర్తించుచుండిరి. కాని యిరువురు విడిపోవుట కొకసమయము గలదు. ఊర్వశి రెండుపొట్టేళ్లఁ దెచ్చినది. వానిని మృగచోరాద్యాపదలు బొరయనీయక కాపాడుట, వివస్త్రముగఁ దనకుఁ బురూరవుఁడు కనపడకుంట జరుపువఱకు ఊర్వశి వెంట నుండును. ఈనియతికి భంగముకలుగుటయే యెడబాటు. నియమముల కంగీకరించి పురూరవుఁడు ఊర్వశిని బరిగ్రహించి ప్రతిష్ఠానపురము జేరి చిరకాలము కామసౌఖ్యము లనుభవించెను. ఒకదినము తగళ్లఁ జోరులు హరించిరి. వివస్త్రముగ నేగుచున్నపురూరవుని దర్శించుటతో నిరువురిబంధము తెగిపోయెను. ప్రతిజ్ఞాభంగము జ్ఞాపకముజేసి ఊర్వశి స్వర్గలోకమునకుఁ బోయెను. అటనుండి విప్రలంభశృంగారము మనోహరముగ నున్నది. ఈ కథాభాగముల నైదవయాశ్వాసమునఁ గాంచనగును.

ఊర్వశి నిర్గమనానంతరము పురూరవుఁడు వలపువ్రేగునఁ జింతించుచు గంధర్వులఁబ్రార్థింప ఊర్వశివలె అగ్నిస్థాలి యనుకన్యను సృజించి యొసంగుదురు. క్రమముగా నాయమ యూర్వశికాదని పురూరవుఁడెఱింగి యేకతమునఁ జింతించుచు రెండరణులనేకరించి యొకటి యూర్వశియని మఱియొకటి పురూరవుఁడని పేర్కొని రెంటిని ద్రచ్చుచుండ విష్ణుప్రత్యక్షమై కామితములు ప్రసాదించుటతోఁ గథ యంతమగుచున్నది. కథాంశమునకుఁ గవి సంస్కరణ జరుపక గనిలోనుండితీసిన పుట్టుశిలవలెఁ గథనుంచి వర్ణనముచేర నెన్నేని భూషణము లాశిలకే కూర్చినాఁడు. మూఁడవయాశ్వాసమునుండియే యీప్రబంధమునకుఁ బ్రధానకథ యారంభమగుచున్నది. ఇందలిశృంగారము చాలవఱకు

సభ్యముగఁ బఠనయోగ్యముగ నున్నది. పదునెనిమిదవ శతాబ్దము నాఁటి ప్రబంధములలోఁ గవిరాజమనోరంజనమువంటి సర్వాంగసుంద రము రసవత్తరము నగుప్రౌఢకావ్య మింకొకటి లేదను కవి చరిత్ర కారుల వాక్యమునం దెంతయు సత్యము గలదు.

ఆంధ్రభాషయందుఁ గలలక్షణగ్రంథముల నైకక్యము కాన రాదు. ఒకరిసిద్ధాంతము నింకొకరు పూర్వపక్షముఁ జేసిరి. ఎవరిత్రోవ వారికి ఈవిస్తృతలక్షణముల సమన్వయించుట యసాధ్యముగ నుం డెను. ఒక రంగీకరించినసిద్ధాంతము నింకొకలాక్షణికుఁడు పూర్వపక్షము గావించుచునుంటచే నానాఁటికవులకు నిశ్చయసిద్ధాంతములే తోఁచ కుండెను. అందుచేతనే యీతనికవితలో వ్యాకరణలోపము లుండె నని కవిరాజమనోరంజనములోని యీ క్రిందిపద్యమువలన నెఱుంగ నగును.

ఉ. "చెల్లునటంచు నొక్కకవి చేసినలక్షణ మొక్కరీవలన్
చెల్లమిఁజేసి తారొకటి చెప్పఁగ ఛాందసవిస్తరంబు సం
ధిల్లుటఁ గావ్యశంక లవనిం దఱచయ్యె రసజ్ఞులార నా
యుల్లపుసౌధవీథిఁ గొలువున్నసరస్వతి సత్యవాణి నా
తల్లి యొసంగు పల్కులివి తప్పులు సేయక చిత్తగింపుఁడీ."

కవితాప్రౌఢి కిక్కవి యాంధ్రీస్తనముల నుపమానముగాఁ గైకొనినాఁడు. బహుశః ఇది అఱచాటగు నంధ్రవధూటిచొక్క పుంజనుఁగవను జెర్కొనువిధము గానోపు. ఆంధ్రీస్తనముల కాఠిన్య మును నన్నెచోళుఁడు రాజశేఖరుఁడు జెర్కొనిరి. అదియే కవిభావ మేని కవి శృంగారరసప్రబంధమునకుఁ గ్రొత్తవన్నెలు బచరించుటయే!

రసవత్తరమగు నీ గ్రంథరాజమునుండి దృష్టాంతముగ నీయఁ దగినపద్యములు చాలఁ గలవు. రసికులముం దీగ్రంథముంచి వారి నా నందపఱచుటయే యుద్ధృతమునకంటె నుచితమగు పని. రచనాచమ

త్కారమునను గూర్పుబింకమునను అనిరుద్ధచరిత్రముకంటె నీకవిరాజ మనోరంజనము ప్రశంసాపాత్రముగ నున్నది.

చిరకాలముక్రింద చింతామణిముద్రణాలయమున నీగ్రంథము ముద్రితమైనది. అందు ముద్రణస్ఖాలిత్యములు కలవు. ప్రతులు చిక్కుటయే అసాధ్యముగ నుండెను. ఆంధ్రజనాదరపాత్రమగు నీగ్రంథరాజమునకుఁ గలప్రశస్తి గమనించి సర్వాంగసుందరముగ ముద్రించి ఆంధ్రలోకమునకు సమర్పించిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి యత్నము ప్రశంసనీయము.

ఇట్లు, భాషాసేవకులు,

శేషాద్రిరమణకవులు,

శతావధానులు.

# ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీమదాంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది | 5 | 8 |
| ,, అత్యుత్తమప్రతి, రెండుసంపుటములు | 7 | 8 |
| ,, 3 సంపుటములు | 9 | 0 |
| శ్రీమదాంధ్రభారతము - పద్యకావ్యము:— అనేక వ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణపరిశ్రమముతోఁ బరిష్కరింపఁబడినది. మేలుకాకితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచి కాలికోబైండు చేయబడియున్నది. | | 0 |
| 7 సంపుటముల ప్రతి | 14 | 0 |
| 3 సంపుటముల ప్రతి | 13 | 0 |
| ఆది, సభాపర్వములుగల సంపుటము | 2 | 0 |
| ఆరణ్యపర్వము | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 2 | 0 |
| శాంతిపర్వము | 2 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములుగల సంపుటము | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | 5 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 3 | 12 |
| శాంతిసప్తకము | 3 | 12 |
| ఆదిపర్వముమాత్రము, పెద్దచ్చు | 1 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి | 8 | 8 |
| ఆనందరంగరాట్ఛందము, కాలికో | 1 | 8 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము; కావ్యస్మృతితీర్థ: జనమంచి శేషాద్రిశర్మకృతము, 3 సంపుటములు | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | 14 | 0 |
| ఆంధ్రలలితోపాఖ్యానము | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, అట్టబైండు | 0 | 12 |
| ,, కాలికోబైండు | 1 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు—టీకానుక్రమణికాసహా | 0 | 12 |
| డిటో కాలికోబైండు | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవిది | 0 | 6 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కని కూర్పు, గిల్టుబైండు | 2 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | 1 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | 1 | 8 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | 1 | 14 |
| కళాపూర్ణోదయము, దళసరికాగితములు | 2 | 4 |
| కాశీఖండము, చక్కనికొత్తకూర్పు | 1 | 12 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతములోనిది) | 0 | 4 |
| డిటో గట్టుప్రభుకృతము | 0 | 6 |



శ్రీరస్తు.

# కవిరాజమనోరంజనము





## పీఠిక.

కెంగేల వెలుంగుతమ్మికిఁ జెవం జెల్వొందు చెంగల్వకున్
వ్యాకోచస్థితిసామ్యమై యెసఁగఁగా నర్కేందుబింబాక్షివీ
క్షాకారుణ్యరసాప్తిఁ బత్రియకు వేడ్కన్ శ్రీయుఁ లీలానృసిం
హాకారోజ్జ్వలు మంగళాద్రిపతి నిష్టావాప్తికై కొల్చెదన్. 1

చ. ఒకవదనంబుఁ ద్రిప్పి మఱియొక్కముఖాబ్జము ముద్దుగొంచుఁ బా
యకయును వేఁడుకోఁగఁ బొలయల్కనెపంబున నిట్టులాస్యపం
చకమును నొక్కచుంబనరసస్పృహఁ ద్రిప్పుచుఁ దత్సఖీచితో
త్సుకమున నవ్వుచున్ గిరిజఁ జూచుశివుం గొలుతు న్మదాప్తికై. 2

శా. వైరాగ్యార్థవిచారవేళ మదనవ్యాపారశాస్త్రైకవా
చారూపంబున లోనఁదోఁచుచు భ్రమించన్ వాణిధార్త్యంబు వెం
పారన్ బుద్ధినెఱింగి నవ్వుచుఁ దదీయాంగం బెదం జేర్చు లో
కారాధ్యుండు విరించి శ్రీకలితవిద్యాస్ఫూర్తి నా కీవుతన్. 3

సీ. తనచూపులకుఁ గల్పతరుకామధేనుచింతామణు లంశమాత్రములు గాఁగఁ
దనప్రసన్నతకుఁ జంద్రకలాపకమలజైశ్వర్యమహోన్నతుల్ సాక్షిగాఁగఁ
దనపెంపునకు దేవతానితంబవతీకదంబంబు దాసీజనంబుగాఁగఁ
దనకథావిస్తారతకు సర్వవేదశాస్త్రంబులు వందిబృందములుగాఁగఁ
తే. దనరు నేచెలి లిప్తచందనసుగంధ, సరసవిష్ణుభుజాంతరసౌధసీమ
నమ్మహాదేవి పరమకళ్యాణి లక్ష్మి, చేరి మమ్ముఁ గృతార్థులఁ జేయుఁగాత. 4

శా. సీమంతాగ్రరజాం. ప్రస్ఫుట వెలుఁగ్ శ్రీవాగ్విభూటుల్ ప్రియా
రాష్ట్రశ్రేణి కదంబకుంపకతరావర్ణస్థలుల్ కేకికా
ఘామంబుల్ కలితాద్రికందరము లౌదార్యంబు భోగావవ
గ్రామోదాత్తము లైన హైమవతి భాగ్యస్ఫూర్తి మాకీవుతన్. 5

శా. శ్రీచింతామణి మంత్రదేవత జగత్క్షేమంకరాపాంగవీ
క్షాచంద్రోదయభక్తశేవధి మహాసంగీతసాహిత్యవి
ద్యాచాతుర్యస్తనకుంభ శారద ముదీయస్వచ్ఛజిహ్వాస్థలిన్
వాచాన్యత్వము పల్కుగాత్రతఁ గవిత్వస్ఫూర్తి వర్తిల్లఁగన్. 6

ఉ. పుష్కరపీఠతుండపరిపూరకలీనసమస్తమైన యా
పుష్కరధిన్ నభస్థలికి పూత్కరణోద్ధతిఁ జిమ్మియచ్చటం
బుష్కరవాహినిం గలయఁబొందొనఁగూర్చిన విఘ్నరాజు ధీ
పుష్కరహేతి మత్కృతికి భూరిజయాభ్యుదయం బొసంగుతన్. 7

క. శ్రీరామాయణకావ్యక,శారూపవచోవివేకి నవాల్మీకిన్
భారతభాగవతాదిక,ధారచనోల్లాసు వ్యాసుఁ దలఁచి భజింతున్. 8

చ. అనఘుల సంస్కృతాంధ్రకవితాఢ్యులఁ జేరికొని సన్నుతింతుఁ బెం
పునఁ దగుకాళిదాసు భవభూతిని దండిని బాణునిన్ మయూ
రుని మఱి మాఘు భారవిని రూఢిగ నన్నప భీము నెఱ్ఱమం
త్రిని నలసోము భాస్కరునిఁ దిక్కన బమ్మెర పోతనార్యునిన్. 9

ఉ. ఎవ్వరికెంతబుద్ధి పరమేశుఁడు దాఁ గృపచేసె నట్టిదై
నివ్వటిలుం గవిత్వరుచి నేరుపు చాలినఁ జాలకుండినన్
నవ్వక వర్తమానకవినాథులు చేకొనరయ్య మత్కృతిన్
బువ్వులు గందకుండ రసముం గొను తేఁటులవంటి నేర్పునన్. 10

ఉ. చెల్లునటంచు నొక్కకవి చేసినలక్షణ మొక్కరివ్వలన్
జెల్లమిఁ జేసి తారొకటి చెప్పఁగ ఛాందసవిస్తరంబు సం
ధిల్లుటఁ గావ్యశంక లవనిం బఱచయ్యె రసజ్ఞులార నా
యుల్లపుసౌధవీథిఁ గొలువున్న సరస్వతి సత్యవాణి నా
తల్లి యొసంగుపల్కు లివి తప్పులు సేయక చిత్తగింపుఁడీ. (పంచపాది) 11

చ. పలుమఱుఁ దప్పులే వెతకఁ బొల్పడి యుండుటగాక దుష్కవుల్
తెలియఁగఁ జాలురెట్లు రసదీపకకావ్యకళారహస్యముల్

తలఁపఁ బ్రపూతిహేయకలితవ్రణశోధనవాంఛగాక యీఁ
గలకుఁ బటీరచర్చితసుగంధతనుస్థితి బుద్ధిగల్గునే. 12

వ. అని యిష్టదేవతాప్రార్థనాచరణంబును బూర్వకవీంద్రసంస్మరణంబును నవీనకవిజనానుస్మరణంబును గుకవితృణీకరణంబునుం గావించి యొక్కపుణ్యకథారత్నంబు రచియించుయత్నంబునం గుతూహలదోహలం బైనచిత్తంబున నిట్లని వితర్కించితి. 13

తే. ప్రాజ్ఞులు ప్రబంధకల్పనాపాటవంబు, గలుగుటకు సత్ఫలంబుగాఁ దలఁచి కృతులు
చేయుచుందురు జగదేకనాయకునకు, నచ్యుతున కంకితముగఁ గృతార్థులగుచు. 14

క. ధాతలకుధాత భువనత్రాతలకున్ దాత శౌరి రక్షకుఁ డట యా
దాతలదాత న్విడిచి యిలాతలనేతల నుతించు లాఘవమేలా. 15

సీ. కృపఁ జేసె భువనముల్ కీర్తింప ధ్రువునకుఁ జెలఁగి యొన్నాళ్లకుఁ జెడనిపదవి
యొసఁగె విభీషణాఖ్యునకు నాచంద్రతారార్కంబుగాఁగ లంకాధిపత్య
మిచ్చెఁ గుచేలున కిష్టార్థసిద్ధియా సరివోల్పరానియైశ్వర్యమహిమ
దత్తంబుచేసె గంధవహాత్మభవునకు వరభవిష్యద్బ్రహ్మవైభవంబు

తే. వాసుదేవుండు బ్రహ్మాండవల్లభుండు, భక్తజనులకు సకలసౌభాగ్యదాత
దాతమాత్రంబె మోక్షప్రదాత యతఁడె, యతని నుతియించుకంటె భాగ్యంబు [గలదె.

మ. చతురుల్ పూర్వకవీంద్రు లన్నిటను నేస్వల్పజ్ఞుఁడన్ స్వామికిన్
హితమో కాదో మదీయకావ్య మని నాకేలా విచారింపన
గ్రతనూజుల్ వ్యవహారకర్తలయినం గానీ కడుంబాలుఁడౌ
సుతునవ్యక్తపుమాట తండ్రి కొదవించుంగాదె యానందమున్. 17

మ. తనుఁ దా మెచ్చుకొనంగ నేటికిఁ గవిత్వప్రౌఢి యాంధ్రీఘన
స్తనకుంభస్ఫురణన్ నవీనమృదుచిత్రశ్రీపదాచ్ఛాదనా
భినవాలంకరణార్థసూచనల సంప్రీతిన్ మనోవీథులం
జొనుపంగల్గిన నింపుతో విని రసజ్ఞుల్ మెచ్చినం జాలదే. 18

క. ప్రాచీనకవిక్వచిదుపసూచితకథ సుకవిరచనసొంపున వితతం
బై చిత్తము లలరించుం, బ్రాచురగతిఁ గనకఘటితరత్నము భంగిన్. 19

వ. అట్లుగావున మదీయసరస్వతీవిలాసంబువలన సార్థకనామధేయంబుగాఁ గవిరాజమనోరంజనం బను నొక్కసత్ప్రబంధంబు రచియించి మజ్జన్మసాఫల్యంబుగా భగవదర్పణంబు గావింతు నని తలంపున. 20

ఉ. శ్రీరమణాంకితంబుగ రచింపఁగ యోగ్యత గల్గి వీరశృం
గారరసాదిలీలలఁ బ్రగల్భతకున్ బుధు లౌననంగ వి

స్తోత్రము సేయంగాఁ దగినసత్కృతి యెయ్యది గల్గునో యటం
చాదమిచుక్ మదీయహృదయంబునఁ గోర్కులు నివ్వటిల్లఁగన్. 21

తే. ఉండ నొకనాఁటి రేయి నాయుల్లమునను, మత్ప్రభుండైనయట్టి శ్రీమంగళాద్రి
నిలయు నరసింహు భక్తవత్సలు దలంచి, శయ్యమీఁదను నిదురించుసమయమునను. 22

సీ. శతకోటికందర్పసౌందర్యరేఖావిమోహనంబు ఖగేంద్రవాహనంబు
హారకోటీరకేయూరాదిభూషణస్ఫూర్జితంబు కలంకవర్జితంబు
దరహాసహాసితవిస్ఫురితజీవంజీవజీవితంబు సుపర్వసేవితంబు
సంపద్విలాసినీసరసభుజాలతాలింగితంబు కృపాతరంగితంబు

తే. గురుతరానంతకల్యాణగుణమహోఘ, రంధరంబు లసత్కంబుకంధరంబు
విష్ణుదివ్యస్వరూపంబు వేడ్కతోఁ బ్రసన్నమయ్యెను మామకస్వప్నమునను. 23

వ. ఇట్లు మదీయజన్మాంతరసహస్రసంచితతపఃఫలంబునం బ్రసన్నంబైన భగవద్దివ్యమం
గళవిగ్రహంబుఁ సందర్శించి కంచుకీకృతపులకోద్గమశరీరుండనై యానందరసకందళిత
హృదయారవిందుండ నగుచు లేచి సాష్టాంగవందనంబు లాచరించి నిలిచి స్తోత్రం
బులు చేయుచున్ననన్నుం గరుణామృతశీతలకటాక్షంబుల వీక్షించుచు గంభీరమృదు
మధురభాషణంబుల నిట్లని యానతిచ్చె. 24

క. మును వనిరుద్ధచరిత్రం, బనుకృతి రచియించి మంగళాచలపతినై
తనరారు నాకు నంకిత, మొనరించితి వేను బ్రీతి నొందితి నింకన్. 25

శా. మద్భక్తుండు పురూరవుండు మును ధర్మంబొప్పఁ బాలించె నే
తద్భూమండల మేకచక్రముగఁ దద్వార్తల్ పురాణోక్తముల్
తద్భావార్థ మెఱింగి విస్తరము నొందం జేయు మస్మత్ప్రసా
దోద్భూతాద్భుతశేముషీచతురవాగ్యుక్తిం బ్రబంధంబుగన్. 26

వ. తత్ప్రబంధరాజు మద్గోపాలనామాంకితంబుగా రచియింపుము మదీయకృష్ణావతారసగు
ణబ్రహ్మోపాస్తిపరులు నాకుం బ్రియతములు గావునఁ దద్రూపంబున నీచే నుపాసి
తుం డైననీహృదయంబున నివసింతు నని యానతిచ్చి యప్పరమేశ్వరుం డంతర్థా
నంబుఁ జేసినట్లయిన మేలుకాంచి యాశ్చర్యమిళితప్రమోదమానసుండనై యద్ది
వ్యవిగ్రహంబుఁ దలంచి మ్రొక్కుచుండితి నివ్విధంబున నిష్టదేవతానుగ్రహంబు
వడసినవాఁడనై తత్ప్రబంధంబు రచియింపఁ బూని, కవిసమయసిద్ధతావిచారంబున
మద్వంశక్రమం బెఱింగించెద. 27

శా. శ్రీపేర్మిన్ శశివోలె బ్రహ్మకులవార్ధిం బుట్టి కౌండిన్యగో
త్రాపస్తంబపవిత్రసూత్రకలితుం డై రామసింహాసనా

భ్యోపేతస్ఫుటకొండవీటిపురరాజ్యోర్వీశ్వరుల్ మంత్రిగాఁ
జేపట్టన్ బసవప్రధానుఁ డిలమించెన్ భాగ్యసంపన్నుఁ డై. 28

క. ఆమంత్రిమణి ప్రకాశన,భామణి కనుపర్తిబుక్కపురిముఖ్యబహు
గ్రామస్వామ్యానుభవ,గ్రామణి బుధనుతుల సుతులఁగాంచె నలువురన్. 29

వ. తదీయనామాభిధానసౌగుణ్యక్రమంబు. 30

తే. అమరమంత్రి గుణంబుల నమరమంత్రి, ముమ్మహిమ వెల్ప ప్రభనొప్పుముమ్మఘనుఁడు
పెద్ద నానాచమత్కృతిఁ బెద్దనార్యుఁ, డెల్లసచివుండు సంస్తుత్యుఁ డెల్లసభల. 31

ఉ. అం దసమానకీర్తియుతుఁ డైతగుముమ్మనమంత్రిమౌళికిన్
నందనుఁ డై జనించె సుజనస్తవనీయుఁడు తిమ్మనాథుఁ డిం
పొందుసమస్తసంపదల నున్నతిఁగాంచెను గొంకమాంబ రా
కేందునిభాస్యఁ గూర్మిగృహ్యాపమేశ్వరిఁగా భరించె వేడుకన్. 32

క. ఆతిమ్మమంత్రివరునకు, సూనుం డై యబ్బనార్యచూడామణి పెం
పూన జనియించెఁ గొండాం,బానిరుపమగర్భశుక్తిమౌక్తిక మగుచున్. 33

చ. సుగుణకదంబ మెల్ల నొకచోటన కాఁపురమున్నయట్లుగా
నగునని వేయునోళ్లఁ గొనియాడుచు భూజను లెంచ ధన్యుఁడై
తగుకనుపర్తియబ్బనకు దక్షప్రియసాధ్వి లచ్చమాంబకుం
బొగడిక కెక్కి పెద్దలు సుపుత్రులు రాయన తిమ్మనాహ్వయుల్. 34

ఉ. వేయనవచ్చుఁ గాక సుజనే యనపాయవదాన్యవైభవం
బాయనవద్యబుద్ధి తగునాయనకే యనఁ గీర్తిచంద్రికల్
గాయ నయస్వగీతికలు గాయకులెల్లరు పాడ నొప్పు మా
రాయనమంత్రిమేలు బళిరా యన సూరిజనాభినంద్యుఁ డై. 35

క. ఆరాయనార్యమణికి వధూరత్నము నరసమాంబ దొరయన్ సుగుణ
శ్రీరమణీయత ననసూ,యారుంధతు లనఁ బతివ్రతాభరణం బై. 36

తే. అట్టిదంపతులకు నన్వయాభివృద్ధి, యొదవఁ బుత్రుల విరువుర ముదయమైతి
మగ్రజుండు యోగానందుఁడన సుచరితుఁ, డబ్బయామాత్యుఁ డంద్రుమదాహ్వయంబు.

క. శ్రీమంగళగిరినరసిం,హామేయకృపావిజృంభితాద్భుతకవితా
శ్రీమంతుఁడ గానకళా, ధీమంతుఁడ దేవతాస్తుతివ్రతపరుఁడన్. 38

వ. ఈదృశుండ నగునాచేతన్ గ్రథితం బగు నేతత్ప్రబంధంబున కధీశ్వరుం డయిన
శ్రీరాజగోపాలప్రభుండు. 39

సీ. యదువంశజలధిరాకామృతభానుండు భానుండు యోగిహృత్పద్మములకుఁ
త్రైలోక్యహితకరానేకవేషనాథుండు నాథుండు బ్రహ్మాండయూథములకు
బకశకటాసురఘాతప్రవణబాలుండు బాలుండు నందగోపాలసతికిఁ
కృతవైణవికనాదసత్ప్రబంధుండు బంధుండు వల్లవీప్రాణములకుఁ
తే. గోమలశ్యామలామ్ముగ్గ్రామలామ,కప్రకాండకాండాసనరాజమాన
సాంద్రచంద్రకనవచంద్రకీంద్రబర్హ,శేఖరుఁడు కృష్ణగోపాలశేఖరుండు. 40

సీ. వసుదేవసూనుఁడైనయ్యు గోపాలసుఁడు నవనీతచోరకుఁడయ్యు నిస్పృహుండు
కాముకుఁడయ్యు నష్టలోభవటుండు నృశంసహింసకుఁడయ్యు సర్వసముఁడు
సంసారియయ్యు నిస్సంగుండు ద్వారకావాసుఁ డయ్యును జగద్వ్యాపకుండు
మాయావియయ్యు నిర్మలమానసుండు కార్యప్రవర్తకుఁడయ్యు నఖిలసాక్షి
తే. రాజగోపాలలీలావిరాజమాన, దేహభృద్బ్రహ్మతత్త్వంబుఁ దెలిసిపొగడ
వేయిమోములు గలశాస్త్రవేదులోక,సార్వభౌమునకైన వశంబుగాదు. 41

సీ. వాసుదేవఖ్యాతివర్తిల్లె నెవ్వాఁడు భవముచే మూర్తివైభవముచేత
నఘవిఖండలలీల నమరారె నెవ్వాఁడు శక్తిచేఁ జరణాంబుశక్తిచేత
గాళిందెఁగదిసి వేశ్యలుసల్పె నెవ్వాఁడు రతులచే వనకేళిరతులచేత
గీతామృతవ్యాప్తిఁ గీల్కొల్పె నెవ్వాఁడు నయముచేఁ దత్త్వనిర్ణయముచేత
తే. దెలిపె నెవ్వాఁడు కంసమాంసలమతంగ, భూహననధాటిచేఁ దనపురుషసింహ
మూర్తివిస్ఫూర్తి యసమానకీర్తి యతఁడు, సంహృతార్తార్తి యాభీరచక్రవర్తి. 42

## షష్ఠ్యంతములు.

క. ఈవృక్షవ్రీకారసారగు, ణోదారున కాశ్రితవ్రజోభయసుఖదా
నోదారున కవనీభృద్భూదారున కమృతజలధిభూదారునకున్. 43

క. మండితగుణపండితహృద,ఖండితవిజ్ఞానహంసకాసారునకుం
గుండలరుగ్మండలభృ, ద్గండలసద్దరహాససుధాసారునకున్. 44

క. బంధురతరరవమురళీ,గాంధర్వసుధాస్రవంతికాలహరీసం
బంధోదితప్రవాళ, స్కంధస్థాణునకు భజదజస్థాణునకున్. 45

క. వరఖద్యుమణికి సాష్టో, త్తరశతషోడశసహస్రతరుణీయుగప
త్స్వరతోచితబహుతనుభా,సురదక్షిణనాయకైకచూడామణికిన్. 46

క. ద్విజరాజకకుబధీశ, వ్రజరాజతనగపమృగ్యపదునకు వీణా
ద్విజరాడ్ద్విజరాజ, ద్విజరాజముఖాచ్ఛకీర్తివిభవపదునకున్. 47

క. పరగోపీగోపితసత్పరిమళహయ్యంగవీనపాటచ్చరతా
స్ఫురితునకుఁ రాధాకుచభరితునకుఁ దురితహరణపటుచరితునకున్. 48

క. రాసక్రీడానటనవిలాసవశీకృతనభస్స్థలస్థాస్వప్స
స్త్రీసముదయహృదయునకుఁ, వ్యాసాదిమునీంద్రవర్ణితాభ్యుదయునకున్. 49

క. శుంభదవష్టంభభుజా, స్తంభాగ్రహతాచ్ఛపేటికంబాహతి సం
రంభహతకంసభూభృత్కుంభితగోత్రునకు భరితగురుగోత్రునకున్. 50

క. గోగోచరబలవిక్రమ, గోగోచరతాహృతాకగోపాలునకుఁ
గోగోనియమితనానా, గోగోపాలునకు రాజగోపాలునకున్. 51



# ప్రథమాశ్వాసము.



వ. నాయొనర్చంబూనిన కవిరాజమనోరంజనం బగుప్రహారవశ్చరిత్రంబునకుం గథా
ప్రకారం బెట్టిదనిన సకలమునిజనైక్యాకర్షణం బగునైమిశారణ్యంబునం బుణ్యకథా
శ్రవణోల్లాసవికాసనుఖులు శౌనకప్రముఖులు సమస్తపురాణవాణీమణిస్యందన
సంచారకరణప్రవీణసూతుం దగుసూతుని వలన నుపహారచితం బగుప్రహారవశ్చక్రవర్తి
చరిత్రంబు విని సవిస్తరంబుగాఁ దెలుపవలయునని యడిగిన నక్కథకుం డిట్లని
తెలుపం దొడంగె. 52

## ప్రతిష్ఠానపురవర్ణనము.

సీ. వరణాగ్రమణిరాగభరణాంచదురుమూర్తనుమహాంసశుభ్రాంశుమండలంబు
బహుళసౌధావళీప్రతిబింబభాస్వహార్ద్రస్వజనస్వర్గకీర్తికామ్యృతంబు
నీలనభోవాపనిశ్చయాపాదకాగరుధూపధూమరేఖాస్థిరంబు
ప్రతిపదాలిప్తజంబాలకస్తూరికాప్రకటితస్వర్గజగోత్రాస్థలంబు
తే. ఘటితకుట్టిమపటుకీరకాంతికామ్య, దీపితరావరమణపటలావిభూర
యత్రియామామోత్కరంబు విచిత్రవిభవ, సుచిరంబు ప్రతిష్ఠానపురవరంబు. 53

సీ. పణ్యస్థలములెల్లఁ బద్మాకరములు పద్మాకరతతులు మహావనంబు
లావనంబులు వినోదాగంబు లావినోదాగము ల్గోపురాగ్రాంచితములు
గోపురాగ్రంబులు గురుసభావళులు సభావళుల్ దైవాలయములు చూడ
దైవాలయంబులు ధామస్థితుల్ మరి ధామస్థితుల్ కుంభధర్మలరయ
తే. ధర్మ్యలతిభద్రకరులు తద్భద్రకరుల, యూథములు సెన్నఁగాఁ బ్రమదోత్కరంబు
లచటఁ బ్రమదోత్కరములు ప్రభాసమాన, లనఁ బ్రభాసమానం బగు నప్పురంబు. 54

చ. నయగుణరత్నసంయుతి వనప్రకటోన్నతి రాజమండలో
దయపరిజృంభమాణత సుధామహితస్థితి శ్రీవిలాసనం
శ్రయత వసంతభోగవిలసత్పురుషోత్తమయుక్తి వర్ణితం
బయి కలశాంబురాశిగతి నన్నగరంబు గరంబు చెల్వగున్. 55

తే. రాజమార్గంబు నక్షత్రరాజితోడ, నంతరిక్షంబున వెలుంగు నెంతయునుగ
రాజమార్గంబు నక్షత్రరాజియగుచు, నగరమధ్యంబునందు నున్నతివహించు, 56

శా. క్రీడాశైలకరీపరిస్ఫుటపరిస్థాపితాంచత్పతా
రాడశ్మచ్ఛటలం గరంచు విలసద్రాకానిశాభాసమా
నోద్యత్ప్రాకపసాంద్రచంద్రికతదీమోదప్రస్తారంబు జా
తై దీప్త స్నేలమేఖులై పురివిహర్తృప్రహ్లాదము జేయుచున్. 57

సీ. చక్రవాళధరాధరక్రియాచాతురిం గొంకు దేఱినపాణిపంకజమున
మహనీయజలధినిర్మాణకేళీలీల వడఁకు దేఱినకరవారిజమునఁ
గలధౌతకాంచనాచలశృంగరచనచే నసకు దేఱినహస్తజలరుహమునఁ
నలచైత్రరథనందనారామకల్పన నారి తేఱినశయాంభోరుహమునఁ

తే. గనకగర్భుండు నిర్మించెఁ గనకఘనక, శైలశిలాపతనసమాన మై వెలుంగు
వరవరణభేయహర్మ్యోపవనచయంబు, లప్పురంబున భువనంబు లభినుతింప. 58

తే. సర్వతోభద్రరేఖాప్రశస్తివలన, భాసురంబైనయట్టియప్పట్టణంబు
సర్వతోభద్రరేఖాప్రశస్తివలన, భాసురంబైన జ్యోతిషప్రతిభఁ గాంచె. 59

క. పుటభేదనపటుకేతన, పటసంచలదంచలముల భాసిలుఘటిత
స్ఫుటముక్తామణిరేఖా, మటిమం దారాగణము విభావరి వేళన్. 60

మ. పురనానామణిహర్మ్యదేశచరసంభోజాంబకాస్యచ్ఛసుం
దరత లూనిన కన్నులన్ నిహితతద్వారస్థలాదర్శ వి
స్ఫురితాత్మప్రతిబింబములని సుమీ పూర్ణప్రభాపూర్ణిమా
హరిణాంకుండు వివర్ణుఁడై యరిగి కార్శ్యంబందు నంతంతనున్. 61

తే. అలమృగాంకుండు వాతాయనాంతరములఁ, దూఱిపోవుచుఁ జరియించుకారణమున
లీలఁ బురహర్మ్యములు చంద్రశాలలయ్యెఁ, దత్సుధాసేచనమున సౌధంబు లయ్యె.62

సీ. గగనగంగాతరంగములఁ దోఁగినచల్లగాలి ఘర్మాంబుశీకరము లణఁప
నమృతంబుచిలుకు శీతాంశుబింబమరీచు లాయాసఖేదంబు నపనయింపఁ
బరువమై చెలువొందు పారిజాతద్రుసూనచయంబు పరిమళానంద మొసఁగ
వీణారవంబుతో వీతెంచుకిన్నరీజనగానములు చెవులుల్లసేయఁ

తే. జొక్కి నిదురింపుదురు గాఢసురతజనిత, మోహబంధానుగుణనిజబాహుబంధ
విరచనైకీభవత్పరస్పరశరీరు, లగుచు దంపతు లప్పురహర్మ్యములను. 63

తే. కమలబంధుండు మధ్యాహ్నకాలమునను, దామహోశ్వరుఁ డైనచందంబుఁ దెలుపు
రజతకుధరాధరావతారప్రకార, హీరసౌధాగ్రసీమలఁ జేరి పురిని, 64

తే. మీనకర్కటమకరసంస్థాన మగుచు, సొరిదిఁ బ్రతిబింబమిషమున సూర్యచంద్ర
తారకాదులు తనయందుఁ జేరియుండ, గగనమును బోలియొప్పు నన్నగరిపరిఖ. 65

క. పరిసరపరిఖాసలిలాం, తరమున వెసఁ జొచ్చి మత్స్యవర్ణనకాంక్షా
పరతఁ బఱతెంచి యీఁదుచు, శరములపైఁ దేలుదురు రసాతలభోగుల్. 66

సీ. లలితచందనలేపకలితసుందరవళీసోపానముల జంగఁ జాఁచియెక్కి
ఘనతారహారసుస్తనభారగిరిశృంగములపైఁ జిఱుతబండలాడు
నవమానపీఠికాసహసితాధరామృతక్లిష్టి కలశుఁ జేయాఁత్రలీఁదు
హేలారచితపుష్పమాలాకచికకేశబృందమల్లములతోఁ బెనఁగులాడు
తే. సురతనాట్యకళాంతకేళిరతకామ, కమలజాతావసరతీవ్రగాఢకేళి
ఘనపరిశ్రమజాలజపౌరయువతి, జాలకనుసీమల సమీరబాలకుండు. 67

చ. చను నెడ దక్షిణాయనవిషంబునఁ గొన్నిదినంబు లుత్తరా
యణమునఁ గొన్నినాళ్లు గగనాంతరసీమ వెలుఁగుచుం బురిం
గనఁబడు చోద్యముల్ గలయఁ గన్గొనుచుండుదు రెల్లకాలమున్
ఘనమగువర్ష్మనేర్పులకు నైరిణీనగరీమనోహరుల్. 68

సీ. ప్రాకారమమరేంద్రలోకాంత మన్నచో హర్మ్యజాలోన్నతు లడుగ నేల
ధామంబులెల్ల రత్నమయంబు లన్నచో నొదలిసొమ్ములవింత లడుగ నేల
ప్రతివీథియు సుగంధరససిక్తమన్నచో నంగరాగములమే లడుగ నేల
త్యాగంబు లర్థికభ్యధికంబు లన్నచో నైశ్వర్యవిభవంబు లడుగ నేల
తే. శుకపికాదులు సరసవచోవిలాస, కృతపురాణప్రసంగమోదితజనాళు
లన్నచో విద్వదధికార మడుగ నేల, జగదలంకార మైనయన్నగరమునను. 69

సీ. అశ్రాంతనియతిఁ బద్మాసనస్థితు లౌట భాషాప్రియోదారభావు లగుట
సత్యప్రవర్తనశ్లాఘ్యత వెలయుట సామ్నాయమతి చతురాస్యు లగుట
విబుధాగ్రగణ్యతావిస్ఫూర్తిఁ గాంచుట సన్ముఖాంభోరుహజనితు లగుట
హంసేశహారిహితోద్వృద్ధతి మెలఁగుట సామనోధర్మాగ్రజన్ము లగుట
ఆ. నలహిరణ్యగర్భు నపరావతారంబు, లగుట కింతసంశయంబు గలుగ
దప్పురంబులోన నొప్పారుచున్నట్టి, భూమిసురులమహిమ పొగడవశమె. 70

సీ. పౌరుషంబుకొలంత పోరవిరోధంబుఁ గలుగ దీరాజశేఖరులయందుఁ
బతిపాతంబు స్వభావకాఠిన్యంబు పొరయ దీగోత్రాధివరులయందుఁ
నోరుదండనిలిచి యేయుంట వైరిఘాటికి విముఖతా టెఱుఁగ మీవిజయులందు
సత్కళామిత్రత శాత్రవుఁదలచూప నిచ్చుటఁ జూడమీయినులయందు

తే. ననుచు జను లెంచ మఱియుఁ గళ్యాణగృహనివాసులై నిత్యధర్మవిలాసులై య
నంతరాయభోగిష్ఠులై యమితవాహవంతులై బాహుజులు ప్రవర్తింతు రచట. 71

మ. తమకుం జాలినవర్తకం బతనిచేతం గామినో శంఖప
ద్మమహాపద్మము లర్థపుఁ గెడిచె ప్రేమం దత్పురీవైశ్యస
త్తములం జేరెనసంగ శంఖములు పద్మంబు ల్మహాపద్మముల్
ప్రమితార్థంబులవృద్ధిఁ బొంది సిరులన్ భాసిల్లుఁ దద్గేహముల్. 72

ఉ. అద్రులు ధైర్యవైభవసమగ్రత బ్రాహ్మణసేవచే సదా
భద్రులు బాహుశక్తిబలభద్రులు రుద్రముకుందభక్తిని
క్షుద్రులు సత్కృపాగుణసమృద్ధిసముద్రులు చారుకీర్తిస
త్పుద్రులు శూద్రు లొప్పుదురు చూడఁ బురిన్ సుకృతైకముద్రులై. 73

ఉ. హైమమనోజ్ఞమైనపురిహర్మ్యచయంబున మర్త్యసంపతుల్
ప్రేమలతోడఁ గూడి విహరించుచు నింపుగ షడ్జమధ్యమ
గ్రామముల న్వినోదగతి గానము సేయఁగ నాలకించుచున్
వేమఱు మెచ్చుచుందు రతివింతగఁ గిన్నరదంపతుల్దివిన్. 74

క. పురిగోపురాగ్రసింహో, పరిగతమధ్యాహ్నసమయభానుఁడు వోలుచున్
నిరతముఁ బ్రపూర్ణదీధితి, నరయన్ స్వక్షేత్రవాస మని తలఁచియొకో. 75

క. పాలంబులకొమ్ములు సుర, సాలంబుల నంటుకొనఁగ సారికెఁ బురిలో
సారంబులకొమ్ములుసుర, సాలంబుల నంటుకొనుఁ బ్రశస్తస్ఫూర్తిన్. 76

చ. అతనునిముల్కులో చిగురుటాకులొ కుందనపున్ సలాకలో
రతనపుతేటలో తొగలరాయలచాయలనిగ్గులో తటి
ల్లతికలొ పువ్వుగుత్తులొ విలాసరసంబునఁ బోసినట్టియా
ప్రతిమలొ వీరనంగ బురిఁ బంకజగంధులు వొల్తు రెంతయున్. 77

సీ. పాలఁతులవలుదకొప్పులుచూచి నిజశాంబరీతమోనిర్మాణరీతి మఱచి
తరుణీకటాక్షపాతచమత్కృతులు చూచి శరసంప్రయోగవైఖరులు మాని
వనితలమధురనిస్వనకంఠములు చూచి విజయశంఖములపై ప్రేమ సడలి
నీలవేణులముద్దుసెమ్మొగంబులు చూచి యలమృగాంకునిసహాయంబు వదలి

తే. యలఁతఁ దీఱుచుకొనుఁ గుసుమాయుధుండు, రతికుచాభోగశయననిద్రాసుషుప్తిఁ
బురుషుల జయించుకార్య ముప్పురివిలాస, వతులచే నౌట నిర్విచారతఁ జెలంగి. 78

సీ. ఆడనేర్తురు మనోహరలీల నృత్యనృత్తంబులు భరతవిద్యానిరూఢిఁ
బాడనేర్తురు రాగపరిమితస్వరసుధావ్యాప్తిచే దారువు లంకురింపఁ

జూడ నేర్తురు యతీశులకైన భ్రమపుట్ట దశవిధవీక్షావధానములను
గూడ నేర్తురు సొంపుగులుక నైంద్రజాలికఫణిపాశముఖరతిబంధములను
తే. సరససౌందర్యవిద్యాప్రసంగగరిమ, రసికనికరకటాక్షపరంపరావి
కాసకుసుమమాలికాస్వలంకరణపాత్ర, లైనపాత్రలు తత్పురియందుఁ గలరు. 79
సీ. కారుకొన్నచికురాంధకారంబులోఁబడి వెలువడుసీమంతవీథులందుఁ
బైకొన్నభృగ్బాణ పంజరంబులఁ జిక్కి కడచుని మేపావకాశములను
మొనయెక్కుడగుఁగుబ్బచనుకొండలెక్కి గాసిలి డిగ్గు హారనిశ్రేణికలను
గనరాని యవలగ్నగగనాంతమునఁ బ్రాకి వ్రాలఁ గాంచీచక్రవాళమునను
తే. బురసమాగతపాంథప్రఘూర్ణకుసుమ, శరవికారవిలోలలోచనదృగంచ
లములఘుంటాపథచరద్విలాసలసిత, వారకన్యావలోకనావసరములను. 80
సీ. వెలకుఁ జూపవు పొన్నవిరి యంతగోప్యమా యడియరంటులలోయ నయ్యోఁజుమ్ము
కప్పుకోసేల బంగారమా పువ్వుబంతు లపెసువర్ణలతోదయములు సుమ్ము
మూసిపెట్టెదు మల్లెమొగ్గ యింతబ్రమా యవిసుధారాశిచేరువ విసుమ్ము
దాఁచుకొంటివి యరుదా నల్లఁగలువ పే రదియగాఢ సరోవహానము సుమ్ము
తే. టంచు ముసిముసినగవు లన్యోన్యవచన, మంజులవ్యంగ్య చాతురీవ్యంజకములు
గా విటులకమ్ముదురు విరులక్కముకైక, జీవికలు పుష్పలావిక ల్సెలగి పురిని. 81
చ. అరదములన్ సృజించి కమలాసనుఁ డుర్వికిఁ ద్రోయ రత్నని
ర్ఘరమునఁ గొన్ని తత్పురినిఁ బ్రాలినఁ జుల్కని వెల్ల నాడ్పు చేఁ
దిరుగుచు మింటఁ జిక్కె నవి దేవవిమానములయ్యె వాని పెం
పరయఁగఁ దక్షమానములయైన విమానములందుఁ గల్గునే. 82
మ. జగతీధ్రంబులు దేవపాపగత సంచారంబులై నిశ్చలం
బగు వృత్తిం దపమాచరించి తతఘంటారావనిర్భీకయా
నగుణోదగ్రతవిగ్రహాంతరము లెన్నం దాల్చుటం గట్టినో
నగసంబంధగతాదివృద్ధి యనఁగా నాగంబు లొప్పెంబురిన్. 83
చ. అరివిజయప్రతాపఘనయానమహీభృదుపాశ్రయంబులం
బరఁగినవాటఁ గైటభవిఖండనజంభమదాపహారకుం
బరరిపువిక్రమానుగుణసారతఁజొప్పడు నప్పురీహరుల్
హరులను నామధేయములు సార్థకమై యనువొందునట్లుగన్. 84
క. వాసవవాసవదీప్తన, వాసిని వాసిని జయించునయ్యాయుధముల్
జేసిరికే పరిపత్తురు, భాసురభాసురవు లచటిభటు లుద్వృత్తిన్. 85

వ. వెండియు నప్పటభేదనప్రకాండం బఖండతాండవపాండిత్యవికస్వరశిఖండిశిఖండి
మదోత్సాహకృదాఖండలకోదండమండితకాండమండలాయమాన విచిత్రచిత్రధ్వజ
పటపటలకిమ్మీరశోభామిళితభ్రభ్రమదభ్రభ్రమశుభ్రకరవిభ్రాజితధూపధూమరేఖాబహు
ళంబును భరతసంగీతకళాకలాపినాప్రవీణవాణీనిశ్రేణివివిధవిధనాట్యవిజృంభణచ
లపదాణచరణరణదకులకులాకోటిచాటుకంకిణీకలితతాళతత్కారపల్లవితంబగుటలము
ఖరేచితమకరాపిద్ధప్రచండపక్షోద్ధ్వమండలీప్రముఖకరకమలవిక్షేపజనితకంకణఝు
ణఝుణతత్కారకనకరశనాగుణ కింకిణీకాఘనఘనతత్కారమార్దళికకరయావా
తమృదంగాధంధిమిధిమితాంగాకసమ్మిశ్రసాంద్రస్వన ఘుమఘుమితనాట్యశాలాజా
లకేళనంబును ప్రభుసేవాసమాగతసంకీర్ణకర్ణాట లాటవరాటకాంభోజ కాశ్మీరకురుకురు
కురు గాంధారసౌవీరసౌరాష్ట్ర మగధమద్రమాళవ నేపాళబంగాళకళింగద్రావిడకేరళ
గూర్జరప్రముఖనానాదేశవసుంధరావరాన్యోన్యసంఘర్షణసముద్ధూతశుంభచ్ఛాతకుం
భభూషావిశేషరజఃపుంజనికరా విరాజమానరాజమార్గంబును కృతకశిలోచ్చయనిచ
యసముత్తుంగశృంగస్థాపితదీపితహరివాతాంబరచుంబితంతికదంబాడంబరనిష్కళం
కితశంబరభవనికురంబవిరోధివింబంబును మహామహోన్నతహాటకహర్మ్యసమూహ
శిరోగేహదేహళీప్రముఖగృహాంగణస్థగితరోహిణీకాంతకాంతోపలదృశ్యమాన నిజ
ప్రతిబింబవిలోకనసంజనితాన్యవాహసందోహమోహాసముత్సాహ హేతుహేషా
విశేషఘోషబంధురసముల్లంఘనోద్ధత కబంధజబాంధవసైంధవాహంకార హరణ
హుంకారతోత్రతాండవసంభ్రమత్కార ధీరగరుడాగ్రజంబును సంతతవసంతసౌభా
గ్యసంపదుద్యదుద్యానవాటికాచ్ఛటాభ్రంకషవివిధవిధశాఖిశాఖోపశాఖాశిఖరసు
ఖాసీనశుకశారికానికరమధురమధురవచనరచనాచమత్కారసరసకథాప్రసంగసంశ్ర
వణకుతూహలస్తంభితవిమానగమనపరిసరచరత్ఖచరజంపతినిచయంబును నై వనీభూష
ణంబయ్యును నవనీభూషణంబై వారణదానధారాప్రవాహబంధురంబయ్యు నవా
రణదానధారాప్రవాహబంధురంబై శేషాలంకారమహాస్థానమండపసహస్రశోభితం
బయ్యును నశేషాలంకారమహాస్థానమండపసహస్రశోభితంబై విప్రచయామోదకృ
ద్వైభవరాజద్రాఘిష్ఠంబయ్యును నవిప్రచయామోదకృద్వైభవరాజద్రాఘిష్ఠంబై స్వ
ర్గలోకంబునుంబోలె విబుధసమన్వితంబై సుమేరునగంబునుంబోలె గల్యాణనిల
యంబై సుధాసముద్రంబునుంబోలె లక్ష్మీసముదయస్థానంబై శృంగారవనంబునుం
బోలెఁ దరుణీపురుషసౌమనస్యరమ్యంబై యలకాపురంబునుంబోలెఁ బుణ్యజనవిరా
జితంబై పాతాళభువనంబునుంబోలె ననేకభోగివిలసితంబై శరత్కాలంబునుం
బోలె నపరూపితపంకంబై కమలాకరంబునుంబోలెఁ గవినివహవర్ణనీయంబై సంపద
లకుఁ గొటారును, సారస్వతంబునకు నునికిపట్టును బుణ్యంబునకుఁ దావలంబును

జంభాంతకాదినిర్జరబృందమాననీయప్రాభవంబున నలరుకొఱకు:

తే. ఇంద్రమదనవసంతనాసత్యు లైక, మర్త్యమున నేకరూపమై మహి జనించి
నటులు సౌందర్యగరిమచే నతిశయిల్లుఁ, జారుమూర్తి పురూరవశ్చక్రవర్తి. 93

ఉ. ఆనరనాథుఁ జూచిన లతాంగులడెందపుఁగుందనంపు బయో
గానలకీలిఁ గరఁచి యందుఁ దదీయమనోహరాకృతిం
బూని దృఢంబుగాఁగ నిలుపుక్ వలపుంబడియచ్చుచేర నౌ
సౌనె వినోదము ల్మదనశరాసనకాంచనకారికృత్యముల్. 94

క. ఆనృపతిఁ దలంచినచంద్రాననలకు సాత్త్వికోదయం బగు లక్ష్మీ
జానికళ్లోదితుఁ డట కద్ధ్యానంబున సాత్త్వికోదయం బగు బరుదే. 95

మ. తమప్రాణేశులు గారవింపఁగ నుండక్ నిందుకొంగిళ్ల నం
దముగా నుండియు నప్పురూరవశ్రీసౌందర్యంబు భావింతు రు
ష్ణము దీర్ఘంబును గంపితంబు నగునిశ్వాసంబు వాటిల్ల భ
ర్తృమనశ్శంకగ తాపరాధపురసుక్తిం బాయఁగాఁ జేయుచున్. 96

సీ. కొలువు సేయఁగవచ్చుకొదమరాయపువారసుందరుల్ నృపుసొంపు చూచిచూచి
యాత్మ సాక్షాత్కారమైయున్న యతనికిఁ దమయాననంబులు దన్కనిచ్చి
పరిరంభణాదులైనరహస్యచేష్టల నతఁడు క్రీడించినయట్లు దలఁచి
భ్రాంతితో సత్యానుభవబుద్ధిఁ గైకొని యమానందపారవశ్యంబు నొంది
తే. మగుడఁ దెలివొంది యతనిసన్నిధిగముచూచ,సిగ్గువడుచుందు రేమనిచెప్పవచ్చు
నట్టివలపుల నాఱడిఁబెట్టుచున్న,చెఱపువిలుకానికైతవచేష్టితములు. 97

మ. అయ మర్థిజన యంచు యాచకలలాటాంతస్థలిన్ బ్రహ్మ ని
ర్ణయతన్ వ్రాయవహించునట్టి లిపియర్థంబున్ విశేషాన్వయ
క్రియగా నర్థ మవారితాగానొసఁగి యర్థిం జేయు వాగీశుప్రాఁ
తను నాత్మీయవితీర్ణియు న్నిజముగా ధాత్రీశు నేర్పెట్టిదో. 98

సీ. బిరుదాంకపటజాతమరుదాహతిని విగ్రహములకు నిస్సత్త్వమావహిల్ల
భూరిసేనాసముద్భూతధూళీవ్యాప్తి గాఢాంధకారంబు గ్రమ్ముకొనఁగ
భేరీగభీరభాంకారనాదార్భటిపటిమచే గుండియల్ బగ్గుమనఁగ
శాతహేతిచ్ఛటాచ్ఛచ్ఛవిస్ఫూర్తిచే మిగులుగన్నులు మిఱుమిట్లుఁగొనఁగ
తే. సాలభంజికలనుబోలి శత్రుకోటి, ప్రాపితస్తంభులగుచు దూరములయందు
రిచ్చపడుదురు విజయధురీణుఁడైన, యప్పురూరవుధాటి కేమనఁగవచ్చు. 99

ఘనుఁడైన పురూరవక్ష్మాతలేంద్రుఁ, జూడ నేతెంచుచంద్రునిజాడ దోఁప
నరుగుదెంచె నభోమార్గయానమునను, నారదుఁడు మూర్తిజితశరన్నారదుండు. 106

తే. స్వాంతములు పల్లవించెను సత్కైరవంబు, ముకుళుఁ బంకజాతమ్ముల పొంకమెడలె
భువనము శుభోదయస్ఫూర్తిఁ బొలుపుమిగిలె, నారదాగమమున కది నైజమకద.

వ. ఇవ్విధంబున. 108

ఉ. వచ్చినఁ జూచి లేచి పరివారముతో నెదురేగి యవ్విభుం
డచ్చపుభక్తి మ్రొక్కి కనకాసనసుస్థితుఁ జేసి ప్రాంజలిన్
మెచ్చొదవింపఁగా వినయమేదురమంజులవాక్యవైభవం
బెచ్చ ననేకభంగుల మునీంద్రుఁడు దీవనలిచ్చి వెండియున్. 109

క. కుశలంబె మీకు హితులకుఁ, గుశలమె కుశలంబె బంధుకోటికి నెల్లం
గుశలమె భృత్యశ్రేణికిఁ, గుశలంబె ధరిత్రి ప్రజలకు న్మనుజేంద్రా. 110

వ. అనిపలికిన నాసంయమీంద్రచంద్రునితోఁ జంద్రవంశతిలకుండు వినయ
సంభ్రమమాధురీధురీణవచనంబుల నల్లన నిట్లనియె. 111

క. మీకారుణ్యమువలనను, మాకందఱకు న్సుఖంబు మానీశ్వర మీ
రాకవలన మద్భాగ్యము, లోకస్తుతమయ్యె జగతిలోపల నింకన్. 112

తే. వినుతమోగుణహర్తవై వెలయునీవు, మిత్రరూపంబుతో వచ్చి మేలొసంగ
నిపుడుగద యబ్జకులమున కెలమియగుట, చక్రవర్తిత్వమిఁకఁ గదా స్పష్టమగుట. 113

క. అని పలుకునన్నరేంద్రుని, వినయోక్తుల కలరి మౌనివిభుఁడు తదీయా
ననమునఁ గారుణ్యరసం, బెనయఁ గటాక్షములు నిగుడ నిట్లని పలికెన్. 114

సీ. ఉత్తమాన్వయమున నుదయంబునొందుట సరిలేనిసౌందర్యశాలి యగుట
యఱువదినాల్గువిద్యలఁ బ్రవీణుండౌట పటుబాహుశౌర్యసంపన్నుఁ డగుట
ధరణిచక్రాచలాంతంబుగా నేలుట నిగ్రహానుగ్రహనిపుణుఁ డగుట
వేదశాస్త్రోక్తసద్విధు లాచరించుట యౌదార్యగుణముచే నధికుఁడగుట

తే. హరిహరబ్రాహ్మణార్చనానిరతుఁ డగుట, యాత్మవిదుఁడౌట యొక్కనియందుఁ గలవె
పుణ్యనిధివైన నీయందె పొసఁగె నిన్ని, సద్గుణములు పురూరవస్సార్వభౌమ. 115

క. స్తుత్యుం డమరులకైనను, నిత్యోన్నతుఁ డైనధారుణీపతి "రాజా
ప్రత్యక్షదైవత" మ్మన, సత్యవ్రత పూర్వవచనసంగతి వినవే. 116

వ. అనిపలికి వెండియు నమ్మహానుభావుం డమ్మానవపతితో రాజనీతిప్రసంగంబున
నిట్లనియె. 117

## నారదుఁడు ధర్మరాజునకు రాజనీతి చెప్పుట.

చ. మతియుతు బుద్ధిశాలిఁ బరమర్మవిభేదనదక్షు సత్కులో
చతురుని శాంతునిన్ సమరసాహసుఁ శాస్త్రవిచారకౌశలుం
బలిహితశీలు సద్గుణవిధానుఁడు భృత్యజనప్రజామనో
హితనిజవర్తను న్ననుమతించుచు మంత్రిగఁ జేయఁగాఁదగున్. 118

క. తా నెంతయధికుఁడైనం,గాని మనుజేశ్వరుండు కార్యాకార్య
జ్ఞానము నిజప్రధానుల,తో నాలోచించి యుక్తితో నెఱుఁగఁదగున్. 119

క. సప్తాంగరక్షణంబును, సప్తోపాయముఁ లోనయిన సామర్థ్యంబున్
సప్తవ్యసనవిరక్తియు,సప్తద్వీపేంద్రరాజసద్ధర్మంబుల్. 120

సీ. న్యాయంబు దప్పనినడవడితోడను జెంపుగాఁ బ్రజలఁ బాలింపవలయు
నుచితవ్యయంబు సేయుచు నర్థసంపద లెప్పుడు సడఁగాకుండంగఁ గూర్పవలయు
శౌర్యోజ్జ్వలములైన చతురంగబలముల నెంతయుం వివిధిగా నేలవలయు
సమయంబు బలము విచారించి పైకొని పరరాజ్యమాక్రమింపఁగవలయు
తే. నేమఱుటలేక గడిమర్గసీమలందు, నాప్తులును గార్యదక్షప్రయత్నపరులు
నయినవారలఁ దగినసైన్యములతోడ, నునుపవలయును దనపేర్మి యొనులుపొగడ. 121

క. తనరాజ్య మొదలరాజ్యం, బనవలవను బుద్ధికుశలు లగుచారులఁ బం
చి నిఖిలవార్తలు నిచ్చలుఁ, వినుటొప్పును భూవిభుండు విశ్రుతమతియై. 122

క. బలవంతులతోఁ బగయును, బలవద్బాంధవులతోడి పగయును ధరలోఁ
బలువురతోఁ బగయును మఱి, బలహీనికినైనఁ జెచ్చుభంగముఁ దలపన్. 123

క. చెలిమియె యుచితం బెంతయు, బలవంతునితోడ నతఁడుపగవాఁడైనం
జలియింప కంతకంటెను, బలవంతుని చెలిమివడసి పగ యీఁగఁదగున్. 124

చ. నిజభుజశక్తినైనఁ దనసేర్పునఁ దంత్రమొనర్చియైన న
క్కజముగ వారిపైఁ బలముఁగల్గినవారలఁ గూర్చియైన వై
రిజనవినాశనంబు నొనరింపక జాడ్యముచేత నున్న భూ
భుజుని ప్రభుత్వ మెల్ల నదిపొంతమహీజముగాదె భూవరా. 125

క. విశ్వాసపరుల నెఱిఁగి న, రేశ్వరుఁ డధికారమిచ్చు టెంతయు నుచితం
బైశ్వర్యయుతులు గాఁగ న,విశ్వాసులఁ జేయఁదగదు విమలవిచారా. 126

తే. కరుణ తనకెంతగలిగిన కనకవస్తు, వాహనాదులు చాల నీవలయుఁగాని
భూతలేశ్వరుఁ డెంతయాప్తులకునైన, నాజ్ఞఁద్రోవంగ నిచ్చుట యనుచితంబు. 127

చ. కలిమి కొలంది కీర్తి గమకంబు కొలందిఁ బ్రవర్తనంబు దో
ర్బలముకొలందిఁ బూనిక యనురక్తికొలంది సమాదరంబు మే
లొలయు కొలంది యత్నము సిరోగికొలంది నిభార మీగియుం
జెలిమికొలంది మాటయు నుతింపఁగ యోగ్యతఁ దెచ్చు నేతఱిన్. 128

శా. సర్వజ్ఞత్వముఁ గల్గి కీర్తిలతికాజాలంబు చక్రాద్రిపైఁ
బర్వన్నిశ్చలధర్మమార్గమున సప్తద్వీపసామ్రాజ్యము
న్నిర్వైరస్థితి నేలు నీకుఁ దలప న్నీతిప్రకారంబు లో
యుర్వీనాథ! నిసర్గసిద్ధములు గానొప్పు న్విచారించినన్. 129

వ. అని మఱియును బ్రసంగోచితంబు లగు విశేషభాషణంబుల నభినందించు మునిపుంగవుం
గనుంగొని వినయనమ్రవదనకమలుం డగుచు మహీవల్లభుం డిట్లనియె. 130

ఉ. ఎందఱు రాజు లీయవని నేలినవా రిఁక నేలనున్నవా
రెందఱు లెక్క సేయఁ దరమే పరమేష్ఠికి నైన నట్లనే
నందఱిలోన నొక్కరుఁడనై ధరయేలుట యెంత ప్రాభవం
బిందుల కింత పెద్దగ మునీశ్వర నన్గొనియాడ నేటికిన్. 131

ఉ. దేహము వాయుసంచలితదీపిక పుత్త్రకళత్రమిత్త్రసం
దోహము స్వప్నకాలమునఁ దోఁచెడిసంపద రాజ్యభోగస
న్నాహముఁ జంత్రపుంబ్రతిమ నాట్యము సంపద యింద్రజాల మీ
యైహికసౌఖ్య మేమిసుఖమంచుఁ దలంచెదనయ్య నారదా. 132

సీ. కామరోగాదిదుష్కరశత్రువర్గప్రతాపప్రధానసాధనము ధనము
జన్మపరంపరాసంపాదితానేకఘనకర్మజాలవర్ధనము ధనము
కైవల్యసంప్రాప్తికారణవైరాగ్యధర్మమార్గావరోధనము ధనము
సకలావగుణపుంజసంశ్రయాశారూపదారుణనిగళబంధనము ధనము
తే. గలిగి గర్వంబు దొట్టి దుఃఖంబు మదికిఁ, జెనుచు నజ్ఞానపావకేంధనము ధనము
స్వప్నలబ్ధపదార్థంబు చందమునను, దలఁచి జూడంగ పట్టిదంధనము ధనము. 133

ఉ. చక్కెరపూఁతపూసిన విషంబులు భామలవాక్యవైఖరుల్
చక్కఁగ వెన్నమెత్తినసిలల్ విరిబోఁడులచిత్తము ల్మఱి
ల్చెక్కినసంకెలల్ సతులచేష్టలు కొమ్మలనమ్మవచ్చు నే
యక్కట మేఁకవన్నెపులు లంగన లెన్నిట నెన్నిచూచినన్. 134

క. చన్నులు మాంసపుముద్దలు, గన్నులు దుర్జలముఁ బుసులుగా జెడితొఁరటల్
వెన్నులు నెముకలపోతర, లన్నుల నిటు తేఁసి వలచు టవివేకమె కా. 135

తే. మూత్రపతనస్థలం బపవిత్రమనుచుఁ, ద్రొక్కరా నేలఁగనిరోసి తొలఁగుచుండు
రట్టిమూత్రప్రగాలుప యైనపోలి, యోని దానికిరోయ రేయుల్లమహహ. 136

చ. కొడుకులు గల్గుదాఁక నొక కొన్నిదినంబులు చింత నందనుల్
వొడమిన నాయువుఁ బలము బుద్ధియు విద్యయుఁ జాలఁగల్గఁగా
నుడుగని చింతఁ గల్గి తమనోలిఁ బెంపనిచింత తండ్రికె
ప్పుడు గడుచింతసేయుదురు పుత్రులు శత్రులుగాక మిత్రులే. 137

వ. మునీంద్రా! పుత్రదారధనాదిసంగరహితులై విషయసుఖంబులం బరిత్యజించి యర ణ్యగిరిగుహాంతరప్రముఖవివిక్తప్రదేశంబులం గందమూలఫలంబు లాహారంబులు- సేయుచు మోక్షసామ్రాజ్యపట్టాభిషిక్తు లగుమహానుభావుల జీవనంబు పావనం బని తోఁచుచున్నయది రాగద్వేషమూలంబైన యీతుచ్ఛసామ్రాజ్యం బెంతపూ జ్యంబు సార్వభౌమత్వాభిమానంబున నవిద్యామగ్నులమైన మావంటివారలకు సంసా రపారావారంబు తరించునుపాయం బెట్లు గలుగు నానతిమ్మని మోక్షాపేక్షం బ్రార్థించినం బార్థివోత్తమువాక్యంబు లాకర్ణించి హర్షోత్కర్షమానసుండై నీప్రశ్నం బింతయొప్పునే యిట్టివైరాగ్యంబు బహుజన్మసుకృతసంచితతపఃప్రభావంబువలనం గాక సంభవించునే యని వికసితవదనారవిందుండై యత్తపోధనసత్తముండు నృపో త్తమున కిట్లనియె. 133

## నారదుం డాత్మవిద్యోపదేశము చేయుట.

తే. అడిగితివి వేదశాస్త్రసారాంశమైన, యట్టిపరమరహస్యంబు నవనినాథ
యెఱుగుదురుగాని ధర్మకామార్థఫణితు, లడుగ రెవ్వరు నీభంగి నాత్మవిద్య. 139

శా. అజ్ఞానంబునఁ దోఁచుసంసరణదుఃఖావాప్తి యజ్ఞాన మా
త్మజ్ఞానంబున నాశనంబగు దదాత్మజ్ఞాన మయ్యీశ్వరా
నుజ్ఞం గాని ఘటింప దీశ్వరుఁడు సంతోషించువేదోక్తమా
స్వాజ్ఞ న్వర్తిలుధర్మము న్నరుఁడు కర్తై సేయు సద్వృత్తికిన్. 140

ఉ. కావునఁ గర్మనిష్ఠ గతకల్మషుఁడైన ముముక్షుఁ డయ్యవి
ద్యావరణంబు వాసి సముదంచితబోధమునొందుబోధలీ
లావిభవంబుచేత సకలంబును బ్రహ్మముగా నెఱుంగు ద
ద్భావము నిశ్చలంబయిన బ్రహ్మముఁ దానగు నిర్విశేషతన్. 141

వ. నరేంద్రా! యద్వితీయంబును, నపరిచ్ఛిన్నంబును, నాద్యంతరహితంబును, సచ్చిదానందస్వరూపంబును నయి శుద్ధచైతన్యంబైన బ్రహ్మం బొక్కటియ వెలుంగుచుండు; నట్టిబ్రహ్మంబునందు నవ్యక్తయై, యనాదియై, మిథ్యాభూతయై, తచ్ఛక్తియై, త్రిగుణాత్మకయై, నిర్వచనీయయై, కలుగుచుండుమూలప్రకృతి యవస్తువయ్యును పదార్థాశ్రయత్వతద్విషయత్వబలంబునం జేసి వస్తువుంబోలెఁ బ్రకాశించుచు నాత్మసత్తాస్ఫూర్తులవలనస్ఫురద్రూపంబై యావరణవిక్షేపరూపంబులఁ దాల్చియుండునట్టిప్రకృతి సాత్త్వికగుణప్రకాశంబువలన మాయయనంబడు; నమ్మాయయందుఁ బ్రతిఫలితంబగు చైతన్యంబును మాయాధిష్ఠానచైతన్యంబును నమ్మాయయుంగూడి కారణోపాధికుండైన యీశ్వరుండై సర్వజ్ఞత్వసర్వేక్షకత్వసర్వనియంతృత్వసర్వేశ్వరత్వాదిధర్మంబులుఁ గలిగియుండు; నయ్యీశ్వరుండు తమోగుణప్రకాశిని యగుమాయ నీక్షించి నదృష్టసంకల్పవశంబున శుక్తియందు రజతాధ్యారోపంబును, రజ్జువునందు సర్పాధ్యారోపంబును, స్థాణువునందుఁ బురుషాధ్యారోపంబును దోఁచుకైవడి భ్రాంతికల్పితంబులై మహదహంకారంబులును, శబ్దస్పర్శరూపరసగంధసమేతంబులై, త్రిగుణాత్మకంబులై గగనపవనాగ్నిజలభూతత్త్వంబులును క్రమంబున సంభవించె; నవి సూక్ష్మభూతంబు లనంబడు; నాభూతంబులు పంచీకృతంబులై యన్యోన్యభాగమేళనంబున స్థూలభూతంబు లయ్యె; నాస్థూలభూతంబులవలన స్థూలశరీరంబును, సూక్ష్మభూతంబులవలన సూక్ష్మశరీరంబును, మాయవలనఁ గారణశరీరంబు నయ్యె; నిట్లు సమష్ట్యుపాధులైన దేహత్రయంబున నీశ్వరుండు క్రమంబున విరాట్టును, హిరణ్యగర్భుండును, నవ్యాకృతుండును, ననుసంజ్ఞల నొప్పుచు, నవాంతరసృష్టిస్థితిప్రళయనిమిత్తంబున రజస్సత్త్వతమోగుణావలంబనంబున, బ్రహ్మవిష్ణురుద్రరూపంబులఁ గ్రీడించుచుండు నిది సమష్ట్యుపాధికుండైన యీశ్వరుని ప్రకారంబు, ఇంక వ్యష్ట్యుపాధికుండైన జీవుని ప్రకారంబు వినుము, ప్రకృతిరజస్సత్త్వతమోగుణప్రకారంబువలన నవిద్యయనంబడు; నయ్యవిద్యారూపంబైన యంతఃకరణంబునందుఁ బ్రతిఫలితంబైన చైతన్యంబును నంతఃకరణాధిష్ఠానచైతన్యంబును నయ్యంతఃకరణంబునంగూడి జీవుం డనుసంజ్ఞఁ గలిగి యవిద్యావశతం గార్యోపాధికుండై స్వరూపవిస్మృతినొంది కించిత్‌జ్ఞుండై యుండునట్టిజీవునికి స్థూలభూతజన్యంబై స్థూలశరీరంబును సూక్ష్మభూతజన్యంబై జ్ఞానేంద్రియకర్మేంద్రియ పంచప్రాణమనోబుద్ధిరూపంబైన సూక్ష్మదేహంబును నవిద్యారూపంబైన కారణదేహంబునుం గలిగియుండు నందు విశ్వతైజసప్రాజ్ఞులనుసంజ్ఞల జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల

యందు స్థూలప్రవృత్తానందభోగంబు లనుభవించుచు జీవుం డహంకారయుక్తుం డై కర్తృత్వభోక్తృత్వాదిధర్మంబులు తనయందు నారోపించుకొను నయ్యవివేకంబువలన నభిమానంబును నభిమానంబువలన రాగద్వేషములును రాగద్వేషములవలనఁ గర్మంబులును గర్మంబువలన దేహంబును, దేహంబువలన సుఖదుఃఖంబులును, బ్రాప్తంబు లగుచుండు నందునొకానొకపురుషుండు పురాకృతసుకృతవిశేషంబున బహుజన్మంబులలో నొక్కెంట సంసారనివర్తనంబునకు నుద్యోగియగు నట్టివాఁడు సత్సంగతివలన సన్మార్గవర్తియై పాపంబులంబాసి జ్ఞాననిష్ఠుండగు జ్ఞాననిష్ఠవలనఁ జిన్మాత్రవ్యతిరిక్తం బయినవస్తువెద్దియుం గలుగఁ దనియును గలిగిన యట్లతోఁచుచున్న సకలజగంబును నెండమావులజలంబులై తోఁచినకైవడి మనోవిభ్రాంతికల్పితంబు బనియుం దెలిసి కార్యకారణోపాధులు మిథ్య యగుటం జేసి యీశ్వరత్వజీవత్వంబు లసత్యంబులై ఘటపటోపాధ్యభావంబునం దదంతర్గతాకాశంబును మహాకాశంబును నేకంబైనయట్లనుస్యూతంబయిన యాత్మయొక్కటి యను నిశ్చయంబున బ్రహ్మైక్యానుభవంబునం దన్మయుండై యుండు నతండు జీవన్ముక్తుండై, ప్రారబ్ధక్షయానంతరంబున విదేహకైవల్యప్రాప్తుం డగు నని వెండియు నిట్లనియె. 142

శా. నామంబుల్మఱి రూపము క్రియలు నానాభంగులం దోఁచు ని
ద్రామోహంబున స్వప్నమున్వలె నవిద్యం జేసి సత్యంబుగా
దేమిన్ జ్ఞానికిఁ దోఁచినట్లయిన బ్రహ్మీభూతుఁడై యుండు నో
భూమీశోత్తమ చిన్మయంబు సకలంబు న్వేఱులే దింతయున్. 143

క. చిత్తనియెను సాగరమునఁ, జిత్తం బనువాయువశత సృష్టితరంగో
త్పత్తి యగుఁ జిత్తమడఁగిన, నత్తఱి జగమడఁగు ముక్తియన నదియకదా. 144

క. ఏలాపలుచదువులు బ్రహ్మాలోకనసుఖము తనకు ననుభవమగునా
కేలెఱుఁగుట మేలెఱుఁగుట, భూలోకసురేంద్ర సూక్ష్మబుద్ధిం గనుమా. 145

క. ఆరూఢుఁడు ముక్తిన్గా, నారూఢుం డారురుక్షుఁ డారోహణకా
ర్యారంభపరుఁడు గావున, నారెంటికిఁ గలదె భేద మధికారములన్. 146

తే. కామి కర్తయుఁగాక సత్కర్మములు శి, వార్పణంబులు సేయుచు నారురుక్షుఁ
డరయ నారూఢుఁ డగునుగాలాంతరమున, నతని కెద్దియుఁ గర్తవ్య మపుడులేదు.

ఉ. మాటలు వేయునేల నొకమర్మము సెప్పెద మోక్షదాతవై
పాటిలు విష్ణుశంకరుల భక్తి దృఢంబుగఁ గల్గెనేని నా

నాఁటికి వానికన్ని సుగుణమ్ములు దామె ఘటింప ముక్తుఁడౌ
బూటకపున్విచారములఁ బోవఁగ నేమిఫలంబు భూవరా. 148

క. సుగుణంబెఱిఁగి భజించిన, నగు నిర్గుణసిద్ధి సిద్ధుఁడగు నాతనికిన్
జగమెల్లను బ్రహ్మమయం, బగుఁ దోఁచును సర్వకాలమును నొక్కగతిన్. 149

సీ. బయల సంరంభిలోపల నసంరంభియై కార్యతంత్రంబులు గడపెనేని
సఫలప్రయత్నంబు విఫలప్రయత్నంబు దనకుఁ దుల్యంబుగాఁ దలఁచెనేని
ననివార్యమై కర్మమునవచ్చుసుఖము వర్జించినయట్లు భోగించెనేని
సౌఖ్యంబు దుఃఖంబు సంప్రాప్తమైనచో నుబ్బుస్రుక్కులు లేకయుండెనేని
తే. జీవపరమేశ్వరైక్యసచ్చిత్సుఖాను, భూతి నిస్సంశయాత్ముఁడై పొలిచెనేని
వాఁడు ప్రారబ్ధమున వ్యవహారియైన, ముక్తిసామ్రాజ్యపట్టాభిషిక్తుఁ డగును. 150

చ. వనమున నున్ననేమి గృహవాసముచేసిననేమి యాత్మభా
వనయు నసంగవృత్తి యరివర్గజయంబును గల్గియుండినన్
వనమున నున్ననేమి గృహవాసముచేసిననేమి యాత్మభా
వనయు నసంగవృత్తి యరివర్గజయంబును లేకయుండినన్. 151

క. దేహము తాఁగానని నిజ, మూహింపఁగనేర్చినట్టి యుత్తమునకుఁ ద
ద్దేహమునకైన బాంధవ, దేహంబులు మిథ్యలనుచుఁ దెలియంబడవే. 152

సీ. పుత్రమిత్రకళత్రమైత్రిఁ వర్తిల్లు వసిష్ఠసంయమిబ్రహ్మనిష్ఠ వినమె
కర్మఠుండై రాజధర్మమూనిచరించు జనకునివిజ్ఞానచర్య వినమె
వాణిజ్యవృత్తి జీవనుఁడైన యలతులాధారునిపూర్ణబోధంబు వినమె
కటికిగాయకముచేఁ గాలంబుఁగడపుధర్మవ్యాధు విజ్ఞానమహిమ వినమె
తే. వారిప్రారబ్ధమున నుండవలసి జ్ఞాను, లెట్టివ్యవహారముల నున్ననేమి కొదవ
జ్ఞానవైరాగ్యనిశ్చలానందపూర్ణు, లైనవారు జీవన్ముక్తులగుట నిజము. 153

క. ఏయాశ్రమమున నుండిన, నాయాచారములు నడప నాశ్రమసుఖతృ
ష్ణాయత్తమతిని వంచకుఁ, డైయేనిష్కర్మి ననుట నర్థముగాదే. 154

ఉ. కర్మముబంధకంబని సుకర్మముమాని సుఖంబుఁగోరి దు
ష్కర్మము సేయుచు న్బుధులు కాదనిన న్విన కాత్మకున్న వే
కర్మములంచుఁ దాఁజెడుటగాక కొందఱఁ జ్ఞాననిష్ఠకుం
గర్మఫలాప్తికిం జెఱుచుఁ గాపురుషుం డుపదేష్టనంచు ని
ష్కర్మికి నాస్థలేదుభయకర్మములు న్విధిచే ఘటించినన్. 155

ఉ. చేయఁడు సత్క్రియల్ బయలఁజేసినయట్లు సుఖించు లోపలం
జేయుచు గార్యముల్ బయలఁజేయని యట్లు సుఖించు లోపలం
జేయఁడు కృత్యమంచు మఱిచేసె నకృత్యమటంచు నెంచరా
దేయెడ బ్రహ్మవిద్య తుదకెక్కినయట్టిమహానుభావునిన్. 168

చ. అమితములై ఘటించు విషయానుభవంబుల భోగి యయ్యు న
త్తముఁడగుయోగి బ్రహ్మమయి తన్మది రంజిలుచుండు గీతనృ
త్యములను దాళమానవశుఁడయ్యు శిరస్థితపూర్ణకుంభముల్
సమధికయుక్తి నిల్పికొనఁ జాలిననాట్యధురీణుకైవడిన్. 169

గీ. తలఁచినఁ దలంపకున్న నిత్యప్రబోధ, పూర్ణుఁడగు తాను దాఁగాకపోవు టెట్టు
లెఱుఁగఁ దగుగుఱి తనకంటె నెద్దిలేక, యెఱుక మఱపులు సమమైన యెఱుకయెఱుక.

వ. అని పలికి వెండియు నిట్లనియె. 171

ఉ. కోరకు మేపదార్థమును గోరినవచ్చునె రానివస్తువుల్
గోరకయున్న రావె తనకున్ లభియింపఁగ నున్నయర్థముల్
గోరినరానిచోఁ గలిగికోల్పడుచో వెతగాన సజ్జనుల్
గోర రనాస్థఁ బ్రాప్తములు గొందురు కుందరు వస్తుహానికిన్. 172

శా. ప్రారబ్ధంబగు మేననే యనుభవం బొచుండఁ దత్సాక్షివై
యారూఢస్థితి సర్వముల్ మఱచి సర్వావస్థలం జిత్సుధా
ధారాపానసుఖాప్తి సర్వగతశుద్ధబ్రహ్మమేనంచు శం
కారాహిత్యము మానుమీ యదియ మోక్షప్రాప్తి భూవల్లభా! 173

సీ. ఆసక్తిలేకయత్నాయత్నత ఘటించు ననిషిద్ధసుఖముల ననుభవింపు
ప్రారబ్ధవశత నాపత్సంపదలు వచ్చు వగపునుబ్బును మదిఁ దగులనీకు
కర్తవుగాక లౌక్యములు శాస్త్రీయంబులైనట్టియుచితకార్యములు సేయు
మాత్మనిశ్శంకత నద్వైతివై తేలి కృత్రిమద్వైతతఁ గ్రీడసలుపు

తే. పాదమునజ్ఞానమున నది పోవఁబోవు, నఖిలసంసారమును మిథ్యయని యెఱుంగు
సచ్చిదానంద మిదియవస్థాత్రయైక, సాక్షి నీవౌటఁ దెలియుము మోక్షమిదియ.

తే. సకలమును జిన్మయముగ దృశ్యములు మదిక,దృశ్యములుగాఁ దలంచి నిస్పృహతఁ
వర్తివై దైవగతి నేలవలయు రాష్ట్ర, మేలు మనహంకృతిని శంకయేల నీకు. [గార్య

చ. అని మునిపుంగవుండు నిగమాంతరహస్యసమగ్రవాగ్రసా
యనము కృపామతిన్ మిహికరాన్వయుకర్ణపుటంబులందు నిం

ఛిన బహుజన్మభాగ్యమునఁ జేసి యవిద్యఁ దొలంగి సత్యమై
యనుభవమయ్యె నాత్మఁ జిదహంబను సంస్కృతి సుస్థిరంబుగన్. 176

వ. ఇట్లు పరమజ్ఞానసంపన్నుండయిన యమ్మహామునీంద్రు నుపదేశంబున నానృపాలశేఖరుం డఖండసంపత్పరిపూర్ణుం డై యానందంబున నతనికి సాష్టాంగవందనంబులు చేసి యనేకవిధంబులఁ బ్రస్తుతించె. నారదుండును నతనిమనీషావిశేషంబునకు సంతోషించుచు బహుభంగుల నాశీర్వదించి వీడ్కొని స్వర్గగమనోన్ముఖుండయ్యె నప్పురూరవుండును యథేచ్ఛాప్రవర్తనంబున సుఖస్థితుండయ్యె నట నారదుండు చనిచని. 177

## నారదుఁడు నాకమున కేఁగుట.

శా. కాంచె న్మౌనివరుండు ముందట నభోగంగాతరంగచ్ఛటా
చంచచ్చంచలచంచరీకచయసంచారంబుఁ భాసించయా
కించిద్బంధురగంధబాంధవమరుత్ఖేలాగవాక్షావళీ
ప్రాంచత్సౌధచయప్రియాన్వితసుపర్వానీకమున్ నాకమున్. 178

సీ. వివిధదానాధ్వరోత్సవపుణ్యపరిపాకఫలభోగదేశ మేపట్టణంబు
తావలంబై యొప్పు నేవీడు కల్పపాదపకామధేనుచింతామణులకు
భువనత్రయాధిపత్యవిభూతి నొప్పు సుత్రామున కేప్రోలు రాజధాని
గరుడగంధర్వకిన్నరసిద్ధచారణాహీంద్రాదిసేవితం బేపురంబు
తే. సకలసౌభాగ్యలక్ష్మీప్రశస్తినగ్ర, మగుచు నేపుటభేదనం బమరుచుండు
నట్టియమరావతిని గాంచి యంతరంగ,మునఁ బ్రమోదంబునొందె నమ్మునివరుండు.

క. ఆదిత్యమండలస్థితి,నే దీపితమైన దివము చెలువునఁ దగి య
య్యాదిత్యమండలస్థితి,చే దీపితమైన దివము చెలు వమరంగన్. 180

వ. కని తదీయవిశేషంబు లగ్గించుచు నట చని. 181

సీ. ఒకచోటఁ బ్రకటహాటకసముద్యద్దీప్తిపుంజ మాతపపరిస్ఫూర్తి చూప
నొకచోటఁ బద్మరాగోపలప్రభలు సంధ్యారాగవిభ్రమం బావహింప
నొకచోట వజ్రమౌక్తికధాళధళ్యవినిర్మలరుచులు వెన్నెలలుగాయ
నొకచోట హరినీలనికరవిస్ఫుటనైల్యకాంతులు చీఁకటు లగ్రిమ్మఁ జేయ
తే. మిశ్రబహువిధమణిగణామితమరీచి, జాలమొకచోటఁ గిమ్మీరలీల నింప
వైభవశ్రీసమున్నతి వర్ణనీయ, మగుసుధర్మాభిధానసభాంతరమున, 182

మ. ఘనచింతామణిభద్రపీఠమున రంగల్లీల నాసీనుఁడై
వినతాశేషసుపర్వసంఘమకుటావిర్భూతదీప్తుల్పదా
బ్జనఖశ్రీల భజింప భూషణమణిచ్ఛాయ ల్వెలుంగన్ శచీ
స్తనకుంభద్వయగంధసారయుతముక్తామాలికోరస్కుఁడై. 183

ఉ. ముందొకవేళయందు సురముఖ్యుఁడు పద్మములందు డాఁగినాఁ
డందుకు నాఁటిచెల్మిని సహస్రదళంబులఁ బాయలేక మైఁ
బొందొనఁగూడ నుంచుకొనఁబోలుఁ జుమీయన వేయికన్నులన్
సుందరమై వెలుంగఁ గడుశోభిలుచున్న నిలింపవల్లభున్. 184

మ. కలితాష్టాపదరత్నకంకణఝణత్కారప్రయుక్తాప్సరో
లలనాహస్తసరోజచామరమరాళవ్రాతసంజాతకో
మలవాతప్రకటాంగరాగవిలసన్మందారమాలాసము
జ్జ్వలసౌరభ్యవిశేషవ్యాప్తసభికస్వాంతున్ శచీకాంతునిన్. 135

క. కనుఁగొని తత్ప్రత్యుత్థాననమస్కారంబులను మనంబలరఁగ దీ
వనలిచ్చి యమ్మునీంద్రుం, డనుపమకనకాసనస్థుఁడయియున్నయెడన్. 186

క. చారణవిద్యాధరగరుడోరగగంధర్వముఖ్యు లుచితస్థితులం
జేరి వినయంబుతో జంభారాతిం గొలిచియుండి రాసభలోనన్. 187

వ. అప్పుడు. 188

మ. పదవిన్యాసవిలోలనూపురకదంబస్వానముల్ ఘల్లనన్
మదదంతావళరాజయానములతో మాణిక్యహారావళుల్
కుదురుంజన్నులపై వెలుంగ సుమనఃకోదండపాండిత్యసం
పదఁ బెంపొందిన యూర్వశీముఖ నిలింపస్థానవేశ్యామణుల్. 180

సీ. సోమపానపవిత్రసుముఖులుగాక యీయధరబింబామృతం బానఁగలరె
వైరిహేతివిశీర్ణవక్షులుగాక యీపాలిండ్లఁ గౌఁగిటఁ బట్టఁగలరె
బహుదానవిఖ్యాతబాహులుగాక యీనిద్దంపుఁజెక్కుల నివురఁగలరె
ఘనతపోవ్రతకృశగాత్రులుగాక యీయుత్సంగశయ్యల నుండఁగలరె
తే. యనుచుఁ గనుచూపులకు వింత బెనుచు ప్రేమ, ననుచు మనములసురలెంచుకొనుచు నుండ
మదనదైవతమోహనమంత్రశక్తు, లనఁగ నచ్చరలేతెంచి రపుడు సభకు. 190

తే. వచ్చి పురుహూతునకు మ్రొక్కి వరమృదంగ, వాద్యరవహృద్యతాళానవద్యనాట్య
విద్య చోద్యంబుగాఁగఁ బ్రవిస్తరించి, పడఁతు లానరించి రప్పుడు భరతఫణితి. 191

సీ. చెలఁగుమద్దెలమ్రోఁత జిలుఁగురాణింపంగఁ బదపద్మముల లయప్రాప్తిఁజూపి
లయధృతమధ్యవిలంబము క్రియఁ దాళశారీరమున గీతసరణి నెరపి
గీతమాధుర్యవాగ్విభవంబు బయలుగా శయముల నర్థాభినయ మొనర్చి
యర్థాభినయమున కందంబుగా లోచనంబుల రసపోషణంబు చేసి
తే. రసము శృంగారవీరాదికమ్యగతుల, జూపఱుల డెందములు నిండి పొరిదివెల్లి
విరిసి ముఖపంకజంబుల విశ్రమింప, నాట్యమాడిరి మగువ లానంద మొదవ. 192

చ. దదిగణతెయ్యటంచు సముదంచితమర్దళతాళమానసం
పద జతగూడ నబ్బురపుపాత్రలు చేయుఁ గళాంజలిప్రమో
దదమగుచుండెఁ బో తకధిమితకఝణ్కు తకక్కనుచు న్వెలుంగునం
బుదయినదార్ఢ్యటీసహితభూరిపటిష్ఠతికాసమంబులై. 193

సీ. వేదశాస్త్రపురాణవిద్యాప్రసంగము ల్సూరిమహర్షులు చేయుచుండ
బలపాకజంభనిర్దళనాదివిజయము ల్విద్యాధరేంద్రులు వినుతిసేయఁ
గడఁగి షడ్జర్షభగాంధారముఖరవఘటితి గంధర్వులు పాటవాడఁ
గుండలీప్రేరణీదండలాసకముఖ్యనృత్యంబు లచ్చర ల్సలుపుచుండఁ
తే. జెలఁగి త్రిభువనరాజ్యలక్ష్మీవిరాజ, మాన వైభవలీలాసమానగరిమ
నిట్లు గొలువున్నయవ్విభుఁ డీశ్వరుండు, పలికె నారదమునిఁ జూచి ప్రస్ఫుటముగ.

శా. ఏలోకంబున సంచరించితిరి మీ రేయే విశేషస్థలం
బాలోకించితి రే ప్రసంగమున మీ కచ్చోట నిన్నాళ్లుఁ దాఁ
గాలక్షేపము చెల్లె సచ్ఛ్రవణముం గావింపు శ్రోతవ్యవా
ర్తాలాలిత్యవచస్సుధారససుధాధారాళమూర్తి నో నారదా! 195

వ. అనిన నమ్మహేంద్రునకు మునీంద్రుం డిట్లనియె. 196

మ. జగదాధారకుఁ డచ్యుతుం డెచట నర్చారూపబాహుళ్యతం
దగు నానావిధపుణ్యవాహినులచేతం బొల్చు నెచ్చోట నెం
పగుసత్కర్మధనంబుఁ గూర్పఁగ నుపాయం బేస్థలం బన్నిటం
బొగడొందున్ భువియందు నుత్తమము జంబూద్వీప మూహింపఁగన్. 197

వ. అందు. 198

సీ. శ్రీపురుషోత్తమక్షేత్రసువ్యక్తస్వభావు జగన్నాథదేవుఁ గొలిచి
మంగళాచలమహామండపాభ్యంతరవర్తి శ్రీనరసింహమూర్తిఁ జూచి

శేషధా త్రీధరశిఖరసౌధాగ్రవిహారివి వేంకటశౌరిఁ గాంచి
కాంచీకనకగోపురాంచితగృహదీ ప్తశుభ తేజు వరదరాజును భజించి
తే. వరకవేరసుతోభయవాహినీత, రంగరంగత్ప్రదేశవిరాజమాన
శేషపర్యంకనిద్రావిశేషణాభి, రాముఁ డగురంగధాము దర్శనము చేసి. 199

క. కాశియుఁ గేదారంబును, శ్రీశైలముఁ గాళహస్తి చిద్గగనము రా
మేశక్షేత్రము మొదలగు, దేశంబుల శంభుఁ గొలిచితిం గడుభక్తిన్. 200

వ. మఱియుం దక్కిన శైవవైష్ణవక్షేత్రంబుల సంచరించి గంగాయమునాసరస్వతీ నర్మదాగోదావరికృష్ణవేణికావేరిప్రముఖపుణ్యతీర్థంబుల నవగాహనంబుచేసిపునఃపున రాచరితైతద్విశిష్టప్రయోజనుండ నగుచుఁ దదానందంబు సదానందంబు గావింపఁ గొన్నిదినంబు లచ్చట నుండితి వర్తమానకాలమున నమ్మర్త్యలోకము సకలకళ్యాణ గుణాభిరామంబై లోకాంతరములకంటె నాహ్లాదకరంబై యున్నయది తద్విశేషం బాకర్ణింపుము. 201

శా. లోకాలోకనగావృతం బగుధరాలోకంబు బాలించుచో
నీకాలంబున సర్వధర్మములు భూయిష్ఠంబులై చెల్లఁగా
నేకచ్ఛత్రముగాఁ బురూరవుఁడు రాజేంద్రుండు సౌందర్యరే
ఖాకందర్పుఁడు కీర్తివిక్రమగుణాకల్పుండు లేఖర్షభా! 202

సీ. ప్రతిదేశమును భోగభాగ్యసంపత్ప్రజాసంపూర్ణవిభవమై పెంపుమీఱుఁ
బ్రతిదేవతావాస మతులితనిత్యోత్సవాడంబరంబుల నతిశయిల్లుఁ
బ్రత్యగ్రహారంబు భాసురాధ్యయనయజ్ఞాతిసంశోభితం బై వెలుంగు
బ్రత్యయనంబును బహుళాన్నసత్రప్రపావళిసాంద్రమై యలరుచుండు
తే. జనులు వర్ణాశ్రమాచారసరణి లేశ, మైనఁదప్పక సుకృతాత్ములై మెలంగ
సకలధర్మంబులును బ్రవిస్తరము లయ్యె, నప్పురూరవుం డేలురాజ్యంబునందు. 203

ఉ. అందఱు విష్ణుభక్తులు దయాపరు లందఱు నందఱుఁ సదా
నందమనస్కు లందఱు జనస్తవనీయచరిత్రులైనవా
రందఱు భోగభాగ్యయుతు లందఱు కల్మషదూరు లందఱున్
సుందరమూర్తు లెవ్వరినిఁ జూచిన నానృపుఁ డేలుమేదినిన్. 204

శా. ఆసౌందర్యము నామృదూక్తివిభవం బాసాదరాలోకనం
బాసారస్యము నాచమత్కృతియు నాయౌదార్య మావైభవం

బాసామర్థ్యముఁ గల్గెనే గతభవిష్యద్వర్తమానంబులం
దోసంక్రందన! యప్పురూరవునియ ట్లూహింప నెవ్వారికిన్. 205

తే. సరసకరుఁడు సులక్షణాచారమూర్తి, భాస్వితుండు కళాకలాపాంచితుండు
కువలయాప్తుండు నున్నంబకవిలసనుఁడు, నయ్యె నారాజు విష్ణుపదాశ్రయమున.

తే. అతనినెమ్మోము పూర్ణసుధాంశుబింబ, మగుట సత్యంబు గాకున్న నగుట యెట్లు
వికచభావంబు నవరసవిభ్రమాభి, రామరామాంబికేందీవరంబులకును. 207

సీ. పుండరీకదళాంతములయందునదంబుగాఁ బద్మరాగరాగంబు నిలిపి
సమదవేదండతుండములందుఁ దీరుగా నిగనిగమనుఁజిగి నెలవుకొలిపి
కుందనంపుఁబసిండియందుఁ దా ఘనసారసారసౌరభవిశేషంబు నించి
యరుణపల్లవములయందుఁ బద్మాంకుశకులిశాదిభాగ్యరేఖలు రచించి

తే. చేసెఁగావలె నలవాల్గొలాసికిఁకుఁ, డాకనుంగవ యాచేతు లాశరీర
మాపదంబులు గాకున్న నాసృపాల, తిలకునంగకముల కింతచెలువుఁ గలదె? 208

ఉ. కొందఱియందుఁ గొన్ని మఱికొందఱియం దొకకొన్ని గాని పెం
పొందుసమస్తసద్గుణము లొక్కనియందు ఘటించి యుండఁగా
గెందు నెఱుంగ మెవ్వరి సురేశ్వర! విష్ణుకళాప్తి నుద్భవం
బొందిన యప్పురూరవుని నొక్కనిఁదక్కఁగ మేదినీస్థలిన్. 209

చ. అన విని వజ్రపాణి వినయంబున నారదమౌనిఁ జూచి యి
ట్లనిడెఁ బురూరవక్షితితలాధిపుసద్గుణవర్ణనంబు నె
మ్మనమున కింపొనర్చె బుధమాన్య! సవిస్తరభంగిఁ జెల్పుమ
య్యనఘుఁడు విష్ణుభక్తుఁడు గదా విననొప్పుఁ దదీయవృత్తమున్. 210

క. ఎవ్వఁడు హరిభక్తిపరుం, డెవ్వఁడు సూనృతవచస్కుఁ డెవ్వఁడు సుజనుం
డెవ్వఁడు బహుజనపోషకుఁ, డవ్విమలునిచరిత మెన్ననగు వినఁగఁదగున్. 211

తే. అనినఁ దత్పూర్వవృత్తాంత మన్నగారి, తోడ నమ్ముని వివరింపఁ దొడఁగె నప్పు
డమరగంధర్వవిద్యాధరాప్సరసక, దంబకములకుఁ గర్ణామృతంబుగాఁగ. 212

క. సారదనారదజోక్తిక, ధారాగ్రహణప్రయత్నతత్పరలీలా
సారంగీభూతశ్రుతులై రప్పుడు లేఖు లెల్ల నాసభలోనన్. 213

వ. అని పలికినం బ్రహృష్టమానసులై తత్కథాప్రకారం బెఱింగింపు మని మహర్షులు
రోమహర్షణతనూభవు నడుగుటయును. 214

మ. ప్రణవాగారవిహార హారకలితోరశ్శోభితాకార కా
రణజాభీరకుమార మారహనుతప్రాంచత్కథావార వా
రణదక్షోదర భార భారతహితప్రజ్ఞావచస్సార సా
రణముఖ్యాప్తవిచార చారణసురారాధ్యాంఘ్రిపంకేరుహా. 215

క. నిటలతటనుటితకరపుట, జటివియదటపటలవరణచరణనికటపు
స్ఫుటమకుటకటకగహాటక, పటకటితలదళితశకటపటుకపటవిటా. 216

మాలిని. నతశశధరజూటా నాగభుక్పత్త్రఘోటా
జితసమదనిశాటా శ్రీస్త్రీతోరగకవాటా
ధృతతిలకలలాటా దివ్యతేజఃకిరీటా
తతచరణకృపీటా దైవసౌభాగ్యకూటా. 217

గద్యము. ఇది శ్రీమాగళాచలనృసింహకృపాప్రసాదసంప్రాప్తవిద్యావైభవ కనుపర్తి రాయనమంత్రితనూభవ సుజనహితకృత్య నిత్య యబ్బయామాత్యప్రణీతం బైన కవిరాజమనోరంజనం బను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.



భోజసుతాహ్లాదక
చాభోగవిలగ్నతారహారాంకితవ
క్షోభాగభోగమోక్ష
శ్రీభూనికటాక్షలీల శ్రీగోపాలా. 1

వ. అవధరింపుము సమస్తసద్గుణసాంద్రులగుశౌనకాదిమునీంద్రులకుసామోదహృదయజల
జాతుండై సూతుం డిట్లనియె న ట్లమ్మునిచంద్రుండు సురేంద్రున కిట్లనియె. 2

## చంద్రునివృత్తాంతము.

సీ. మదనసంహారుజటామకుటాగ్రసీమ నుద్దీపితంబైన వజ్రోపలంబు
బృందారకులకుఁ దృప్తిగ విందులిడుసుధారసపూరితాక్షయరజతపాత్ర
యలఘుపుష్కరపుష్కరాకరాంతర్విహారప్రౌఢిఁ జెలువొందురాజహంస
మబ్జగర్భాండగేహమున నుత్కృష్టకాంతి వెలుంగుకర్పూరదీపకళిక
తే. దక్షకన్యామనోజసంతాపహరము, నెయ్యమునఁజల్లఁజేయుపన్నీటికోలకు
కౌరిడాకంటిచెలివమ్మి తోరమైన, చలువచాయలగుంపు నిశాకరుండు. 3

క. చదువఁగవచ్చు బృహస్పతి, సదనమున కనారతంబు సౌందర్యగుణా
స్పదనిజరూపవిలాసము, హృదయంబులఁ జూపఱులకు నింపొదవింపన్. 4

మ. తళుకుంజెక్కులరత్నకుండలసముద్యత్కాంతి రంజిల్ల ను
జ్జ్వలముక్తామణిమాలికావళులు వక్షస్సీమఁ బొల్పార ని
ర్మలసౌరభ్యపటీరచర్చ సుకుమారంబైన నెమ్మేనఁ జెం
పలరన్ వచ్చుసుధాంశుఁజూచి గురుఁ డత్యానందముం బొందుచున్. 5

వ. విద్యోపదేశంబు సేయుచుండె నాసమయంబున. 6

తే. ఆగురుదార రూపరేఖాత్యుదార, చారుకుచభార శృంగారతారహార
సుగుణవిస్తార పదనఖరుచివిజిత,తార మోహిని యపరావతార తార. 7

క. జీవునకు జీవమై పగు, జీవనజాతాక్షి బంధుజీవాధర దా
జీవంజీవంబునకును, జీవన మగుచంద్రకళవిశేషము దోఁపన్. 8

ఉ. చంద్రరజంబు సైకతముఁ జల్లుచు గాముకరాశిఁ బూర్ణిమా
చంద్రుని సానఁబట్టి దిగజాఱిన రాపొడి దివ్యవాసనా
సాంద్రసురప్రసూనరససారమున స్మిళితంబు చేసి చి
స్తంద్రకఁజేసెఁ గావలయుఁ దారబమోజభవుండు నేర్పునన్. 9

సీ. సారంగమదహారి సంపన్నతవహించు ఘనసారసచ్ఛాయఁ గడురహించు
సారంగమదహారి సంపన్నతవహించు ఘనసారసచ్ఛాయఁ గడురహించు
సారంగమదహారి సంపన్నతవహించు ఘనసారసచ్ఛాయఁ గడురహించు
సారంగమదహారి సంపన్నతవహించు ఘనసారసచ్ఛాయఁ గడురహించు
తే. బాలికామణి తనుమధ్య నీలచికుర, చారుదీర్ఘవిలోచన సరసహాసన
తరుణమోహనమూర్తి సౌందర్యవదన, నవ్యసౌరభసురుచిరనఖకలీల. 10

మ. అలులం గొప్పనెపంబునన్ మృదువచోవ్యాజంబున న్శుద్ధఁజి
ల్కల నేత్త్రావుల సింగిణిన్ బొమల యాకారంబునం బూవుము
ల్కుల దృగ్భావమునన్ వహించి జిగి చెక్కుందోయి నక్రాంకరే
ఖలతో నొప్పులతాంగిమూర్తి విలసత్కందర్పశాస్త్రస్థితిన్. 11

క. ఆయిందువదన సుమన, స్సాయకశారీరవిభవజయసౌందర్య
శ్రీయుక్తమూర్తి రజనీ, నాయకు వీక్షించె వికచనయనోత్పలయై. 12

సీ. పలుచనిచూపునఁ బరిపాటిగాఁ జూచు నల్లాప్పఁ జూపునఁ నదటిచూచు
నరగంటిచూపున నలసరీతిని జూచు మఱుపెట్టుచూపున మరపిచూచు
నొడలెల్లఁజూపుగాఁ గడునబ్రపడి చూచు సొగయ నొయ్యారంపుఁజూడ్కిఁజూచు
భయమింతలేక తప్పనిచూపు చేఁ జూచుఁ జూచి చూడనియట్టిచూడ్కిఁ జూచు
తే. సొలపువలపుఁ దిలకించు చూడ్కిఁజూచు, నాటు జూపున మరులుకొనంగఁజూచు
దార తారామనోహరు దశవిధావలోకనంబుల మోహవిలోల యగుచు. 13

ఉ. చక్కనిమోము చూచి సరసంపుఁగనుంగవఁ జూచి నిద్దపుం
జెక్కులు చూచి కెంపువగఁ జెల్వగు వాతెఱ చూచి కాంతిఁ బెం
పెక్కినమేనుఁ జూచి గురునింతి మనోహరగాత్రి తార యా
చుక్కలఱేనికిన్ వలచి సొక్కి మనోభవబాణభిన్నయై. 14

సీ. తేనెప్రయోజనం బైనఁ గల్పించుక పలుమాఱుఁ దత్సమీపమునఁ దిరుగు
వలరాజువిల్కోలుములుకులవంటిచూపుల ననువుగా మర్మము ల్నాటఁజూచు
నుచితక్రమంబునఁ గుచకచాద్యవయవసౌభాగ్యములు ప్రకాశంబుచేయు
సమయమైనప్పుడు సాకూతముగ నర్మగర్భంబులైన వాక్యములు పలుకు
తే. నతఁడు తనమోము చూడనియప్పుడు తన, వదనమై సోష్ణదీర్ఘనిశ్వాసవశతఁ
దనమనోవ్యథ యతనిచిత్తమున కెఱుక, పఱుచు నాకాంత విరహవిభ్రాంత యగుచు.
తే. ప్రాణనాథుఁ డలంకరు పాప మనుచు, నెంత రసికక్రియను చూడ రిందుముఖులు
వలపుగలచోట నెట్లైనఁ గలయఁజూతు, రెంతసాహసు లహహా సీమంతవతులు. 16
తే అనుదినము నిట్లు హావభావాదిచేష్టి,తముల మోహింపఁగాఁ జేసెఁ దారవిధునిఁ
బురుషుమన సెంత దృఢమైనఁ బుష్పఁబోఁడి, వికృతిపైకొన్న సెగపొంత వెన్న గాదె.
వ. ఇవ్విధంబున. 18
సీ. హరినీలములమించి యతిలీలఁ జెలువొంది వేణి సుశ్రోణియు వింతపనర
హరి నిరాకృతిఁ జేసి కరికరాకృతిఁ దాల్చి యొడలును దొడలును నొప్పుమీఱ
నగజాతములఁ గేరి మృగపోతములమీఱి చన్నులుఁ గన్నులుఁ జెన్నుమిగుల
వరకుందములఁ బోలి యరవిందముల నేలి రదములుఁ బదములు రహివహింప
తే. గురుని భవనంబునందు సుందరి మనోజ, విమలఘంటారవాయతవిమలకనక
చరణమంజీరపుంజసింజానినాద, యగుచు నిట్లు మెలంగఁ బద్మాహితుండు. 19
క. పాపపరాఙ్ముఖతామతి, దీపాంకుర, మన్నెలంతదీర్ఘశ్వసితా
టోపమరుద్గతి నడఁగినఁ, బ్రాపితమోహాంధకారబంధురుఁ డయ్యెన్. 20
సీ. లలనానితంబమండలముపై నుత్పలవళిములు రచియింపఁ దలఁచుఁగాని
తరుణికెమ్మోవిమీఁదఁ బ్రవాళమణిసొంపుగులుకఁగాఁ ఘటియింపఁ దలఁచుఁగాని
జలజాక్షికుచకుంభములమీఁదఁ శశకప్లుతంబు దా నొనరింపఁ దలఁచుఁగాని
మృగరాజమధ్య నెమ్మేను లతావేష్టితంబునఁ బెనగొనఁ దలఁచుఁగాని
తే. తలఁపఁ డెప్పుడు గురువనితాసమాగ, మాగతాత్యుల్బణదురితదవానలంబు
దుస్సహం బని కటకటా తొలఁగఁ జేఁడు, కలుగదు గదా వివేకంబు కాముకులకు. 21
సీ. తా సుధానిధియయ్యుఁ దరుణికెమ్మోవిసుధారసంబునకు నోరూరుచుండుఁ
దాఁ జంద్రికాసాంద్రతనుఁడయ్యుఁ గుసుమకోమలిదరస్మితచంద్రికలకుఁ జొక్కుఁ
దాఁ గళానిధియయ్యుఁ దరళాయతాక్షికళావిశేషమున కుల్లాసమొందుఁ
దా మృగాంకమనోజ్ఞతనుఁడయ్యు నలివేణిలోచనమృగదీప్తిఁ జూచి సొగయు

తే. నహహ యీయద్భుతమున కేమనఁగవచ్చు, సకలజనరంజనుండైన చంద్రునకును
జంద్రుఁడై చాల హృదయరంజనమొనర్చె, సుందరీమణివదనారవింద మపుడు. 22

తే. తనకలిమిలేములను సర్వజనులకుభయ, పర్వములఁ దెల్పుశశికి నప్పద్మనయన
యభిముఖంబైనఁ బున్నమయగుచుఁదోఁచు, ననభిముఖమైన నమవసయగుచుఁదోఁచు.

ఉ. జక్కవలిక్కువ న్ఘనకుచస్తబకంబులపేరఁ జీఁకటుల్
చక్కనికొప్పుపేర జలజంబులు కన్నులపేర నెచ్చెలిం
దక్కక యాశ్రయించి పరితాపపరంపరపాలుఁ జేసె నా
చుక్కలఁజేరిఁ దీర్చుకొనఁజూచె సుమీ తమపూర్వవైరముల్. 24

తే. ఆసుధాధామునకు విదాహంబుగొలుపు, సాహిమాంశునిఁ బరితాపమందఁజేయు
నాకళానిధిఁద్రోచు మోహాంధకార, మున నొరుల నెంతచేయఁడు మనసిజుండు. 25

చ. చదువు వివేకమూలమని సద్గురుసన్నిధి వేదశాస్త్రముల్
చదువఁగవచ్చినట్టి యలచంద్రునకుం గురుపత్నిపొందు క
ష్టదశ ఘటింపఁజేసె నకటా యిఁకనేమనవచ్చు దైవమున్
మదినిది పుణ్యమా నని యొనర్పఁగఁబాపము వచ్చుటే మొకో. 26

వ. అని జనం బెంచుచుండఁ జంద్రుండు. 27

క. దోషాకరుండుఁ దారా, శ్లేషసుఖాన్వితుఁడుఁ గాన శీతాంశుఁడు దా
దోషాకరుండుఁ దారా, శ్లేషసుఖాన్వితుఁడు నయ్యె సితగజగమనా. 28

సీ. బొమ ముడివెట్టుమాత్రమె కాని ప్రియుఁడు పాలిండ్లొత్తిపట్టుట కిచ్చగించుఁ
గసరుమాత్రమె కాని కాంతుఁ డాయము లెత్తివెసఁబల్కుట కపేక్షవీనులొగ్గు
కొంగుపైనిడుకోఁ బెనంగుమాత్రమెకాని విటుఁడు గోప్యములు జూచుటకుఁగోరు
సీత్కృతు ల్వెడవెడఁ జేయుమాత్రమెకాని పతిమోవినొక్కుసంగతికి నలరు

తే. సొలయుమాత్రమె కాని నెచ్చెలిమికాఁడు, కఠినరతిసల్పుటకు సముత్కంఠ దాల్చుఁ
బులకహర్షాశ్రుసుఖజలోద్భూతగరిమఁ, దనవలపు జారునకుఁ దెల్పుఁ దరుణియపుడు.

వ. ఇత్తెఱంగున. 30

క. అన్యోన్యమోహవిభ్రమ, సన్యస్తవివేకులగుచు శశలాంఛనుఁడుం
గన్యామణియును గోర్కులు, ధన్యతనొందంగఁ గలసి తమి చిగురొత్తన్. 31

ఉ. కొన్నిదినంబు లిక్కరణి గోప్యముగా విహరించుచుండి య
య్యన్నువయిం బ్రియంబు హృదయంబున నగ్గలమైనఁ జంద్రుఁ డిం

తెల్పి యచుండి రంబునకుఁ దెచ్చుక సిద్ధయకేళిలోలుఁడై
యున్న యెడన్ బృహస్పతి పరోక్షవిచారవిషాదమగ్నుఁడై. 32

సీ. సరసుఁడౌ మగఁ డుండఁగఁ గన్యార్థ మనుగాని యుండెడిమర్త్యార్థ యెంచఁడయ్యెఁ
జెలువచన్ద్రునిఁ బొందెఁ బాప్రవృత్తమనుఁగాని తరుణివృత్తంబుఁ దలఁపఁడయ్యె
సతిపమోహముఁ బొందె యకలంక మనుఁగాని తెలివకలంకంబుఁ దెలియఁడయ్యె
నుపతినవ్వఁ బొందె శుచియనుఁగాని యన్యాంగనకయశుచిభావింపఁడయ్యె

తే. గురునివంటి మహాత్ముని శిష్యుఁ డనఁగ నరుఁడు, చన్ద్రుఁడనమే గుణంబుగ సంస్మరించుఁ
గాని వ్యభిచారదోషంబుఁ గాంచఁడయ్యె. నజ్ఞుఁ డనఁ బ్రాజ్ఞుఁ డనవెవ్వఁ డనినింక. 33

తే. అమృతమయుండై టఁకట పవిత్రాంగుఁడైనయె, యనుమహిమ దారదోషంబువలఁగుననియె
యమర గురుఁ డింతికిని వశుఁడయ్యెఁగాక, పెనిమిటికి నేల కడలుత్రొక్కినలతాంగి. 34

వ. ఇవ్విధంబున. 35

క. ఏపొద్దు క్షేమమున సంతోషించుచునుండె నరుఁడు ధరలో భార్యా
రూపవతి శత్రువని కృపా పెద్దలు పల్కిరేల తప్పు నటంచున్. 36

ఆ. సుదతి వ్రతముచెడిన సుఖము దక్కఁగవలె, నన్నమాటఁ దలంచుకొన్నదేమొ
తారపురంబుచేసెఁ గరికి ముచ్చటఁదీఱ, మగనివిడిచి తేరమగనియింట. 37

వ. అంత. 38

మ. రతిబంధప్రతిబంధకం బగుపరీరంభక్రియాస్తంభనం
బతిహేలామణితాంతరాయము నిజప్రాణేశకేళీజదా
యతమీనధ్వజయుద్ధలంత్రపటుతాహంకారకంకారం
బతులస్ఫూర్తి జెలంగె గర్భము నవవ్యాకోచపద్మాక్షికిన్. 39

ఉ. వీడని ప్రేమలం గలియు వేకటి వ్రేఁగుట లంతికూటముల్
వేడుకకు స్వినోదమొనవింపఁగ నయ్యుపనాథుతో హిత
క్రీడ మెలంగుచుండ నరిగె న్నవమాసము లంతమీఁద న
చ్చేడియ గాంచె నందను నశేషవిశేషగుణాంబుధిన్ బుధున్. 40

వ. ఆబ్బాలకుండు సుధాధాముధామంబునం బెరుఁగుచుండ నపుడు. 41

తే. చంద్రునకు బుద్ధిచెప్పి వాచస్పతికిని, దారనిప్పించితిరి గాదె మీరు మరల
నింతవృత్తాంతమును నీవు నెఱుఁగు దైన, నరణిఁ బలుకంగవలసెఁ బ్రసంగవశత. 42

క. ఈరీతిఁ దారకును గమ్మలారికి జన్మించినట్టి యాబుధునకు శృం
గారవతి కిలాకన్యకు, నారమతి పురూరవుండు సంభవమయ్యెన్. 43

వ. తత్ప్రకారంబు వివరించెద నాకర్ణింపుము. 44

## బుధుని చరిత్రము.

తే. జలజబాంధవవంశవిస్తారకుండు, మహితకీర్తి వైవస్వతమనువు సకల
ధారుణీమండలాధిపత్యమునఁ బనుపు, చుండి సంతానకాంక్షచే నొక్కనాఁడు. 45

ఉ. రాజితరత్నకాంచనతురంగమతంగజవేసదాసదా
సీజనదివ్యమందిరవిచిత్రమహాలవిలాసభాసురాం
భోజముఖీముఖోజ్జ్వలవిభూతి నెసంగుట నిష్ఫలంబుగా
దే జగతిం దనూభవవిహీనత నొందినయట్టివానికిన్. 46

చ. తొకతొకమాటలు న్నొసలఁ ముంపెసలాడెడు ముంగరంపు వెం
డ్రుకలును మద్దికాయలు గవుంగదులాడగ ముద్దుగారు పొం
దికజిగిపాలబుగ్గలను దేలికచూపులుఁ గోమలంపుటం
గకములు గల్గి యింపొదవుఁగా సుతు బాల్యము తండ్రి కెంతయున్. 47

సీ. కాంతాకుచద్వయీకాఠిన్యసంపద వెలితియయ్యును వేడ్క విస్తరిల్లు
వినుతాంగియవలగ్నతనుతావిలాసంబు కొదవయయ్యును ముదంబు కొనలుసాగఁ
గలకంఠకంఠిచెక్కులచిందు తేటలు పలుచనయ్యును గుతూహల మెసంగ
మృగనేత్ర తనులత జిగిబిగిసొగసుతక్కువయయ్యుఁ బ్రమదంబు కొమరుమిగులు
తే. యౌవనోత్సాదజనిత చేష్టావికార,కలితలలితవతీరతికౌశలంబు
పెంపుదళుకొంగియుఘటియించునింపుమిగులఁ, బురుషునకుఁబుత్రలాభంబెపరమహితము.

క. అనితలఁచి కులగురుం డగు, ననుపమగుణనిధి వసిష్ఠుఁ బ్రార్థించి యతం
డనుమతిసేయఁగఁ బుత్రునిఁ, గనుటకునై యధ్వరంబుఁగావించెఁ దగన్. 49

సీ. సవనక్రియోచితసకలవస్తుసమృద్ధిఁ గావించి భువనవిఖ్యాతదాన
మహిమఁ జెల్లుచు నుండిమంత్రతంత్రకలాపపరిశుద్ధి నమరు విప్రవ్రజంబు
గూర్చి దీప్తానలకుండంబులోపల హోమంబుచేయుచు నున్నవేళ
నమ్మనుభామిని యైనశ్రద్ధాదేవి కూఁతురుగలుగంగఁ గోర్కెవొడమ
తే. హోత సధ్వర్యుఁ బ్రార్థించి యువిద గలుగఁ, జేయుఁడనియె నిజేశువంచించి యపుడు
బుద్ధిహీనలు సతులని పుడమిలోన, జనులుపల్కెడుమాట నిశ్చయముగాఁగ. 50

క. ఆతలిరుఁబోఁడి కోరిన,రీతిని సంకల్పవైపరీత్య మొదవినన్
హోత పెడచేతఁ బుట్టెను, నాతి యిలాకన్య యనఁగ నవమోహినియై. 51

చ. ఘాతమిశయింతిఁ జూచి వగఁబొందుచు భానుతనూజుఁ డక్కటా
కొడుకు కదయించు నంచు మదిఁ గోరి మఖంబొనరించుచున్న చోఁ
పడఁబడి పోఁడుమిట్ల యుదిరంబగు కట్టొకొ దైవయత్నమున్
గడవవశంబె మానుషికకార్యము విప్రుల మెచ్చి చూచినన్. 52

మ. అని చింతించి వసిష్ఠుఁ జేరఁజని సమ్యగ్భక్తితోఁ మ్రొక్కి యి
ట్లనియెన్ సూనృతవాక్యశీల రఘుమాయోక్షేన్ మఖం జేను బు
త్రుని వాంఛించి యొనర్చుచున్న యెడ నేదోషంబునం జేసి యో
జననంబందఁ గొమారై యొర్తు హృదయోత్సాహంబు భంగంబుగన్. 53

తే. కులము వర్ధిల్లఁ దల్లిదండ్రులకు సుఖము, కలుగు నిహపరములయందు గణనవచ్చు
బంధువులలోన సత్పుత్రు జనయు బొప్పఁ, గాక ఫలమేమి సూఁతును గనుటవలన.

చ. అనవుడు సంయమిప్రవరుఁ డప్పుడమంకయు యోగదృష్టిచే
మనమునఁ గాంచి హంసకులమండనుతోఁ భవదీయపత్ని గో
రిన నొనరించె హోత విపరీతవిధంబున హోమమంత్ర మం
గనజనియింప నిట్టియపకార్యము చేసిరి బుద్ధిహీనులై. 55

క. దైవాధీనము లోకము, దైవమధీనంబు మంత్రతంత్రములకు భూ
దేవాధీనము మంత్రము, కావున సంకల్పవిషమగతి నిట్లయ్యెన్. 56

క. వినుము దగినప్రయత్నం, బెనొనరించెద విచారమేటికి నిజభ
క్తానందకరుఁడు పరమదయానిధి విష్ణుండు గలుగ ననఘచరిత్రా. 57

తే. అనుచు నారాజశేఖరు ననునయించి, యతఁడు నియమవ్రతంబుతో నఖిలభువన
కర్తఁ బరమాత్ము నాశ్రితకల్పతరువు, విష్ణు నారాధనము చేసి విమలభక్తి. 58

వ. ఇట్లని వినుతించె. 59

## వసిష్ఠుఁడు విష్ణుని స్తుతించుట.

పంచచామరములు:—

1. తరణ్యుదగ్రదీప్తిమత్సుదర్శనం సుదర్శనం
సరాగచారుమాధురీరసాధరం రసాధరం
పరాత్తతాచరన్మనోభవచ్ఛిదం భవచ్ఛిదం
హరిం వ్యతీతపద్మగర్భజామితం భజామి తమ్. 60

2. కరస్ఫురద్దరస్వరప్రకంపమానదిక్తటం
ధరాధరాధరాస్థిరప్రధానకూర్మరూపకం

చరాచరాకరా తతప్రశస్తకుక్షిశోభితం
నిరంతరం దురంతశక్తినిస్తులం ప్రభుం భజే. 61

3. చలత్ప్రకీర్ణకుండలం లసత్కపోలమండలం
కలావిలాసమోహనం ఖగప్రకాండవాహనం
మిళిందసుందరాలకం యమిప్రతానపాలకం
బలారివైరిమర్దనం ప్రభావయే జనార్దనమ్. 62

4. ఉమాసమానవాక్యసన్నుతోరుదివ్యనామకం
సమానమాధురీధురీణ సంస్కృతాంధ్రవర్ణితం
క్షమాసమావృతాపరాధజాలక న్నిజాశ్రితం
రమాసమాగమక్రియాంకరంగ మచ్యుతం భజే. 63

5. రణత్తరంగమాలికాస్ఫురత్తరంగిణీద్వయ
త్ఫణామణిచ్ఛటాఘృణిప్రభాసమానభూమిభృ
ద్ఫణీంద్రభోగకల్పభాగభాక్షమానదివ్యభూ
షణప్రకాశవిగ్రహం భజామి సాధ్వనుగ్రహమ్. 64

వ. అని. 65

క. ఈరీతినవ్వసిష్ఠుఁడు, సారమతిం బంచపంచచామరవృత్తో
దారస్తుతి గావించిన, నారాయణమూర్తి శ్రితజనప్రియుఁ డగుటన్. 66

సీ. పదివేలసూర్యబింబము లొక్కపోవైనకరణి నుత్కృష్టప్రకాశ మెసఁగ
శృంగారరసము మూర్తీభవించినలీల ఘనలీల సుందరాంగము వెలుంగ
నిందుషోడశకళలేకోత్తరాభివృద్ధి నెసంగె నన మోము తెలివిమీఱ
సౌదామినీలతాచ్ఛవినిచ్ఛలంబైన వసువ్రన జాఁటవావలువ మెఱయఁ

తే. బాంచజన్యసుదర్శనప్రముఖదివ్య, సాధనంబులు మరకతస్తంభవిజయ
బాహువులఁబూనిపతగేంద్రవాహుఁడగుచు, నాదినారాయణుండు ప్రత్యక్షమయ్యె.

ఉ. ఆహరిమందహాసవదనామృతదీధితి బింబదర్శనో
త్సాహతఁ బొంగు హార్దరససారసముద్రపయ స్తరంగసం
దోహమున న్జనించి పయిఁదోఁచిన బుద్బుదపుంజమో యనన్
దేహమునిండె నంచితగతిం బులకాంకురపాళి మౌనికిన్. 68

వ. అప్పుడు. 69

ఉ. రంగమరంగ వెన్నెల తరంగములై తనుకాంతి నిగ్గులే
రంగ జవంబుచే జితకురంగమనంగ నభంగభేరికా
రంగదురుస్వనంబు దనరంగ గుణోన్నతి నశ్వశాస్త్రపా
రంగతవ్యాప్యమౌ నొకతురంగము భూషితచాతురంగమున్. 79

ఉ. కనకఖలీనముం బసిమిగ్రమ్మెడు పచ్చలహేమపట్టమున్
ఘనమగుజాతికెంపులచొకాటపుబల్లము మౌక్తికావళిం
బనరెడుకంఠమాలిక లుదంచితవజ్రమయావతంస మిం
పొనర నలంకరించి తనయొద్దకు దెచ్చిన నెక్కె నశ్వమున్. 80

తే. బొమిడికంబులు వెట్టి జోళ్లమరఁ దాల్చి, చల్లడంబులు దొడిగి కాసెలుబిగించి
జముదళంబులు చెక్కి బల్లెములు పూని, వెడలిరప్పుడు పెక్కండ్రు వేటకాండ్రు.

చ. ఎసమొలవేల్పుసాహిణపుతేజులు పోషకగేహరక్షకుల్
విసువనికమ్మకట్టు మఱి వింతజనంబుల బీతఁగొల్పక
కస్సమగురక్కసుల్ వనమృగంబుల పాలిటి మృత్యురూపముల్
నేసఁ జనుదెంచె నత్తఱిని వేటకు గాటపుసారమేయముల్. 82

సీ. ఆల దుర్గ యెక్కిరింతల వెక్కిరింతలాడెడురీతి నాలుకల్ వెడలఁజాఁచు
సిడ్డెగుఱ్ఱపుఱోతఁ జెక్కసక్కెములాడుగతి వాలపిత్తెపకలనఁ దాల్చుఁ
దొడరి కొండలనెత్తి యడవఁబూనెడుమాడ్కిఁ బవరి చివ్వనఁ బూర్వపదములెత్తు
గర్జితంబులసారె భర్జించుకైవడి మొఱుగునార్భటముగా మోరలెత్తు
తే. బలిమికలిమిని జనమసంపదను దిట్ట, తనముపెంపున దారుణధ్వనినిరూఢి
జాగిలంబులు మృగయు లచ్చంపుఁబసిఁడి,పట్టెడలఁ బట్టివెడలించునట్టియెడను. 83

సీ. ధరవల్పులకుఁబ్రభుత్వంబు వచ్చిన మనుష్యులవికారపుఁజూడ్కిఁ జూచినట్లు
పల్లవుల్ తుదిలేమిపడి యింటిచాయరా మొగిలంజెపల్లులు మూల్గినట్లు
పరదేశి యతిలోభపరునియింటికిఁబోవఁ దెగికొఁతివలెచు గద్దించినట్లు
వంతువాసికిహీనవైశ్యులు పమలోన నేకంబుగాఁ గలపించినట్లు [కటిమి
తే. తెరలి యొరుఁడొక్కటి నిరూక్షదృష్టిఁజూచు, గొఱగొఱనుమూల్గుగద్దించుఁ దఱిమి
కఱసి కలహించు ఘోకృతికలకలముగ, జాగిలమ్ములు రోషభీషణములగుచు. 84

తే. బెబ్బులి తుపాకి సుడిగాలి పిడుగుతునక, భూతనాథుంపు గడిపోతు పోతురాజు
గండగొడ్డలి దొంగలమిండగీఁడు, మొదలుగాఁబేరుగల వేపులుదుటనడచె. 85

వ. ఇట్లు చనిచని. 86

క. ఒకగహనము జనసంచా, రకగహనము నగురుధూమరచితసురభిదా
పకదహనము సింహకటుం, బకగహనముఁ గనిరి వారు పటుతరలీలన్. 87

క. కనిచేరం బోవుచు న, జ్జనసాక్షకుమారతోడ సమయోచితవా
క్యనయప్రసంగములచే, ఘనమోదం బొదవ లుబ్ధకావళి పలికెన్. 88

క. కొద్దిమెకాలకుఁ బోదా, పెద్దపులిం గఱచి చంపుఁ బిడుగువలెను బై
నుద్దవిడి దుమికి యిదిమా, గద్దరిజాగిలము కనుఁగొనుము నృపా. 89

క. ఇదిగాలివేసి మెకమే, పొదలోపల నెంతదూరమున నున్నను దా
వెదకి పసివట్టి పోవుచు, గొరగొరి పోనీకపట్టుకొని చంపుఁజుమీ. 90

క. దాడిమెయి దీనివెంబడిఁ, గూడం బెఱజాగిలములకుం దరమే యీ
జోడంగి వేఁటముందర, లేడియుఁ గేడియుఁ జనంగ లేదడుగైనన్. 91

వ. అని మఱియును బహువిధములఁ మృగవ్యక్రీడానుగుణభాషణములు పలుకుచుండ
నప్పుడు. 92

తే. వనమృగంబుల బొలకువ గనుటఁ జెలిపె, వేటకాండ్రకుఁ గుర్కురవితతియపుడు
పట్టఁబట్టంగ నిలువక బలిమిసిగ్గు, లాడి యెగురుచుఁ దమకించుజాడవలన. 93

మ. మృగయుల్ పట్టెడలూడ్చినన్ భషకముల్ మృత్యుప్రయోగోజ్జ్వలా
శుగసంఘాతముకైవడిన్ వనమృగస్తోమంబుపై వాయువే
గగతిన్ ఱివ్వునఁదూఁగి పైనఱికె వీఁకన్ విస్ఫుటీభూతవ
క్త్రగుహాద్వారకనత్కరాళఖరదంష్ట్రాగ్రాహతోత్సాహతన్. 94

తే. పర్వతమువంటియొకకొమ్ముపందిమీఁద, నుఱికి యొకజాగిలము చెవియొడిసిపట్టి
యదియుఁ దనచాయఁ దిరుగఁ దానట్లతిరిగె, లంకెవెట్టినకైవడి శంకలేక. 95

తే. తోఁక నలపందినలపంది తూలిపడఁగ, నొక్కబలువేపి యదియట్టు లుండనిమ్ము
పులిపులిని దప్పకుండంగఁ బుట్టిపులిగను, దఱిమె నొకజాగిలం బడియరుదుగాదె. 96

చ. తిరుగుము పోకు సేయుచుఁ దెంపునఁ బల్కినవానిమీఁద సూ
కరము గిఱుక్కన న్మరలె గ్రక్కునవాఁడును బాదిపోటుచే
నఱిమొఱిఁ గ్రుమ్మిపట్టె నెదనట్లును నిల్వక నిక్కి పైకిరా
నరుదుగఁ జేర్చె నొక్కశిల యాఁపున బల్లెపుఁగఱ్ఱ వాఁడిలన్. 97

ఉ. గ్రుక్కక దింపుగా వలువచుట్టినవామకరంబు నోటికిం
గ్రక్కున నిచ్చి పైనెగురఁగా నలబెబ్బులి తెల్లచంకలో

నక్కుడిచేకటారి పరుఁజంటఁగ నుక్కునఁ గ్రుమ్మి గుండియల్
వ్రక్కలువాపి త్రోఁచి పడవైచె నొకండు దశఁ డెట్టిశూరుఁడో! 98

తే. ఒక్కవిలుకానిగాఢప్రయోగమునను, దానికుంభప్రగుప్తముక్తాఫలములు
మార్గణావలిపాలయ్యె మార్గణాళి, పాలుసేయక దాని సొమ్ముల దాఁచు. 99

క. ఈరీతి మృగవ్యవ్యసనారంభము మానసముల నంతంతకు వి
స్తారముగ వేఁటలాడిరు, దారగతిన్ వేఁటకాండ్రు తద్విపినమునన్. 100

శా. ఆసుద్యుమ్నకుమారమాళియును నట్లావేళ మిత్రాళితో
నాసక్తిన్ మృగయావినోదమున ఘోరారణ్యభాగంబులం
దా సంచారము సేయుచుం గరికిరీంద్రవ్యాఘ్రసింహాదినా
నాసత్వంబుల నుగ్రబాణనిహతిన్ నాశంబు నొందించుచున్. 101

మ. ఖరధారాశరభగ్నసింహశరభోగ్రవ్యాఘ్రకీలాలవీ
తరజఃపుంజవనావలిన్ శకలితోద్యద్భద్రదంతావళో
త్కరకుంభోదయమౌక్తికావళులు రంగద్రంగవల్ల్యాకృతిం
గరమొప్పన్ మృగయావినోదపరుఁడై గాంధర్వయానోద్ధతిన్. 102

వ. చనిచని ముందట. 103

సీ. దుర్గంబులైయుండు భర్గపితామహపురంబు లేశిఖరాగ్రమునను
నెలయేఱులై యుండు నలసుధాంధస్సింధుజలపూర మేశిలోచ్చయముమీఁద
గహనంబులైయుండుఁ గల్పకసంతానహరిచందనాదు లేయద్రియందు
గండోపలంబులై యుండు మాణిక్యవైడూర్యాదిమణు లేయహార్యసీమ

తే. నట్టిమేరుమహీంధ్రంబు నహరహఃప్రదక్షిణప్రచరద్గ్రహతారకాక
దంబకప్రతిబింబవిడంబి తన్నితంబబింబపరిస్ఫురితంబుఁ గాంచి. 104

చ. అమరులకెల్ల నిల్లు త్రిపురాంతకుచేసిలసిల్లువిల్లు లో
కములకుఁ బట్టుగొమ్మ మణికాంచనసంపదతావలమ్ము గ్రా
వములకుఁ జక్రవర్తి భగవత్కళయై తగుపుణ్యమూర్తి యీ
సమధికవర్ణనీయగుణచారువు మేరువటంచు నెంచుచున్. 105

వ. తదీయవైభవంబున కద్భుతంబందుచుం జనిచని తత్పర్వతోపకంఠంబునందు. 106

సీ. సురసాలసురసాలసురసాలఖేలంబు కాంచనకాంచనాఢ్యంచితంబు
కేసరకేసరకేసరాస్తోకంబు ఘనసారఘనసారకదళియుతము

సీ. జటియయ్యుఁ గొమ్మలసంపర్క మొనరించె సౌభరిసన్నిధిఁ జదువుకొనెనొ
గురుజాతియయ్యుఁ జేకొనియెను విటావాప్తి నిగమశర్మునఁ జూచి నేర్చుకొనెనొ
బ్రాహ్మణియయ్యుఁ దాఁ బల్లవలోలతఁ దాల్చె నహల్యను దలఁచుకొనెనొ
తరుణియయ్యును బ్రవృద్ధప్రియసుమనస్క యయ్యె సుకన్యలా గియ్యకొనెనొ
తే. యగమ మయ్యును బహుపాదమయ్యె నిట్లు, శిఖరివర్యమతం బభ్యసించెనొక్కొ
యనుచుఁ బత్త్రిమాత్రసహాయులకును,జూపెఁ జతురోక్తు లాడుచు భూపసుతుఁడు.
సీ. కలకంఠములకంఠములఁ గుంఠదుత్కంఠ నొనరించు పంచమస్వనము నిగుడ
సమరందసుమబృందగమిళిందముల మందగతి నెసంగించు ఝంకరణ మొనర
గొరవంకలిరువంక మరువంకములకంకఁ బఠియించుగతి మోత్రయుపలుకు లెసఁగ
శుకకులాధికవిలాసకకళాకవకళాపోక్తులు సరససంయుక్తి నెఱయఁ
తే. గులుకుపలుకుల మెలఁకువ నలరుకలర,వముల రవములు చెలఁగంగ నెమిలిగములు
విమలగతిఁ గూయు నినదము లమర నివ్వ,నంబు చెలువొందు నానందనాదమయత.
క. అని తనియనికోరిక న,వ్వనిఁ గొనియాడి నిజమిత్త్రవర్గంబులఁ దో
డ్కొని జనితసితాంతముదా,కృసి జనియె నిరంకుశోద్ధతి న్వనసీమన్. 117
వ. ఇట్లతండు వనక్రీడావ్యసనంబున నచ్చటిమహిమ దెలియక యవ్వనంబు సొచ్చె నాస్థలమాహాత్మ్యం బాకర్ణింపుము. 118

## రాజకుమారుఁడు ఈశ్వరశాపమున సుందరియగుట.

మ. ప్రమదారత్నము సర్వమంగళకళాప్రావీణ్య కన్యాళితోఁ
బ్రమదంబార భజింపఁగాఁ బ్రమథవర్గస్వామి దూరీకృత
ప్రమదాంధద్విపదైత్యబాహుబలసంరంభుండు శంభుండు త
త్ప్రమదారామమునం దృతీయపురుషార్థక్రీడలన్ లోలుఁడై. 119
ఉ. ఆటలపాటల న్సుముఖుఁడై చరియించుటఁ జేసి యెవ్వఁ ర
చ్చోటికిఁ బోవ రాస్థలము చొచ్చినయంతనె యీశ్వరాజ్ఞచే
ఘోటికయయ్యె ఘోటకము కూడి చరించుచునున్న మానవుల్
బోటికలైరి తాను నొకసుందరి యయ్యె మహాద్భుతంబుగన్. 120
సీ. సారంగముల నట్లు చంపినపాపంబు తప్పునె కన్నులఁ గప్పుకొనక
సామజంబుల నట్లు సమయఁజూచినకర్మ మడఁగునె నడుపుల నంటుకొనక
గురుమెకంబుల నట్లు కూర్చినగీడు దాఁ దొలఁగునె శిరసుల దొట్టుకొనక
పంచాస్యముల నట్లు త్రుంచినదోషంబు పోవునే నడుములఁ దాపుకొనక

తే. యకట ! వనవాసులై దేశయాత్ర నడపు, నామృగంబుల మృగయావ్యసనత హింస
చేసిన యఘంబు పొందెఁ జేఁజేత నసఁగ, నధమమగునాఁడువగ వారి కమరెనపుడు.

సీ. శ్మశ్రుకళంకదోషంబు నిశ్శేషమై ముఖచంద్రబింబము ముద్దుగులుక
వరవీరరసరజోభరణంబు హరణమై నేత్రాబ్జధవళిమ నివ్వటిల్ల
నుష్ణీషపేటికాయుక్తి విముక్తియై కచనీలమణిగణకాంతి దనర
జ్యాకిణాంక మిళింపసహితంబు రహితమై కరహల్లకచ్ఛాయ గడలుకొనఁగ
తే. బటుతనుత్రాణశుక్త్యపవారణమున, వారణంబై శరీరలావణ్యమూర్తి
కమ్యుతి వెలుంగఁ బురుషలక్షణము లెడలి, యకుమారుండు నవమోహనాంగి యయ్యె.

శిఖరిణీవృత్తము:—
ఇలాకాంతాకారం బెసఁగ మును దానెట్టు లటుల
యిలాకాంతాకారం బెసఁగి తనుపాంతేందుగురుమే
ఖలాహంతారాంతర్గతకిసకిణీక్వాణమణిమే
ఖలాకాంతారిప్రాకటఘనఘారప్రచయమై. 123

వ. మెలంగుచుండి. 124

తే. రాకుమారుండు రూపేందిరాకుమారుఁ, డాకుమారవనంబునం దాకుమారి
కాకృతి ధరించుటకు హేతు వాకుమార,జనకునాజ్ఞోక్తి కల దది వినుము తెలియ.

మ. నవలావణ్యవిలాసమూర్తి పరమానందస్వభావుండు కై
రవిణీబాంధవశేఖరుండు హరుఁ డార్యాయుక్తుఁడై యకుమా
రవనాంతంబున నొక్కనాఁడు ప్రియమారన్ రుద్రలీలావతీ
నివహంబుల్ గొలువన్ వినోదవిహృతి న్నెయ్యంబు సంధిల్లఁగన్. 125

సీ. చలువఱాదోనల గొజ్జఁగిపూఁబొదల మంచుదొరుఁగు నాపన్నీట దోఁగితోఁగి
పరువుగా ముదిరెన పండ్లగుత్తులమొత్తముల డాకపందిళ్ళ మూఁగిమూఁగి
గుజ్జుమావుల నల్లుకొని ప్రేలుచుఁదీఁగతూఁగుటుయ్యాలల నూఁగి యూఁగి
యింపుసొంపొదవించు నెలతేఁటిగమిపాట లెసఁగుపూఁబొదరిండ్ల నీఁగియీఁగి
తే. పరవుఁబుప్పొళ్ళ నడుగుఁదామరల చిన్నె, లేరుపడ మెట్టి సురపొన్నచాయచలువ
లీను నీడలజాడల నేగియేగి, చెలఁగి చెలులును జెలువుండు మెలఁగి రెలమి. 127

శా. ఈచందంబునఁ గొంతసేపు ప్రమదం బేపార లీలావిహా
రౌచిత్యంబుల సంచరించి విటపోద్యత్పారిజాతావృత

ప్రాచుర్యామృతసారపుష్కరిణికాప్రాంతాయతోదార శో
భాచంద్రోపలవేదికాస్థలిఁ బ్రభల్ భాసిల్ల నాసీనుఁ డై. 128

చ. దరహసితామృతంబు ముఖతామరసంబు నలంకరింప నా
హరుఁడు ముదంబున న్వనవిహారపరిశ్రమలాలసాంగి న
గ్గిరిసుతఁ గాంచి కేలికమిఁ గీల్కొనుసన్న యెఱింగి నెచ్చెలుల్
సరసగతిం దొలంగి కనుచాటగుచోటుల నుండ నయ్యెడన్.  129

తే. అంబుజాననఁ గౌఁగిటనలమియలమి, యిష్టకేలీసుఖంబుల నెనసితనిసి
యంకపీఠంబు పై నుంచి యలపుసొలపుఁ, దీఱ లాలించిపలికె సుస్థిరుఁడు హరుఁడు.

చ. అడుగులుమోడఁ గెంజిగురుటాకులు చేతులు లేఁతతీఁగె లె
క్కుడుజిగి చన్నుదోయిపువ్వుగుత్తులు మోవిరసంబు పక్వమై
వడుచుఫలద్రవంబు ప్రియవల్లభ చక్కనికొమ్మ వోట ని
న్నెడయక యిన్నిరూపముల నివ్వనదేవత యాశ్రయించెనో. 131

తే. తరుణి నాసిలకంఠాభిధానమునకుఁ, దోఁచె నర్థాంతరము పరితోషసరణి
సాంద్రసీమంతభూషాసురేంద్రచాప, సహితయుష్మత్కచాబ్దదర్శనమువలన. 132

సీ. మృగశాబకంబు హస్తగతంబు సేయుట సువతి నీకన్నులుచూచికాదె
యరచందమామను శిరసుపైఁ దాల్చుట వెలఁది నీనుదురు భావించికాదె
గగనంబు కేశసంగతము గావించుట చెలువ నీకౌను లక్షించికాదె
భుజగంబులను హారములుగా ధరించుట కలికి నీకీల్జడఁ గాంచికాదె

తే. కొన్ని నీయంగముల పోల్కి కొంతకొంత, కలిగియుండుటఁ బ్రియమయ్యెఁ గాకమాకు
వీని ధరియించుటకు నించుకైనఁ గలదె, కారణము పూర్ణచంద్రసంకాశవదన. 133

చ. కలికి శిరీషపుష్పములకంటెను మిక్కిలికోమలంబులై
యలరు భవన్మనోహరతరాంగకము ల్గనుఁజూచి యేగతిన్
దెలియఁగవచ్చుఁ గొండకుజనించినదానవటంచు నీదుని
శ్చలపటుకర్కశోన్నతకుచద్వయి తెల్పఁగఁగాక కోమలీ. 134

చ. అనవుడు లేఁతనవ్వు జిగి యందపుఁజెక్కిలిదోయి కుందనం
బునకు మెఱుంగువెట్ట గొనబుంబచరింపుల సిగ్గుఁ బ్రేమయుం
బెనఁగొని వాలుఁగన్నుఁగవ బిత్తరిచూపుల నాదరింప మో
హనమధురోక్తి నుత్తరములాడుచునుండె భవాని శంభుతోన్. 135

వ. ఆసమయంబున. 136

శా. కౌండిన్యాత్రివసిష్ఠగౌతమమతంగవ్యాసజాబాలిమా
ర్కండేయచ్యవనాశ్వలాయనకణ్వర్ష్యశృంగభారద్వాజకుంభీజను
ల్మాండవ్యాదిమహామునీంద్రు లెలమిన్ సంగీతానేకమా
ర్తాండస్ఫూర్తిక తేజు నయ్యభవు సందర్శించు నాసక్తితోన్. 137

తే. వచ్చి ప్రమథవనస్థలిఁ జొచ్చి యచటి,దూరమునఁ గాంచి రమ్మునీంద్రులు రహస్య
కేళి ననురాగరసవార్ధి నోలలాడు, శివుఁ జెలంగెడు నాదిమదంపతులను. 138

వ. అప్పుడు. 139

ఉ. వారలరాకఁ గన్గొని వివస్త్రశరీరిణియైనఁ గ్రక్కునం
జీర ధరించె శైలసుత సిగ్గున మన్మథచంద్రహాసమౌ
య్యాకరముగా నొరంబొనిసినట్లయి యచ్ఛపటాలతాంగి శృం
గారరసంబు ప్రాణవిభుకన్నులచూడ్కికి విందుసేయఁగన్. 140

వ. అవ్విధం బవలోకించి. 141

క. మునివరులు సమయ మెఱుఁగక, చనుదెంచితిమనుచు మఱలి చని రపుడ రయం
బున నరనారాయణులుం, గనుఁగొను వేడుకల బదరికావనమునకున్. 142

ఉ. అత్తఱి నమ్మునుల్ నిజరహస్యవిహారముఁ గాంచిరంచు న
య్యుత్తమనాయకాతిలక ముల్లమునం గడులజ్జనొంది మో
మెత్తక యున్న జూచి హృదయేశ్వరిచిత్త మెఱింగి పల్కె నో
మత్తమరాళయాన వినుమా యనుమానమువాయఁ జేసెదన్. 143

మ. తరుణీ నీకును నాకు నెంతయు వినోదక్రీడకున్ వేడ్క నే
యిరవాస్వస్థల మిక్కుమారవన మచ్చోఁ జొచ్చి రాఁగూడ దే
పురుషుల్వచ్చినఁ బౌరుషం బెడలి యంభోజాతపత్రాక్షు లౌ
దురు నేఁడాదిగ నంచుఁ బల్కె భువనస్తుత్యుండు శర్వాణితోన్. 144

వ. తత్కారణంబునంజేసి సుద్యుమ్నుండు విద్యుల్లతాంగి యై విస్మయవిషాదవిహ్వల
మతిం దిరుగుచు. 145

క. కామినినై తానెక్కడ,గామిని నేమని జనంబుఁ గాంతు నని వసీ
భూమిని జరియించె నిలా,భామినియై వనరమాస్వభావత దోఁపన్. 146

తే. పల్లవితపాదపంబుల ఫలితభూజ,ములను బుష్పితతరువుల ముద్దుగుమ్మ
పికవిలాసినికైవడి శుకవధూటి,పోల్కి మధుకరరమణిసొంపునఁ జరించె. 147

క. ఈరీతిఁ దిరిగితిరిగి వ,యోరుహదళనేత్ర దైవయోగమువలనన్
దారాతారారమణకు,మారుం డనుబుధునియాశ్రమంబునఁ జేరెన్. 148

ఉ. చేరి మనోజసుందరవిశేషతనూవిభవాభిరాముఁ గే
యూరకిరీటకుండలముఖోజ్జ్వలదివ్యవిభూషణాఢ్యలం
కారు సమందహాసముఖకాంతివినిర్జితపూర్ణిమాశమీ
చారుకళానిధున్ వినతసర్వబుధున్ బుధుఁ గాంచి ప్రేమతోన్. 149

వ. ఇట్లని వితర్కించె. 150

## స్త్రీయైన సుద్యుమ్నుఁడు బుధుని మోహించుట

సీ. అలివేణులకు మనోహరముగాదే వీని కెంపమ్మిచాయలకేలుదోయి
కీరవాణులకు నోరూరింపదే వీని మాధురీకలితబింబాధరంబు
మదచకోరాక్షుల కెదఁ బ్రేమగొల్పదే వీనిపూర్ణేందుబింబాననంబు
వరకోకకుచలకు వలపుపుట్టింపదే వీనిమార్తాండతేజోనిరూఢి
తే. యహహ వీనివసంతమోహనవిలాస, మేలతాంగుల నలరింప దెంచిచూడ
ననుచు రాగరసార్ద్రాంతరంగ యగుచు, సుదతి కనుఱెప్పవెట్టక చూచె నతని. 151

ఉ. ఆయరవిందరాగరుచిరాధర నాహరినీలవేణి నా
శ్రీయుతవార్తికద్యుతివిశేషదరస్మిత నానవప్రవా
ళాయతపాణిపాదయుగ నావరహీరనఖాళిఁ గాంచి యా
హా యిది రత్నరాశి వనితాకృతిదాల్చి మెలంగెడుం జుమీ. 152

వ. అని తలంచుచు నసామాన్యసౌమ్యసద్గుణరమ్యుం డగు నాసౌమ్యుండు మదనప్రదర
వివశీకృతహృదయుండై యమ్మదవతిం గదియవచ్చి యిట్లనియె. 153

మ. నవలావణ్యవిలాసమోహినివి చానా నీవు గంధర్వకాం
తవో విద్యాధరభామవో విహగసౌందర్యాంగివో సాధ్యక
న్యవో సిద్ధాంగనవో భుజంగసతివో యక్షాంబుజాతాయతా
క్షివో గీర్వాణవధూటివో తెలుపుమా చిత్తంబు రంజిల్లఁగన్. 154

చ. పరభృతపఙ్క్తి నీయధరపల్లవలబ్ధికిఁ దుష్టైవల్ భవ
త్స్వరసముఖాంబుజాప్తియును సంగతిఁ గోరె వనంబులం దప
శ్చరణలు చేసి సుస్వరముఁ జక్కని చూపులునై మెలంగెడున్
బురుషులు నిన్నుఁ జూచి మరుపూనికిఁ జిక్కిరె నీకుఁ దక్కరే. 155

తే. వనిత నీవాలుఁగన్నులు వలుదకొప్పు, మందగమనంబు సారంగమహిమఁ గాంచుఁ
గలికి నీమోముఁ జక్కఁదనంబు, మఱి గళంబును నబ్జసంపదవహించు. 156

సీ. తెలుప నీవు కటాక్షదృష్టిఁ జూచినఁ గాముకాండముల్ తృణమునఁ గట్టరాదె
నాతి నీవించుక నవ్వినఁ బూర్ణచంద్రికల జాడ్యంబు నొందింపరాదె
భామ నీవు ప్రియోక్తిఁ బలికినఁ జిలుకలఁ బట్టిబందిగములఁ బెట్టరాదె
లోలాక్షి నీవు కెంగేలు పైఁజేర్చినఁ జిగురాకులఁ జలింపఁజేయరాదె

తే. లేమ నీదయ నామీఁద లేమిచింత, వెతలపాల్పడవలసెను వీనిచేతఁ
గాక నీప్రాపు గలిగినఁ గడఁగి వీరిఁ, బట్టిపల్లార్తుఁగాదె నీపాదమాన. 157

సీ. రాజబింబాస్య యీరాజకీరములకు నీముద్దుమాటలు నేర్పుకొఱకొ
యిందీవరాలక యీపూవ్రులకు నెల్ల నీమేనితావులు నింపుకొఱకొ
నవమోహనాంగి యీనవమయూరములకు నీలిన్నినడపులు దిద్దుకొఱకొ
వామాక్షి యీపల్లవములకు నీమోవిబింబకాంతులు కైకొలుపుకొఱకొ

తే. కాక యివ్వనసీమ నిర్జీకతంబ, యేకతంబునఁ దిరిగెదవే యొయారి
నన్ను ధన్యునిఁ జేయుయత్నంబు దక్కఁ, గలదె కలవాణి యొండొకకారణంబు. 158

శా. నాసాగంధఫలీపరాఙ్ముఖగతి న్నాతీ భవత్కేశభృం
గీసంఘం బిరుపాయలై వెనుకకుం గేడించి యచ్చోటు గుం
పై సొంపొందినభంగి సుందరతరంబై చాయనీమంకరే
ఖాసంయుక్తిరి గీలుకంటు సిగ శృంగారంబు రాజిల్లెడున్. 159

సీ. భామినీమణి బెండుపడవిసింగిణులు నీకనుబొమ్మ లైక్షవకార్ముకునకు
జలజాక్షి యక్షయశరములు నీకటాక్షపరంపరలు పంచసాయకునకుఁ
గలికిచాయలు వానిఖడ్గముల్ నీకేలుదోయి ప్రవాళకాంక్షేయకునకు
నెలఁత మనోగతి మెలఁగువాహములు నీకులుకుఁబల్కులు కీరఘోటకునకుఁ

తే. దనకుఁ దగ నివి జాడ్యంబు లరుచు మొదలి, సాధనంబులు పూర్వపక్షములు చేసి
యలివ నీయంగకములు సిద్ధాంతములుగఁ, గైకొని యెఁజుమ్ము మరుఁడులోకముల గెలువ.

సీ. కురియదే కలువక్రొవ్విరివాన జోరున నీవు వీక్షించిన నీరజాక్షి
నిండదే పండువెన్నెలతేట చల్లఁగా నీవింతనవ్విన నీలవేణి
మొరయదే పంచమస్వరలీల ఘుమ్మన నీవుమాటాడిన నిరుపమాంగి
ఘొలయదే గమ్మన మలయజామోదంబు నీయూర్పుసోకిన నిమ్ననాభి

తే. మదనచంద్రవసంతప్రియమలయపవన, నిగ్రహంబులు తలఁప ననుగ్రహంబు
లౌఁగదా నీకృపాప్రసాదాప్తి నిట్టి, రూపముల రాజహంసానురూపగమన. 161

తే. కలిమి కొండంతకలిగియుఁ గఠినరీతి, నర్థికిని మేలుచూపక యకట బయటి
గమకముల నాసకొల్పెడుఁ గలికి నీదు, చన్నుఁగవ లోభిదొరల దీటంద మనఁగ. 162

మ. ఎలనాఁగా మదనాగ్ని వేఁగెడు నయో యీమేను గుత్తంపుఁగ్రొం
జిలుఁగుంబట్టుచొకాటపుంబ్రవికలోఁ జెల్వై సెగల్దేరు నీ
బలుపుంజన్గవనొత్తి పట్టఁగదె నాపై నుష్ణముష్ణేన శీ
తలమంచున్ బుధకోటి పల్కుఁగతి సంతాపంబు చల్లాఱఁగన్. 163

శా. నిన్నుం జూచినవేళనుండి తరుణీ నీరూపరేఖావిలా
సౌన్నత్యంబులు నామదిం దగిలి మోహభ్రాంతిపాలైతిఁ జం
చన్నీలోత్పలబాణవృష్టిని రణఝ్ఝుంకారటంకారసం
పన్నాభంగురభృంగమౌర్వి నటియింపం గమ్మవిల్వంచి ముం
చెన్నించెన్నిజశాంబరీతమము రాజీవధ్వజుం డియ్యెడన్. 164

క. బాలిక శకలితశశిబిం,బాలిక శుకశారికాదికాంగజసేనా
కోలాహలంబు చెవులకు, హాలాహల మగుచు మిగుల నలయించెఁగదే. 165

క. అని యిట్లు పలుకుశశినిం,దనుమోమున కతివ కులుకుఁదళుకుబెళుకువా
ల్గనుఁగొనల సిగ్గుఁ బ్రేమయుఁ, బెనసినచూపుల నివాళు లిడుచుం బలికెన్. 166

తే. రాజనందన జితరతిరాజరాజ, రాజనందన విను మేను రాజకన్య
నీశ్వరానుగ్రహంబున నివ్విధమున, సంచరించెద నివ్వనస్థలులయందు. 167

సీ. స్వాభావ్యమందహాసచ్ఛలంబునఁ బూర్ణహరిణాంకు నవ్వు నీయాననంబు
నైసర్గికాంతారుణవ్యాజమునఁ బద్మిగములపైఁ గినియు నీకన్నుదోయి
సహజోర్ధ్వరేఖామిషమునఁ గెంజిగురులపై ధ్వజంబెత్తు నీపదయుగంబు
నిజభూషణధ్వనినెపమునఁ గరికరనికరంబు నదలించు నీభుజంబు
తే. లిట్టినీచక్కఁదనము పూర్ణేందుబింబ,వదనలకు సాత్త్వికోదయాస్పదము కాదె
కమలభవురచనాచమత్కారమునకు, నరయఁ గూలంకషముగాదె యలఘుచరిత.

చ. మదనవిలాసినీనిరుపమానమనోహరమూర్తిఁ జూచి నా
హృదయము చంద్రకాంతమణి యిందుకరాప్తిఁ గరంగినట్లు స
మ్మదరసపూరమయ్యె ననుమానము సేయక యేలుకొమ్ము పెం
పొదవఁ గవుంగిలించి చిగురొత్తినకోర్కులకున్ ఫలంబుగన్. 160

చ. అని వనితాలలామము నిజాభిమతానుగుణంబుగాఁగఁ బ
ల్కిన పలుకుల్సుధారసము లీల శ్రుతిద్వితయంబు నిండి నె
మ్మనమున సంప్రకాశమగు మన్మథతాపము చల్లచేయ న
వ్వనరుహనేత్రుఁ డెంతె రతివాంఛలు లోఁగలఁ జొక్కళింపఁగన్. 170

క. భృంగీసంగీతస్వన,మాంగళ్యసుగంధకుసుమమంజరులు బయల్
పొంగుమరందము నెపమున, శృంగారరసంబు గ్రమ్మరిలుపొదరింటన్. 171

మ. వలితం గౌఁగిటఁ జేర్చి బింబఫలనవ్యంబైన కెమ్మోవి ప
ల్మోనల నొక్కుచుఁ జెక్కుటద్దము లొగిన్ముద్దాడుచు న్మోహన
స్తనకుంభంబుల నెమ్మొనల్ ఫణుకుచున్ సంభోగచాతుర్యశో
భనుఁడై సల్పె రతిప్రసంగము మహోల్లాసంబుసంధిల్లఁగన్. 172

క. ఆయింతిమదనుపాళెము, నాయకమతి గొల్లగొనఁగ సతనుం డబలుం
డై యొదిఁగి పగరుదోఁచఁగ, నాయఁడు పోంచుండు ననుట నైజముగాఁగన్. 173

చ. కటకట వెన్నవంటికలకంఠిమనం బొకరాయి చేసి మి
క్కుట మగుచన్నుదోయి పయిఁబొంగయినం బలినంటనీక య
ట్టిటుఁ బెనఁగించుకొంళతన మెక్కడఁబోయెనొ కాని సిగ్గుతా
గిటుగిటుమంచుఁ గొమ్మకనుఁగ్రేవలఁ జేరెఁ దుది న్విభుండు ము
చ్చట తమిరేఁచి లోఁబఱిచి జవ్వనమెల్లను జూఱలాడఁగన్. 174

సీ. సొగసుఁ బల్మోనగంటు చుఱు కెఱుంగఁగరాని పెదవులయమృతంపుఁబిల్లుసొక్కు
తారహారముల యొత్తడ మెఱుంగఁగరాని పరిరంభముల ప్రేమపరవశంబు
గిలిగింత యక్కుపెక్కు లెఱుంగఁగారాని మర్మసంస్పర్శనానందసుఖము
సిగ్గుపోకడమాట యెగ్గెఱుంగఁగరాని తమిహెచ్చరింపువాక్యములముంపు
తే. ముదుసుఁదమకంపుఁ గలయిక నొదవ్వనలయి,కల నెఱుంగఁగరాని యగ్గలపుఁగళల
యుబ్బు నుబ్బువినోదమై యొనరె నపుడు, సమరతిక్రీడ రమణికి రమణునకును. 175

తే. ఇవ్విధంబున జవ్వని నవ్వసింబ్ర,గాఢమోహార్తిఁ గొన్నాళ్లు కలసిమెలసి
మకరకేతనరాజ్యసామ్రాజ్యపదవి, కెలమిఁ మూర్ధాభిషిక్తుఁడై యేలుచుండె. 176

తే. ఆతనికన్యాసమాగమస్థితి తఱియ, మిథునవర్తనముఁ బెంపు మిగిలియుండె
బుధునికన్యాసమాగమమిథునవర్తనములు పెంపువహించుట నైజముకద. 177

వ. ఆసమయంబున. 178

క. ముక్తామణిభరణాంచిత,శుక్తిప్రతిమాన మగుచు సుదతీమణికిన్
నక్తంకరజాతకళా, యుక్తంబై గర్భమమరె నుజ్జ్వలలీలన్. 179

క. చెక్కుల తెలుపును జిగిచను, ముక్కుల నలుపును నపాంగములఁ దేలికళా
దృక్కుల సోలపును నెడనెడ, వాక్కుల యలపును ఘటిల్లె వనితామణికిన్. 180

ఉ. కేలి తమిం జెలంగి తమకించి నిజోద్ధతిఁ జూపఁ జూచు న
వ్వేళఁ బ్రశాంతుఁ జేయు నరపించసిభాననకుంచితాంచిత
భ్రూలతికావిలాసమునఁ బొల్పకచుంగవ మోడ్పుతోడ గ
ర్భాలసజాతశైత్యగతి రవాననపద్మము ప్రాణనాయకున్. 181

ఉ. రావె కృశోదరీ యనుచుఁ రాగసపె లేనుమధ్యయంచు హే
లావతు లెక్కునక్కునకుఁ బట్టి శిరంబువాంచు ల
జ్జావశమందహాసవిలసన్ముఖియై యకరాంబులగ్నఘా
గావహావిస్తరంబు లేఁయం గను భంగి లతాంగి యయ్యెడన్. 182

సీ. దృఢసంపదల కింకఁ దిరుగుఁబాటనియొ స్తనంబుల ముఖములు నల్లనయ్యె
జిగిబిగి పరిపాటి యగు నింకననియో తనూలత చంచలానూపమయ్యెఁ
గళ పెంపు మట్టుగాఁ గలదింక ననియొ ముఖాబ్జంబు వెలవెల్లనై యెసంగెఁ
బ్రావ్యాఢితనమింకఁ గొలఁదియౌ ననియొ దృగంచలంబు లలసావికాసమయ్యె

తే. నెప్పుడుఁ బతిప్రక్కఁ బాయనియెలమి కలిమి, యెడ నెడలఁ గాసిలఁ భేఁయింపదింకననియొ
యంతరంగంబు మిగుల జాడ్యంబునొందె, సతికి గర్భంబు పర్థిల్లు సమయమునను. 183

వ. అంత. 184

క. నవమాసానంతరమున, నవమోహనగాత్రి గాంచె నందను రాకా
ధవళకరుం బ్రథమదిశా, కువలయదళనేత్ర గాంచుకొను రమరంగన్. 185

శా. సూచించెం బరమోచ్చభాగపరిహారస్వస్థవర్గోత్తమ
ప్రాచుర్యోచితసృక్సమేతశుభదారంభగ్రహానుగ్రహం
బాచక్రాచలధారుణీవలయరాజ్యశ్రీయుతైశ్వర్యవి
ద్యాచాతుర్యగుణాదిభావిఫలముల్ లగ్నస్థకాలంబునన్. 186

మ. గణనాతీతవిశేషలీలఁ గురిసెన్ గంధర్వగీర్వాణచా
రణవిద్యాధరదంపతిప్రకరనిర్యత్పుష్పవర్షప్రక
ర్షణము బ్బాలకుఁ దుద్భవింపఁగ సమస్తక్షోణిరక్షావిచ
క్షణదీక్షారచితాభిషేకవిపదుర్గంగాంబుధారాకృతిన్. 187

ఉ. తత్సమయంబునం బుధుఁ డుదారముదావహచిత్తవృత్తిఁ బు
త్రోత్సవకృత్యముల్ నడపె యోగిజనంబు లితం దఖండసం

పక్షము పేశలీల సమపద్ధతి నేలఁగలం డనేకసం
వత్సరము లుష్ణాంశుకులవర్ధనుఁడై జనలోక మంతయున్. 188

క. ఆసినిర్ణయించి మిక్కిలి, యనురాగముతోడ మంగళాశాసన మిం
పొనరఁగ జేసి పురూ,రవుఁ డనియభిధానం బొనర్చి రబ్బాలునకున్. 189

సీ. పాలుఁద్రావు బిగువుఁగుబ్బల నెమ్మొనలకీలు పసపుంటుపయ్యెదపై నటింపఁ
గాయంపుముద్దల కారంపుఁదావు లాస్యనిసర్గవాసన నలమికొనఁగ
నడుమునదిటముగా వడిఁజుట్టికట్టిన బంగారుమైజారుకొంగు దనర
నుల్లిపూసలపేరు హారుమంజిముత్యాలకుతికంటు దాపునఁ గొమరుమిగులఁ
తే. ప్రసవసమయపరిశ్రాంతి బడలియున్న, యంగకమ్ముల నొకవింతయంద మెసఁగ
జాడఁ దగియుండె నప్పుఁడానృపతియందు, లాలితంబైన బాలెంతరాలితనము. 190

సీ. అర్థక్షణంబైన నంతరాయములేని కౌఁగిలి యత్నసంఘటిత మయ్యెఁ
గుచపీడనంబు చేకొలఁదిసారెకుఁ జేయు మమతహస్తస్పర్శమాత్ర మయ్యెఁ
గపురవిడ్యపుఁదావి గ్రమ్ముచుంబనలబ్ధి కటువస్తుపరిమళకలిత మయ్యె
ఘనచక్రబంధభావనటనలఁ జూపునేర్పులకు జొక్కుటలపరూప మయ్యె
తే. నతసిహ్మ్యపయంబు పూర్వపూర్వానుభవతఁ, బొదలె బాలెంతరాలిసంభోగకేళి
నలవియె యెంచఁ బ్రసవితానంతరద్వితీయమాసమాగమాధిక్యసుఖము. 191

క. ఈకరణి మఱియుఁగొన్నా, ళ్లాకరభసిభోరుఁ గూడి యతిశయసమ్మో
దాకరవిహారగతుల సుధాకరనందనుఁడు మెలఁగుతత్సమయమునన్. 192

చ. ప్రతిదినవర్ధమానసితపక్షకళానిధికైవడిం బ్రవ
ర్తితరమణీయశైశవశరీరవిరాజితుఁడై విభూషణ
ద్యుతి యతిచిత్రమై వెలుఁగుచుండ జగజ్జనలోచనోత్సవ
స్థితిఁ బసరెంబురూపవుఁ డశేషవిశేషగుణాభిరాముఁ డై. 193

వ. అంత. 194

క. తనయాకృతి పితతామో,దనిదానంబయ్యె నపుడు తరుణీమణికిం
దనయాకృతి పితతామోద,నిదానంబయ్యె నది యథార్థముగాదే. 195

చ. కతిపయివాసరంబు లరుగన్ భ్రమశాలక యొక్కనాఁడు కు
త్సితమగునాత్మవర్తనము చిత్తమునం దలపోసి రోసి దుః
ఖిత యగుచుం దలంచె మదిఁ గేవలయోగసమాధినిష్ఠ నూ
ర్జితకరుణాదిసద్గుణగరిష్ఠు వరిష్ఠు వసిష్ఠు నయ్యెడన్. 196

తే. తలఁచినప్పుడ వచ్చెభక్తప్రసన్న,పరమకరుణారసార్ద్రస్వభావుఁ డగుట
నమ్మునీంద్రుండు నిజవిగ్రహప్రదీప్తి, విపినదేశంబు నెంతయు వెలుఁగఁజేయ. 197

క. ఆగతి నాగతుఁ డగున,య్యోగిశిఖామణిపదాబ్జయుగళంబునకున్
సౌగుణ్యగతిఁ బ్రణామము, నాగజగామిని యొనర్చి యవనతముఖి యై. 198

మ. తనవృత్తాంతము విన్నవించి పురుషత్వప్రాప్తికై వేఁడినన్
మునినాథాగ్రణి యూరడించి గిరిరాణ్మార్ధ్యకన్యావిగూ
హనరోమాంచితసవ్యభాగు భుజగేంద్రాకల్పు సంకల్పసం
జననవ్యాళవిహంగపుంగవు శివున్సద్భక్తి భావించుచున్. 199

శా. చిద్రూపంబు నివాతదీపకళికాక్రీలక్ష్యమ్మై లోన న
క్షుద్రస్ఫూర్తి వెలుంగ వర్జితనిమేషోన్మేషమై దృష్టిభా
స్వద్రాఘిమ్ బయ లందగింపఁ గరణస్వస్థాత్ముఁడై శాంభవీ
ముద్రాముద్రితలీల నిష్ఠనిలిపె న్ముఖ్యప్రకారంబునన్. 200

క. యతియతినియతికి గిరిజా,సతిపతి మతి సంతసించి సౌగుణ్యనిజా
కృతిశ్రుతికతినుతిపాత్ర,స్థితి ధృతియుతి దర్శితంబుచేసె న్మునికిన్. 201

సీ. మస్తకస్ఫూర్జితామరధునీవిధుకళల్ వ్యోమకేశత్వంబు నొనరఁజేయ
మహితధాత్రీకపాలమాలికాబాహుళ్య మాద్యంతరాహిత్యమభినయింప
భయభక్తులను మేలుపడియున్న జగదంబ స్వాధీనమాయాత్వసాక్షిణిగను
గొలిచి వచ్చెడిభక్తకోటి సారూప్యంబు కైవల్యదాతృత్వగరిమఁ దెలుప

తే. సహజమందస్మితరసప్రసన్నవదన, రుచిసదానందభావంబు రూఢిపఱుప
నపుడు ప్రత్యక్షమయ్యె బ్రహ్మర్షిలోక,తల్లజునకుఁ ద్రిలోకబాంధవుఁడు శివుఁడు.

చ. ప్రమథగణంబుతో భుజగభాస్వరహారకదంబకంబుతో
నమరధునీతరంగలుఠనాత్తజటాపటలంబుతోఁ దురం
గమితవృషేంద్రచంక్రమణకల్పనతోఁ గనుపట్టుపార్వతీ
రమణుని గాంచి హర్షజలరాశిపరిప్లవదంతరంగుఁ డై. 203

వ. సాష్టాంగదండప్రణామంబు లాచరించి యిట్లని స్తుతియించె. 204

లయగ్రాహి:—

అంగజభుజంగమవిహంగప కురంగకర భృంగినుతమంగళతరంగపటుశృంగా
రాంగభటపుంగవతురంగమ మతంగజశతాంగచతురంగబలరంగదరిభంగా

వ. రూపరేఖాజితప్రద్యుమ్నుం డగుసుద్యుమ్నుని నిజవదనచంద్రచంద్రికావికసిత జగజ్జననయనకైరవుం బురూరవుం దోడుకొని ప్రతిష్ఠానపురంబున కరుగుదెంచు చుండె నవ్వార్త చారులవలన వినినవాఁడై వైవస్వతవసుంధరావల్లభుం డుల్లాసంబున నుల్లంబు పల్లవింపఁ బురంబు శృంగారింపం బరిచారకుల నియోగించిన వారును సంభ్రమంబున నానావిధశృంగారరచనల నపూర్వవిలాసంబుగా నగరం బలంకరించి రప్పుడు. 214

సీ. పౌసఁగుపన్నీటిపాల్పున జొబ్బిలనివీథి పచ్చికస్తురి నల్కఁబడనియరుగు
వెడఁదముత్యముల ముగ్గిడనిముంగిలి కల్పసూనతోరణలబ్ధి లేనివాకి
లాటపాటలయింపు లమరనిసభ మహోత్సవముసేయని దేవతాగృహంబు
నగరుధూపపుఁదావు లతిశయింపనిచోటు శేషవస్తువుల రాజిలనివిపణి
తే. నూతనాలంకృతులను మనోజ్ఞరూప, వైభవులుగాని పురుషుండు వనజముఖియు
వెదకినను గానఁబడుటగల్లదు తదీయ, నగరశృంగారరచన లెన్నఁగఁదరంబె. 215

చ. అరయ నిసర్గసుందరతరావయవోజ్జ్వల యైనపాటలా
ధర కుసుమాంబరాభరణధారిణియై మిగులన్వెలుంగు న
ట్లురుతరనిత్యవైభవసమున్నతమయ్యెఁ బురంబు నవ్యమై
కరము రహించెఁ దత్సమయకల్పితమైనయలంకృతంబులన్. 216

వ. ఇవ్విధంబున. 217

మ. నగరాలంకృతి లోచనంబులకు నానందం బొనర్పంగ న
జ్జగతీనాథుఁ డమాత్యభూసురసుహృత్సంయుక్తుఁడై యాభిము
ఖ్యగతిం బోయి యరుంధతీరమణుపాదాంభోరుహద్వంద్వముం
దగఁ బూజించె నిజోత్తమాంగమకుటోద్యద్రత్నకాంతిచ్ఛటన్. 218

వ. అప్పుడు. 219

మ. ఎలమిం బొంది మునీంద్రశేఖరుఁడు రాజేంద్రుం గృపాబుద్ధి సం
ధిల భద్రాణి భవంతుతే యని తగన్ దీవించి తత్పుత్రపౌ
త్రుల సుద్యుమ్నపురూరవస్సులను సంతోషస్థితిం జూపి సా
గిలి మ్రొక్కించిన నానృపాలుఁ డసురక్తిం గౌఁగిటం జేర్చుచున్. 220

ఉ. హర్షవికాసమానహృదయాంబుజుఁ డయ్యె ననంతరంబ బ్ర
హ్మర్షిసమేతు లందఱు సమగ్రశతాంగము లెక్కి వైభవో

త్పాక్షతశ్రేణు లంబరంబునకుఁ బ్రస్తర వచ్చిరి పౌరమానసా
కర్షణకృత్ప్రసన్నముఖకైరవిణీప్రియబింబరమ్యలై. 221

ఉ. రాజులు వచ్చి రప్పుడు విలాసవతుల్ కరపద్మశుభ్రవి
భ్రాజితసౌధయూధముల పైఁ బగలెక్కి మృణాలనాళలీ
లాజయహస్తకీలితచలద్వలయక్వణితక్వణంబు లిం
పై జతగూడి మోదించు జనాళికి వీనులవిందొనర్పఁగన్. 222

మ. నవరత్నోజ్జ్వలచంద్రశాలలు విమానంబుల్ తదగ్రాధిరో
హవరారోహలు దేవకన్యలు తదీయాంచత్కరాంభోరుహ
ప్రవమత్కాక్షసుగంధబంధురసుమవ్రాతంబు మందారపు
ష్పవితానంబును గాఁగఁ దోఁచె గణుతింపఁ బ్రేక్షకశ్రేణికిన్. 223

క. ఈవిధమున నధిపతిపై, నావేణుమృదంగశంఖనాదంబులు దం
డై వందిమాగధస్తుతి, రావంబులఁ గూడి చెలఁగ రాజితలీలన్. 224

తే. కలితపురరాజమార్గశృంగారమునకు, నందమొసఁగెడు రాకడ నరుగుదెంచె
నారచితహాటకద్యుతిహాసితరుచిర, తరుణనిజధామ మగునిజధామమునకు. 225

ఉ. వచ్చి కృతోపచారహితవర్తనలన్ గురుచిత్తవృత్తికి
న్మెచ్చొదవంగఁ జేసి కడు నెయ్యమున న్నిజపుత్రపౌత్రులన్
హెచ్చగు సౌఖ్యసంపదల నెంతయుఁ బ్రీతులఁ జేసి భూవిభుం
డొచ్చములేని వేడుకల నుల్లము రంజిల నుండె నయ్యెడన్. 226

సీ. ఏకాంతమున మానవేంద్రుతోడ వసిష్ఠసంయమీంద్రుఁడు సవిస్తరముగాఁగ
సుద్యుమ్నుఁ డలకుమారోద్యానవనమున విహరింపఁ బోవుట విశ్వవిభుని
పార్వతీనియతిచే భామినీరూపంబు సంప్రాప్తమగుట నక్షత్రవిభుని
నందనుతోఁ బొందొనర్చుట తద్గర్భమునఁ బురూరవుఁడు సంజనితుఁ డగుట
తే. యతనిపురుషత్వమునకుఁ దానంబికేశుఁ, గొలువ మగరూపమై నెలనెల నెలంత
యగుచుఁ గ్రమమున నుండు నిట్లనుచు వరము, హరుఁ డొసంగుట తెలిపి యిట్లనియె [మఱియు.

మ. నరనాథోత్తమ యిప్పురూరవుఁడు శ్రీనారాయణాంశోదితుం
డరయం బూర్ణయశఃప్రతాపనిధి యై యష్టాదశద్వీపభా
స్వరసామ్రాజ్యరమానులబ్ధమహదైశ్వర్యంబుచే నొప్పెడున్
ధరలో నైందవరాజవంశవిలసత్కల్పద్రుమాంకూరమై. 228

వ. అని యక్కుమారకుం బిలిపించి తనసమీపంబున నాసీనుం జేసి సాముద్రికచిహ్నంబు
లుపలక్షించి యి ట్లనియె. 229

సీ. రత్నగర్భకు వీనిరాజితాజానుబాహాస్తంభసీమ నిత్యాశ్రయంబు
వాగ్వధూటికి వీనివ్యాకోచహల్లకనవ్యజిహ్వాగ్రంబు నాట్యశాల
చింతామణికి వీనిప్రాంతరక్తవిశాలసుందరాక్షులు కేళిమందిరములు
స్వర్ణవేదికి వీనిభవ్యరేఖాశ్రయశయకుశేశయపాళి జన్మభూమి
తే. సకలసౌభాగ్యలక్షణస్వచ్ఛమైన, వీనివక్షంబు లక్ష్మికి విడిదిపట్టు
వీనిసద్గుణసంపూర్ణవిమలహృదయ, నలినకర్ణిక సింహాసనంబు హరికి. 230

శా. నానాద్వీపనృపాలమౌళి నవరత్నస్నిగ్ధకోటీరశో
భాసీరాజితరాజితంబు లగునీ పాదంబులందు న్నవ
శ్రీనిత్యధ్వజవజ్రశంఖహలరాజీవాదిరక్తరే
ఖానీకంబు కుమారశేఖరుభవిష్యద్భాగ్యముం దెల్పెడున్. 231

చ. ఇతఁ డుదయించువేళ నమరేంద్రగురుప్రముఖగ్రహంబు లా
శతకళల న్వెలుంగుహిమధాముని జూచుచునుంటఁ జేసి ని
ర్జితరిపుఁడై ధరాస్థలమశేషము నేలెడు సార్వభౌముఁడై
యతులితకీర్తినొప్పెడు మహావిభవంబునఁ బెక్కువర్షముల్. 232

క. అని పలికిన విని తనమన, మునఁ బెనఁగొను మోదమునను మునిపతితో న
మ్మనుజపతి యనియె వినయం, బెనయ న్మృదువచనరచన యింపొదవింపన్. 233

తే. శిష్యవాత్సల్యమున మీరు చేసినట్టి, యత్నమునఁ జేసి యీడేఱె నన్నిపనులు
నిట్టిశ్రేయస్కరములకు హేతుకంబు, మీయనుగ్రహమహిమగాదే యమీంద్ర. 235

వ. అని మఱియు ని ట్లనియె.

క. మీయుపదేశంబున నితఁ, డాయతమతి సకలవిద్యలందు ధురీణుం
డై యొప్పు నట్లు సదయో, పాయత నొనరింపవలయు నభ్యసనంబున్. 236

క. అని ప్రార్థించిన మంచిది, యని రాజకుమారకునకు సాంగంబుగ న
మ్మునిశేఖరుఁ డుపదేశం, బొనరించె సమస్తవిద్య లంద్యత్ప్రీతిన్. 237

మ. అమర న్నేతకు ఋగ్యజుస్సులును సామాథర్వణంబు ల్నిరు
క్తము ఛందంబును జ్యోతిషంబు మఱి శిక్షా కల్పముల్ శబ్దశా
స్త్రము మీమాంసపురాణసంహితలు ధర్మన్యాయశాస్త్రంబు లా
దిమవిద్యల్ పదునాలుగుం జతురుపాధిప్రౌఢి నభ్యస్తమై 238

చ. సకృదుపదేశమాత్రమున సద్గురుసన్నిధిఁ బ్రాగధీతవి
ద్యకరణి నప్పగించునె కదా మఱి యెన్నఁటికైన విస్మృతం
బొకయెడనైన లేదు చతురుత్తరషష్టికళాకలాపసా
ధకుఁడయి యొప్పెఁ దద్గ్రహణధారణశక్తి వచింప శక్యమే. 239

మ. హరిహస్తిప్రముఖావరోహణము దివ్యాస్త్రప్రయోగోపసం
హరణప్రౌఢి గదాదిసాధనఘనాభ్యాసంబు సారస్వతా
కరవాగ్వృత్తి యుపాయసత్తకచమత్కారంబు షాడ్గుణ్యవి
స్ఫురణం బాదిగ నన్నిటం జతురుఁడై శోభిల్లె నుద్యన్మతిన్. 240

చ. సకలగుణప్రవీణత రసజ్ఞశిఖామణి యైనరాకుమా
రకుహృదయాంబుజం బసితరప్రతిపాదకవిష్ణుభక్తి నై
ష్ఠికయుతమయ్యె మేలిమిపసిండికి నవ్యవికాసపారిజా
తకుసుమగంధ మబ్బినవిధంబున నాతనిభాగ్య మెట్టిదో. 241

వ. మఱియు నప్పరమయోగిపరివృఢుం డతనికి నఖిల జగత్సంచారసామర్థ్యంబును నసాధారణపరాక్రమంబును నక్షీణభుజావష్టంభంబును నక్షయతూణీరంబులును నభేద్యకవచంబును నవధ్యరథ్యాదిసమృద్ధరక్షంబును నణిమాద్యష్టసిద్ధులును మొదలుగాఁగల విశేషంబులు ప్రసాదించి మఱియు నతిరహస్యంబులైనమణిమంత్రసిద్ధక్రియాకలాపంబు లెఱింగించి నిజాశ్రమంబునకుం బోవం దలంచి తనకుఁ గృతప్రణాము లైన వైవస్వతసుద్యుమ్నులసబహుమానంబుగా నాదరించి యనంతరంబ. 242

క. తనపాదములకు వందన, మొనరించిన సంతసంబు నొందుచు సుఖివై
మను మను మని మనువునుఁగు, మనుమని దీవించి యరిగె మౌని నిజేచ్ఛన్. 243

క. అనిన విని శౌనకాదులు, వినయంబున సూతుఁ గని సవిస్మయభంగిన్
వినిపింపు మనంతరకథ, యనుచు సముత్సుకమనస్కులై యడుగుటయున్. 244

శా. రక్షోశిక్షణదక్ష దక్షిణభుజాగ్రక్షిప్తకాక్షేయకా
మోక్షాపేక్షకరక్షణాక్షయకృపామోఘేక్షణాలక్షణా
వీక్షాలక్ష్యసులక్షణావయవద్రాక్షేక్షుద్రవాక్షేపకా
ర్యక్షుద్రోక్తిచయక్షమారమణ అక్షాధ్యక్షపక్షిధ్వజా! 245

క. భద్రాక్షచమకరీదళ, ముద్రాంకితచారువక్ష మోక్షాధ్యక్షా
భద్రాకరకారుణ్యస, ముద్రా రుద్రాభినంద్య మునిజనవంద్యా. 246

భుజంగ ప్రయాతము:—

ధరాజాసురాహ్వ్యాగ్ర ధాటీవిరాజా, విరాజాదరప్రాప్తవిద్యాపరాజా

పరాజాఖ్యవేదక్షపాపర్వరాజా, వరాజాఢ్యభాబాంధవస్వర్ధరాజా. 247

గద్య. ఇది శ్రీ మంగళాచల నృసింహకృపాప్రసాదసంప్రాప్త విద్యావైభవ కనుపర్తి

రాయనమంత్రి తనూభవసుజనహితకృత్యనిత్య అబ్బయామాత్యప్రణీతం బైనకవిరాజ

మనోరంజనం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము. 248



# తృతీయాశ్వాసము.



దురితపాంచజన్య
సారసుసంఘమనిశాచరకితాహిత గం
భీరగుణస్ఫురదుదర
స్మేరసుధాంచితకపోల శ్రీగోపాలా! 1

వ. అవధరింపుము సమస్తసద్గుణసాంద్రు లగుశౌనకాదిమునీంద్రులకు సామోదహృదయ
జలజాతుండై సూతుం డిట్లనియె. 2

క. అంతట వైవస్వతభూ, కాంతుండు సుద్యుమ్ను రాజుఁగావించినఁ దా
నెంతయు నీతి నిలాస్థల, మంతయుఁ బాలించెఁ బ్రజల నానందముగాన్. 3

క. రాజై యొకనెల యొకనెల, రాజాననయై ప్రకాశరాహస్యములన్
రాజద్గతి మెలఁగుచు భూ, రాజనపరిపాలనంబు రహిఁ గావించెన్. 4

వ. ఇవ్విధంబున. 5

## పురూరవుని రాజ్యాభిషేకము.

మ. ప్రకటఖ్యాతి సమస్తభూవలయముం బాలించి సంప్రాప్తవా
ర్ధకుఁడై భోగములెల్ల మాని దృఢవైరాగ్యంబునన్ రాజ్యభా
రకునిం గాఁగఁ బురూరవు న్నిలిపి నైర్మల్యాంతరంగంబుతో
నొకపుణ్యాశ్రమసీమ ముక్తికొఱకై యుండెం దపోనిష్ఠచేన్. 6

వ. ఇట్లు పురూరవుండు రాజ్యాభిషిక్తుండై. 7

సీ. అచలధర్మోజ్జ్వలుఁ డగుటకుఁ దనపుణ్యజనవరమిత్రత సాక్షిగాఁగ
భువనప్రజావనప్రవణుఁ డౌటకుఁ దనకీర్తిత్రయస్ఫూర్తి సంగతముగఁ
గళ్యాణలక్షణాకారుఁ డౌటకుఁ దనభూభృద్విభుత్వంబు పూన్కి సేయ
విబుధలోకామోదవిభవుఁడుఁ డగుటకుఁ దనసౌమనస్యమత్యనుగుణముగ

తే. రాజరూపంబు దాల్చినరాజమౌళి, యనఁగ రాజీవబాంధవుఁ డనఁగ మేరు
శైలమనఁ బారిజాతభూజాత మనఁగ. భూతిరుచిశౌర్యవితరణస్ఫురణఁ దనరె. 8

క. యుగపద్వ్యాప్యకళశభృ, జ్జగదంబకబింబితప్రశస్త యశస్తు
త్యగురుప్రతాపదీపిత, గగనధరాభాగుఁ డగుచు గడునొప్పారెన్. 9

చ. అలఘుపృషత్కపద్ధతి సమస్తజనుల్ ధనవంతు లౌటఁ గా
ల్నిలువఁగఁ జోటులేక భువి లేములు లేమలబల్ పిఱుందుల
న్నిలచునగల్లసందులను నెన్నడుసీమల నీఁగె భానుమం
డలరుచిఁ దూలి గొందుల నడంగిన చీఁకటికైవడిం దగన్. 10

ఉ. ఆతఁడు శక్రయాజ్యమున నాభ్యుదయంబున వర్ధమానలీ
లాకృతి నొప్పెఁ గీర్తులు సుహృద్వనపద్మకలాపనోద్ధతిన్.
దాకొని చక్రపర్వతనితంబములందు దదర్థిభూమియుం
దాఁక నగుంజుమీ యని నిదానము ముందుగఁ జెప్పనైపడిన్. 11

తే. ఇవ్విధంబున సామ్రాజ్యమేలుచుండి, నిజభుజాబలవిస్ఫూర్తి నృపులకెల్ల
దెలియ దృష్టాంతమొనరింప దిగ్విజయము, నేయఁ దూహించియారాజశేఖరుండు. 12

క. అజహదహమహమికాపటు, భుజభుజంగమవిహంగపుంగవధాటీ
నిజదండయాత్రవిజయ,ధ్వజపటకృతగగనచిత్ర దనరంగఁ దలఁచెన్. 13

సీ. గంభీరవేదివిఖ్యాతిచేఁ దనరెసన్నాహ్యంబు లైనదంతావళములు
పంకింప శస్త్రనిపాతధీరంబులై వఱలునాజానేయవాహములును
నప్రతిహతసకలావయవంబులై యమరు హిరణ్మయస్యందనములు
సాంయుగీనప్రశస్తతఁ బెంపుమీఱిన శుష్మాతిశయభీమసుభటచయము
తే. గమనధాటీచలద్ధరాకంపఘటన, పూర్వభరభరణశ్రాంతభుజగకమఠ
శైలదిగ్దంతుఁడై యేగెఁ జటులపటహ, మూర్ఛితధ్వని దిశలు గగ్గోలుపడఁగ. 14

## పురూరవుని జైత్రయాత్ర.

శా. ఆసన్నాహము చూడనొప్పెఁ బ్రకటాహంకార ఘోరద్విష
త్త్రాసోత్పాదకపాంచధారవిచలత్క్రౌంఖాణసంఘాతరిం
ఖాసంఘట్టితగహ్వరీజనితరంగద్ధూళిపాళిచ్ఛలో
ద్భాసాధీశమహామహోదహనశుంభద్ధూమరేఖాంకమై. 15

తే. అమ్మహీశ్వరు విజయయాత్రాధ్వసీమ, నవనిచతురంగపదహతి నవనియద్యో
రణితభేరీ ధణంధణంధణరవంబు, వినినయంతనె విమతులు విమత్తులైరి. 16

శా. ప్రస్థానాహతదుందుభిధ్వనులఁ గంపంబందె నవ్వేళ న
స్వస్థాకారములయ్యె భూమి నచలవ్రాతంబు సంబంధ ని
ర్వ్యస్థానం బగుటన్ క్షమాపతి తదీయాకారసంప్రాపితా
వస్థం బొందెఁ జలంబు నక్షమయు నైవర్తింపఁ దన్నామముల్. 17

ఉ. భంగముఁ జెంది సింధుపతి పాఱె నుతించెను మాగధుండు కా
ళింగుఁడు మానమెల్ల వదలెన్ వనవాసముచేసె మత్స్యుఁ డా
త్మాంగబలంబు లేమి బెగడందె విదేహుఁడు కుంతలుండు దా
సింగితమెంచి చిక్కువడియెన్ నరనాయకు మేటిధాటికిన్ 18

మ. సమరోగ్రుం డగునాన్ధ్రపాలు నెదుటన్ సంగ్రామజిద్వీరసే
నమహాబాహుపరంతపాదు లభిమానత్యాగులై యప్రకా
శముగా నుండిరి పేరుపెద్దఱికముల్ చర్చింప ఖద్యోతనా
మములన్ వాల్చు మెఱుంగుఁ గీటముల సామాన్యంబు పాటింపఁగన్. 19

వ. అప్పుడు. 20

క. శకభూవిభుఁ దవ్విజయము,నకు నోర్వక కురుకరూశనరనాథసహా
యకుఁడై చతురంగబల, ప్రకటపదాహతుల ధరణిభాగము గదలన్. 21

వ. చుట్టుముట్టి బెట్టిదం బగుధైర్యంబునం బోదివె నప్పుడు. 22

ఉ. బెబ్బులిమీఁదటం గవియు పెన్వృభషంబులభంగి దోఁపఁ గా
నబ్బలుయోధుపైఁ గదిసి యార్పులు నింగిఁజెలంగ నాన్ధ్రపుల్
నిబ్బరపుంజలంబున వినిష్ఠురబాణపరంపరార్భులా
గుబ్బగఁ బ్రజ్వరిల్లఁ బయకొన్నబలం బెడతాఁకె నయ్యెడన్. 23

క. పరశుముసలాసిముద్గర, శరపట్టిస భిండివాలచక్రగదాతో
మరకుంతశక్తిశూల,క్షురికాదుల నుభయబలము శూరతఁ బోరెన్. 24

వ. ఇట్లుభయసైన్యంబులు భయశూన్యంబై యన్యోన్యజిగీషాపరతం దాఁకి పోరు
నెడఁ బరూరవ్రబలంబు చలంబున విజృంభించి మించి వజ్రివజ్రాయుధంబుధార
బారికిం దప్పియొప్పిన వసుంధరాధరంబులవిధంబుం గైకొని దుర్దాంతదంతఘట్టనల
నుద్దండశుండాదండప్రహతుల నహితుల నహితుల నిహతులంగావింపుచు నాధోరణ
రణక్రీడాసముత్సాహపోషకపుణ్యకారణంబు లగువారణంబులును, అష్టావధానధు
రావుత్తబాహా స్తంభకుంభన్నిశిత నిస్త్రింశధారాపాతలక్ష్యంబులకు విమోఘ
సంపాదకంబులైన ధావనవల్గనవేష్టనాదిగతివిశేషంబులఁ బ్రతిభటచతురంగ భంగ

పాటవంబునకు సంవర్తసమయసముద్రతరంగంబులైనతురంగంబులును, భుజావష్టంభసమధికస్థైర్యనిరవధికరథికనికరధనుర్ముక్తనిశితవిశిఖాశనిజన్యదేశంబులై రిపుమండలంబు గుండియ లవియించు నేమినిర్ఘోషస్తనితంబు చెలంగ నారచితమణిఘృణివిద్యుదుద్యద్ద్వీపులాద్యస్థలచరచ్ఛగిడంబులై తోఁచు నరదంబులును లేళ్లకిందుపై నుఱుకు నుద్దండపుండరీకంబులపీఁక ఛాకసేయుచు నిజప్రతాపదహనజ్వాలాజాలంబుల పోలిక భగభగాయమానంబులై వెలుంగు నలుగులంగలుగు కఠోరకుఠార కఠార కుంతప్రభృతిసాధనంబులసాదన మెఱవడి నురువడిం బరవళ్లు ద్రొక్కుచుఁ బెక్కు చందంబుల విరోధివరూథినిం బోడవడంగించు విక్రమారభటు లగువీరభటులును, వీక్షమాణగీర్వాణశిరకంపసంపాదక ధాటీ నిరాఘాటభుజాటోపపాటవంబున నాక్రమించిన నయ్యుద్ధతికిం బ్రతిఘటింపంజాలక పరాభూతంబులై వెఱచి పఱచు నిజసైన్యంబులం గలయంగనుంగొని శకనృపాలుండు రోషరక్తాంబకుండై యంబకంబు లాకాశంబు నిరవకాశంబుగా నిండుకొన గండుమిగిలి కోదండపాండిత్యంబు నెలపుచు నిజబలంబులం బురికొల్పికొని కడంగిసంగరంబభంగురభంగి నొనర్ప నప్పు డయ్యిరువాఁగున విక్రుతాకారంబులైపడిన గజవాజిభటకళేబరంబులును శకలీకృతంబులయి కూలినరథంబులును, ప్రవాహంబులయిపాఱురక్తంబులును, రాసులయిన మాంసంబులును ప్రోవులయినప్రేవులును, శిథిలంబులయినకిరీటకుండలప్రముఖభూషణంబులును, వ్యాకీర్ణంబులైన ఛత్రచామరంబులును, భగ్నంబులైన నానావిధసాధనంబులునుం గలిగి చూడ బీభత్సరసప్రధానంబై బహుపలలఖాదనకుతూహలప్రమత్తభూతబేతాళకోలాహలంబు భూనభోంతరాళంబు నిండుకొనం బ్రచండబై యబ్బండనంబు త్రిలోకభీకరంబై యుండె నప్పుడు. 25

మ. ప్రకటాహంకృతిఁ బోరువైరిబలముల్ భగ్నంబులై పాఱఁగా
శకలీభూతదిశేభకర్ణకుహరజ్యాటంక్రియాఘోరకా
ర్ముకుఁడై బాణదవాగ్నిపైకొలుపుచుం గ్రోధంబుతో వచ్చుచం
ద్రకులాధీశ్వరు డాకకున్నిలిచి ధైర్యస్ఫూర్తి వర్తిల్లఁగన్. 26

క. శకభూపతి నిశితాంబకనికరంబులు పైపిగుడ్ప నిష్ఠురభల్ల
ప్రకరములఁ ద్రుంచి నొంచెం బ్రకటపరాక్రముఁడు చంద్రపౌత్రుం డతనిన్. 27

వ. ఇవ్విధంబున మఱియును. 28

చ. రణ మొనరించి రంబరచరత్సురచారణసిద్ధనిమేషవీ
క్షణవిభవాంతరాయకృదఖండమహాబిలభాగభాగవా

రణనిబిడీకృతప్రదరరాజిఘనస్థగితక్షితిపుంజులై
రణమురుశింజినీపటుతరధ్వని దిక్కులు ప్రక్కటింపఁగన్. 29

చ. ఇటువలెఁ గొంతప్రొద్దు తనయిచ్చకు నించుక మెచ్చురాఁగఁ బ్ర
స్ఫుటధృతిఁ బోరుచున్నశకభూపతి గర్వము నంగఁ జేసి యొ
క్కట హయసూతకేతురథఖండనకేళి యొనర్చి పేర్చి యి
ట్టటు జుణగంగనియ్యక బుధాత్మజుఁ డాతనిఁ దోడియోధులన్. 30

తే. పట్టుకొని యవ్విభుండు కృపాళుఁ డగుట, నిగ్రహింపక వారి ననుగ్రహించి
యస్మదాజ్ఞానువర్తులై న్యాయపరత, నేలుఁడని రాజ్యభారంబు లిచ్చి మఱియు. 31

మ. భువనఖ్యాతిఁ బరూరవఃప్రభుఁడు జంబూద్వీపనామంబునన్
లవణార్ణోధిచతుర్దిశావధికలీలం బొల్చుభూమండలిన్
నవఖండంబులఁ గల్గురాజులు నిజాజ్ఞావర్తులై కానుకల్
వివిధార్థంబు లొసంగఁ గైకొనుచు నుర్వీశ్వర్యం బవార్యంబుగన్. 32

చ. తనకు వసిష్ఠమౌని విదితంబుగఁ జెప్పినమంత్రశక్తి సై
న్యనికరయుక్తుఁడై గగనయానత నంబుధు లుత్తరించి కై
కొనియెను దీవు లెల్ల నిజఘోరశరౌఘవిభూతిధైర్యులై
తను శరణంబువేఁడుకొను తద్ధరణీశుల నాదరించుచున్. 33

సీ. లక్షయోజనములు లవణాంబురాశి లక్షద్వయం బైక్షవసాగరంబు
చర్చింప నాల్గులక్షలు సురాజలధి లక్షాష్టకం బాజ్యమహార్ణవంబు
పదియాఱులక్షలు పరఁగ దధ్యుదధి ముప్పదిరెండులక్షలు పాలకడలి
యిలఁ జతుష్షష్టిలక్షలు శుద్ధజలవార్ధి యిట్టివిశాలాబ్ధు లేడుగడచి
తే. కొనియెఁ దన్మధ్యముల నట్టికొలఁది దనర, స్థలిని జాంబవప్లక్షశాల్మలములు
వరకుశక్రౌంచశాకపుష్కరము లనఁగ, నొప్పుమీఱిన దీవు లాఱొక్కటియును. 34

శా. చక్రాకారధరాధరేంద్రము జయస్తంభాకృతిం బొల్చె ది
క్చక్రాంతస్థలిఁ దన్నృపాలకజగచ్చక్షుశ్శతాంగస్ఫుర
చ్చక్రానాహతసంభ్రమభ్రమణచంచద్ధాటికావ్యాప్తభూ
చక్రావధ్యుపసూచకం బగుచు విశ్వఖ్యాతి సంధిల్లఁగన్. 35

వ. ఇత్తెఱంగున. 36

శా. నానాద్వీపనృపార్పితాంచదుపధానైర్మల్యమాణిక్యము
క్తానీలాదివినూత్నరత్నవరసౌందర్యాంగనాదివ్యభూ

పానవ్యాంబరముఖ్యసంపదలతో సంప్రీతుఁడై క్రమ్మఱం
దా నేతెంచె నృపాలుఁ డాత్మపురి కుద్యద్వైభవోపేతుఁడై. 37

సీ. తనకీర్తికర్పూరమునకు బ్రహ్మాండకటాహంబు దగుకరాటంబు గాఁగ
దనభుజాకర్బురస్తంభంబునకు ధరాసతి ఘటన్మరకతప్రతిమ గాఁగ
దనబాహుశౌర్యభేతాళసాధనకుఁ జక్రక్ష్మాధరము సాము గరిడిగాఁగఁ
దనసద్విలాసకందర్పమూర్తికి జనస్వాంతములు కేళిగేహములుగాఁగఁ
తే. దనకథామృతసరసికి ఘనకవీంద్రవదనభారతి రాయంచవనితగాఁగ
నమ్మహామహుఁ డద్వితీయాతపత్రుఁడై జగంబేలుచున్నవాఁ డమరవర్య. 38

క. అని యనిమిషసభ నృపసో,ముని మునిపతిశచ్చరిత్రముం దెలుపుచుఁ దే
రొక్కని గొనియాడఁ దదుక్తులు, విని వినిభృతహర్షులైరి విబుధేంద్రాదుల్. 39

తే. అతనిసద్గుణవర్ణనం బాలకింప, నింపు చిగురొత్తె రంభకు హేమ కరఁగె
నల మదాలస చొక్కె నాహరిణి చకిత, యయ్యె శశిరేఖ తలఁప రసార్ద్రయయ్యె.

సీ. అమ్మహారాజువృత్తాంత మాసక్తితోఁ జెవియొగ్గి వినని రాజీవగంధి
విని వానిభువనమోహనవిలాసస్ఫూర్తి సారె భావింపనిచంద్రవదన
భావించి యతనిసంపర్కంబునకుఁ జాల ముచ్చటపడని నమ్మోహనాంగి
ముచ్చటపడి చిత్తమున వెన్నవలెఁ గరంగుచుఁ దన్మయత గీల్కొనని రమణి
తే. తన్మయతచేత నార్ద్రకందర్పగేహ, యగుచుఁ దెలివొంది యసురుసు రనని వసిత
గానఁబడదయ్యె సురగణికాజనంబు,లో నొకర్తైనఁ దత్సభాస్థానమునను. 41

తే. పూనె ఘర్మాంబుకళికలు మేన మేన, చిత్రరేఖాకృతివహించెఁ జిత్రరేఖ
మనసిజవరూథినికి వరూథినిచలించె, నిందుమతి వేఁడుకొనెఁ గామునిందుమతిని. 42

ఉ. కిన్నరరాజనందనునికిం దెగనమ్మినసొమ్ములై తనం
చన్నఖశోరకాంకముల శాసనరేఖలు దాల్చు గుత్తపుం
జన్నులొగిం గగుర్పొడిచె జల్లున రంభకు దారరూపసం
పన్నతనొప్పు నత్రిసుతపౌత్రు చరిత్రము విన్నమాత్రలోన్. 43

వ. అప్పుడు. 44

ఉ. కెంపుమొగంపుఁబచ్చతురికీ నుఱికింపుచు ఝంకరింపు చే
నింపొదవించు నారిబిగియింపుచు వాచవి పెంపునింపుము
ప్పంపులకైదువుం దిగిచి పంపుచుఁ దావుల యంపసోన వ
ర్షింపుచు జాలిమాలి గొనఁజేసె మరుం డమరీకదంబమున్. 4

ఉ. కాముని బాణముల్ నిరవకాశముగా సురకామినీమన
స్సీమలఁ బర్వుచుఁ గటికచీఁకటి గ్రమ్మఁగఁ జేసెఁ దచ్ఛర
స్తోమ మసంఖ్యమై మదికిఁ దోఁచఁగ నాకతిజాని కయ్యెడం
డేమి దలంచి చేసెనో సుమీ యను పంచశరాభిధానముల్. 46

వ. అట్టియెడ. 47

సీ. అతని బింబాధరం బందని మ్రాన్పడని విచారించె మదాలసాఖ్య
యతని చేసోఁకు సయ్యాటలేఁటావలిగెల్పింపఁ లని వితర్కించె రంభ
యతని తాంబూలగంధాస్వాప్తి యేచుఁగుమీఁదిసున్నం బని మేన యెంచె
నతనికృపారసామృతవృష్టి పెనఁగంగయునక మంచు ఘృతాచి మదిఁ దలంచె
తే. జనమనోరమ ధ్యానమాలికఁ గళావతియుఁ దిలోత్తమ పూర్వచిత్తియుఁ బ్రమోహి
మొదలుగా నింకులకుఁ జెంతయొదవె నకని, చిత్తమదిగట్టుచాటునిత్యేప మనుచు. 48

క. ఆవిభుసరోవ్వత్కర్షత, భావింపఁ దదాప్తి దుర్లభంబని తచ్ఛం
కావిర్భవదురునిశ్వసనావధికప్రేమ లైరి యమరలతాంగుల్. 49

వ. వారిలోన. 50

సీ. పుట్టినయి ల్లేప్రపూర్ణేందుముఖికిని నారాయణస్వామియూరుసీమ
నాట్యవేదార్థంబునకు నేకళావతి లాస్యనిరూఢి కూలంకషంబు
ప్రశమబహూకారపాత్రలలోన నేయింతిహరిహరాజేంద్రసభలఁ
గారణం బేహంసగమనరూప మరుంధతీమనోహరు పునర్దేహలబ్ధి
తే. కట్టి యూర్వసి భువనమోహనవిలాస, నిఃకటాక్షపరంపరావిజితకుసుమ
ధన్వచార్వసిసౌమ్యనందనకథాసు, ధార్ణవాంతర్నిమగ్నాంతరంగ యగుచు. 51

ఉ. అన్నరనాథు చక్కఁదన మాధరణీశ్వరుభోగభాగ్యసం
పన్నత యమ్మహామహుని ప్రాజ్ఞత యవ్విభుధైర్యవిక్రమా
ద్యున్నతి దేవమౌని సరసోక్తులఁ గర్ణరసాయనంబుగా
విన్నదియాదిగాఁగ నళివేణికిఁ గన్నులఁగట్టినట్లయై. 52

## ఊర్వసి పురూరవుని విరాళిగొనుట.

క. ఆతనివిలాసగుణాదులు, మతిదలఁ ఫుచు మోహజలధిమగ్నత చేఁ ద
ద్గతమానసయై వేలుపులతకూన వియోగవిప్రలంభము నొందెన్. 53

తే. కలికిడెందంపుబాదున మొలచి కొనలు, సాఁగి సంకల్పలతలు సంజాతపులక
ఘర్మజలబిందుమిషమునఁ గానిపించెఁ, బల్లవితకోరకితలత్మి బయలుమెఱసి. 54

వ. తదనంతరంబ. 55

మ. సరసానుగ్రహలోచనాంచలవిలాసభ్రూలతాసంజ్ఞ చే
స్వరధిష్ఠాత యొసంగుదివ్యపటభూషాపూర్వకానుజ్ఞ సుం
దరి తాఁ గైకొని మందహాసముఖచంద్రజ్యోత్స్నికాభృత్కచాం
తరయై యాపలవాంచి మ్రొక్కి యరిగెం దచ్చింతతో నింటికిన్. 56

తే. కొలువు చాలించి శుద్ధాంతనిలయమునకు, నరిగె వజ్రి యథేచ్ఛావిహారపరత
నేగె నాటకమునివరుం డెల్లసురలుఁ జని, వసించిరి నిజనివాసములయందు. 57

శా. ఆచందంబున నూర్వసీరమణి యాత్మావాసముం జేరి రా
కాచంద్రాతపధాళధళ్యరుచిరంగత్తుంగసౌధాగ్రలీ
లాచిత్రాంతరదివ్యహంసమృదుతూలస్నిగ్ధశయ్యరి బ్రచిం
తాచేతోగతిఁ బవ్వళించి నృపుచందం బాత్మ భావింపుచున్. 58

వ. ఇట్లని తలంచె. 59

ఉ. ఏటికిఁ జెప్పెఁ దాపసి నరేంద్రుని పెంపు సురేంద్రుతోడ నే
నేటికి వింటిఁ దద్గుణములెల్లఁ బరాకొకయింత లేక నా
కేటికిఁ బుట్టె వానిపయి నెంతట నంకెకురాని ప్రేమ న
న్నేటికి నప్పగించెఁ గుసుమేషుని బారికి దైవ మక్కటా! 60

క. నాకం బెక్కడ ధరణీలోకం బెక్కడ దలంపులో ముచ్చటయ
య్యేకచ్ఛత్రాధీశ్వరు, దూఁకొను టదినాకు నెట్లు దొరకెడునకటా! 61

ఉ. ఎన్నఁడు చూడఁగల్గెడినొ యిందుకళాగ్రణిముద్దుమోము నా
కన్నులు చల్లఁగా నతనిఁ గౌఁగిటఁ జేర్చి సుఖాప్తిఁ జొక్కి భా
గ్యోన్నతి గల్గునో కలుగదో వల పెంతట నేమి సేయఁగా
నున్నదొ దైవయోగ మెటు లున్నదొ దీని కుపాయ మెద్దియో. 62

మ. కలుగుంగా యలరాజశేఖరునఖాగ్రస్పర్శతం బొందుచున్
గిలిగింతల్ గొనుగుబ్బచన్మొన లెదం గీలించి నిండారఁగాఁ
గిలిగా నాతమి దీర నొక్కి చిగురుం గెంజాయనున్మోవి జొ
బ్బిలు తాంబూలసుగంధసీధువు ముదాప్తిం గ్రోలుచుం జొక్కఁగన్. 63

ఉ. అవ్విభుచిత్తముం గరఁగునట్లుగ వేళయెఱింగి వద్విధం
బెవ్వరు విన్నవించెద రదేల గ్రహించు నతండు చూపులన్
నవ్వులమాటలన్ విలసనంబులఁ దక్కఁ బెనంగఁజాలు మే
ల్జవ్వను లుందు రందు రతిసౌఖ్యవిమోహితుఁ జేయకుందురే. 6

మ. మదినంతంతకు నగ్గలించుబలుప్రేమం బాళిరా దేమి సే
యుదు నేయత్నముచేత వశ్యుఁ డగు నాయుర్వీశుఁ డేనోము నో
ముదు నేదైవము వేఁడుకొందు ఇఁక నీమోహాబ్ధికిన్ మేర యె
య్యది నాకెవ్వరు ప్రాణబంధులు మదీయాసక్తి యీడేర్పఁగన్. 65

వ. అని చింతింపుచు. 66

ఉ. రేచితబాహ్యవృత్తిఁ గను రేచకపూరకకుంభకక్రియా
సూచన నూర్పులన్నిడివిఁ జొప్పడ వల్లభురూప మాత్మలోఁ
జూచుచుఁ దక్కఁ గామధుపసోపానశీలత నుండెఁ బుష్పనా
రాచనరూపదేశమున రాజశిఖామణి తదేకనిష్ఠతోన్. 67

వ. అప్పుడు. 68

చ. చిలుకలు తేరు మేల్ చెఱకుసింగిణి వాసనగుపవపూవుట
ములపొది వాఁడిచెంగలువమొగ్గకటారి మీఁటారితేఁటిశో
యిల గొరవంకపౌఁజు లెగనెత్తినపొంకపుమీనుడాలు పెం
పలర రతిప్రియుండు దివిజాంగన కుద్ధతి చూపె నయ్యెడన్. 69

క. చెఱకువిలుకాఁడు కోమలి, యిఱుకుంజనుదోయినడిమియెడ గుఱియిడి తాఁ
గఱకువిరిములుకు లేసెం, జుఱుకునఁ దనచేతిమేటిసూటిన్ ధాటిన్. 70

క. మనసిజుశరమంటెను జేలి, చనుగొండలనడుమ నదియె శర గిరియోగం
బనిపించెఁ జెమటవానలు, పెనఁగొనుసిట్టూర్పుగాడ్పు బిసబిస విసరన్. 71

మ. జళిపించుం జిగురుంబిరంగి గదుమున్ ఝాత్కారధీరధ్వనుల్
చెలఁగం బచ్చనిఱెక్కజీన్పులుఁగుతేజిన్ హెచ్చరించున్ హళా
హళిగాఁ దుమ్మెదమూకలన్ విజయశీలాహంకృతిన్ హుంకృతుల్
సలుపుం గుండియ జల్లనన్ గలువనేజారౌతు హేమాంగిపైన్. 72

సీ. నళినలోచనకుఁ బున్నమచందమామ లేయెండలు వేసంగియెండ లయ్యెఁ
గాంతకుఁ గలకంఠకంఠపంచమకుహూకారంబు గర్జావికార మయ్యె
విమలేందుముఖికి నవీనమైనకురంగనాభి యచ్చపువత్సనాభి యయ్యె
నరుణాధరకుఁ జందనాచలాగతగంధవాహంబు గరళప్రవాహ మయ్యె
తే. లలనకు రసాలశాఖాచలప్రవాళ,పాళి జాజ్వల్యమానదీపాళి యయ్యె
ముద్దుగుమ్మకు నీచందమునఁ బ్రమోద,కరము లెల్ల మనోవ్యథాకరము లయ్యె. 73

ఉ. ఆరుచిరాంగికిన్ మధుకరాళి శిలీముఖపఙ్క్తియయ్యెఁ బ
న్నీరు శరౌఘమయ్యెఁ దరుణీమణికిన్ మలయానిలంబు నిం

బారుణకోమలాధరకు నాశుగమయ్యె ఖగంబులయ్యె శృం
గారవతీలలామకుఁ బికంబులు మస్త్రకసాధనంబు లై. 74

ఉ. పాడదు చల్లఁగా జిలుఁగుఁబాట విపంచివహించి యెప్పుడుం
జూడదు కూర్మినెచ్చెలుల సోఁగకనుంగవఱెప్పలెత్తి మా
టాడదు పంజరాంతరశుకావళి పాలికిఁ జేరఁబోఁగ లో
పీడదు చింత వంత యలివేణి మనోభవబాణఖిన్న యై. 75

ఉ. పువ్వులు మానెఁ దావిమెయిపూఁతలు మానె సఖీజనంబుతో
నవ్వులు మానె కీరవచనప్రతిభాషలు మానె మానెఁ దా
నెవ్వియు నింపుగాక సుఖహేతువు లెల్ల మనోజబాధ నా
జవ్వని దుఃఖితే మనసి సర్వమసహ్యమనంగ లేదొకో. 76

సీ. ఇంకఁబాఱె శరన్మృగాంకబింబాస్యవాతెఱ నూరునమృతంపుఁదేటకాలువ
వసివాళ్లువాడె జీవంజీవలోచన తారుణ్యలీలాశరీరలతిక
కసుగందె నవలీలఁ గైరవకుంతలపొంకపుఁజనుదోయి పువ్వుగుత్తు
లలతనొందెను బల్లవారుణపాణి మోహనయాన మేఘనాదానులాసి

తే. తాపతపనుం డుదగ్రప్రతాపపటుత, వెలుఁగ నిట్టూర్పుగాడ్పు లావిర్భవించెఁ
బ్రబలమై మండువేసంగి పట్టపగటి, వేళయై తోఁచెఁ గొమ్మకు విరహభరము. 77

తే. చిలుకపలుకుఁగూతఁ గోయిల చెవులఁజిలుక, జిలుక పగవారిచుట్టమై చెదరఁబలుకఁ
బలుకలువయీటెదారి దానలఁచెనలుక,నలుకనొందెను జెలిబాష్పజలము లొలుక. 78

క. ఈచందంబున విరహం, బాచందనగంధి కంతకంతకు నధికం
బై చేయునవస్థాగతి, చూచి సఖీజనులు వగచుచుం దమలోనన్. 79

ఉ. ఎక్కడనుండివచ్చెఁ బరువెత్తుచుఁ గొంటుతపస్వి వచ్చెఁ బో
యిక్కరణిన్ విరాళిసివమెత్త వినోదపుసుద్దులెల్లఁ దా
నిక్కడనేల చెప్పె కతలే వెతలయ్యెఁ గదా పురూరవుం
డెక్కడ యీలతాంగివలపెక్కడ దూరవిచార మక్కటా! 80

చ. కలకలనవ్వుకోమలిమొగంబు వికాసమువీడెఁ బొన్నపూ
వలపుల మేనుదేఁగె వసివాడె సుధామధురద్రవంబుజొ
బ్బిలునమోవి యెండె జిగిబెళ్కుకనుంగవ నీరునిండె గు
బ్బలు శ్రమవారిఁ దోఁగె మది భావజుకాఁకల వేఁగె నక్కటా! 81

మ. అకటా యీవెత చూడనే వశముగా దమ్మయ్య కందర్పసా
యకజాలానలకీలఁ గీల్కొను విదాహవ్యాప్తి నెట్లోర్చు నీ

సుకుమారాంగి యటంచు జాలిపడు నాసుభ్రూసమాజంబునం
దొకప్రౌఢాంగన కూర్చెఁ జేరి పలికెన్ యోషిల్లలామంబుతోన్. 84

సీ. పలికించుటేకాని పలచి దక్కవుగదా కుసుమబాణునికైనఁ గోమలాంగి
మోహకంటినె కాని తేఁటిమూకవుగదా యలకశ్రేణికైన నలసగమన
వినయంబులేకాని చనువువేడవుగదా దేవేంద్రుకైన నిందీవరాక్షి
బయటిమాటలెకాని భావమియ్యవుకదా రాజరాజునకైన రాజవదన

తే. చక్కఁదనముఁ గళావిశేషంబు విభవ,మును సిరియు నేకమూర్తి దాల్చినపురూర
వునిగుణమ్ములు గుణము లయ్యెనె లతాంగి, మరుఁ డురులకొల్ప నీమనోమర్మములకు.

సీ. కిన్నరస్వరలీల నెరసుగానవిద్యామాధురికి నీవు లప్పగించి
అపుడె చిక్కటములై కవబోల్చునీదుగుబ్బలకు భావంబులు పాలుపంచి
పైనోఁకు సంగీతపదరసవ్యంజకోజ్జ్వలదృష్టి కాస్యముల్ వశ మొనర్చి
యపరంజిపసిఁడిచాయల నీరుమైమెఱుంగులకుఁ గన్దవలు దక్కలుచేసి

తే. చిత్తిఁ గమంజొక్క చిత్తరుప్రతిమ లగుచు, సుందుమరుగాదె యింద్రాదు లోలతాంగి
కామతూర్యాయమానఘల్లురవాంఘ్రి,వలయవై నీవు నాట్యంబు సలుపునపుడు.

మ. సురవిద్యాధరసిద్ధసాధ్యఖగరక్షోయక్షగంధర్వఖే
చరనాగేంద్రకుమారవైభవవిలాసశ్రీల నింతైన రా
గరసంబందని నీదుచిత్తశశభృత్కాంతోపలం బీగతిం
గరఁగంజేసెనె రాజచంద్రుగుణరాకాచంద్రికల్ కోమలీ. 85

సీ. ఉత్తుంగకుచకోకయుగళంబు దాకొన వదనేందుబింబంబు వ్రాల్చకమ్మ
చారులోచనసరోజంబులఁ జికురంపుటిరులు పైకొన జాఱనీకుమమ్మ
యధరంపులేఁజిగురాకుపై నున్నన నెమ్మోము సెగగాడ్పు నించకమ్మ
తళుకొత్తు చెక్కుటద్దములపైఁ గన్నీటిచినుకులు రాలంగఁ జేయకమ్మ

తే. రమ్యలావణ్యమూర్తికరత్నరాశి, కలఘువిరహాగ్ని శిఖలఁ పైకొలుపకమ్మ
యువిద నీవిట్టు చేసిన నొకటికొకటి, వికటమయ్యెడు ధైర్యంబు విడువకమ్మ. 86

శా. ధీరోదాత్తపు మాటనేర్పరివి బుద్ధిం బెద్ద వత్యంతగం
భీరస్వాంతపు దేవభోగవనితాబృందమ్ములో నెంతయుం
లేరా నాయకురాల వెంచఁదగు నీవెం పన్నిటం బ్రౌఢ వై
యీరీతి న్వగనొంద నీకుఁ దగునా యిందీవరాభాలకా. 87

సీ. చెఱుపుచున్నది జక్కిణీలయల్ వహియలుగా శశిరేఖ నాటకశాలలోనఁ
జూపుచున్నది జోగిణీపంతు రంతుగా రంభ నాట్యగృహాంతరంబునందు

నాడుచున్నది కేళిహాళిఁ గోలాటంబు మంజుఘోషిణి లాస్యమందిరమునఁ
జలుపుచున్నది ప్రౌఢజాడల గౌరవంజియల తిలోత్తమ నృత్యనిలయసీమ
తే. నాటపాటల సభలోన సాటిచెలులు, మించుమెప్పించుకొన నభ్యసించువగలు.
వింటివా తెల్పుచున్నది వెలఁదివిశతి, మర్దళధ్వని తత్తత్క్రమంబు లెల్ల. 88
శా. నీసౌందర్యము నీవయోవిభవముల్ నీనృత్యగీతాదివి
ద్యాసంపత్తియుఁ జూచి యోర్వక యసూయల్ సేయు రంభాదులు
ల్లాసంబందఁగ నేల యిట్లు విరహగ్లానిం గృశింపంగఁ జిం
తాసంతాపము మానవే చెలి మదిన్ ధైర్యంబు గీల్కొల్పవే. 89
వ. అని యివ్విధంబున. 90
క. అనునయ మొనరింపుచు సఖి, యనునయభాషలను జింతయాగక యాచ
క్కనిచెలువ పరితపించుట, కని చెలులు విచారహృత్తఁ గటకటపడుచున్. 91
వ. తమలో నిట్లనిరి. 92
సీ. కొమ్మచేతులు చూచి కుత్తుకబంటితో నున్నదిగాదె పయోజవనము
కిమలాంగిమాటలు విని కండ్లుగొలుకుచు నున్నదిగాదె కీరోత్కరంబు
వనితచూపుదలంచి వైషమ్యగతి నున్నయదిగాదె మదనసాయకసమాజ
మతివయానము గాంచి యక్షియస్థితి నున్న యదిగాదె మతిరాజహంసకులము
తే. చలము సాధించ నిప్పుడే సమయమనుచు, విప్రలంభభరంబున విహ్వలించు
వెలఁదినలయించుచున్నది విషమసంధిఁ, గీడొనర్చుట హీనుల జాడగాదె. 93
ఉ. తాపముచేతఁ జిక్కి వనితామణి జాఱిన చక్కనొత్తఁగా
నోపదు పయ్యెదన్ మగువ లొయ్యన గుబ్బలు గప్పరమ్ము జో
డై పొలుపారు జక్కవలయాకృతి నున్నవి శీతభానుఁ డా
శాపరిపూర్ణచంద్రికమిషంబునఁ జాలవిషంబు గ్రక్కెడున్. 94
ఉ. ఏమి యుపాయమమ్మ యిఁక నిందులకో చెలికత్తెలార కాం
తామణిగాత్రహేమమువిధం బగుఘర్మజలచ్ఛలంబునన్
గాముశరాగ్నికీలలను గ్రాఁగి కరంగి తొరంగెఁ జూడరే
యేమఱనేల చేయఁదగు నీయెడలన్ శిశిరోపచారముల్. 95
వ. అని పలుకుచు. 96
తే. ఉపవనచ్ఛాయ సంతానముకుపు ననెడు, భ్రాంతిఁ బొందింపఁ జెలులనిర్బంధమునను
రమణి నెమ్మది నుత్సాహరహిత యయ్యు, నంచితోద్యానసీమకు నరుగఁదలఁచి. 97

సీ. సఖులమాటలకు వేసట నొందుచును శయ్యపైలేచి యలదుగాఁ బయిటఁజేర్చి
చెదరినకురులొక్కచేఁబట్టి సొగసు చాలని కొప్పు వలసి యొల్లమిని దుఱిమి
బరువంచు ముత్యాలసరములు దిగిచి చెంగట నున్నయింతిదోయిటను వైచి
వలవంచు గిలుకపావా లవ్వలికిఁ ద్రోచి యలంతిపాదుక లంఘ్రులందుఁ దొడిగి
తే. యనుఁగునెచ్చెలి భుజము కరావలంబి, తంబుగా నూఁది కనకసౌధంబు డిగ్గి
యలపుసొలపున నసురుసురనుచు మంద, మందగతి నేగె వనమున కిందువదన. 98

క. ఆరామలతాగృహమున, కారామ లతిప్రయత్నలై యరిగి రొగిం
దా రామలయజగంధిం, దారామలముఖసఖాళిఁ దగఁ దోడ్కొనుచున్. 99

వ. అందు. 100

సీ. రాజీవరాజీవరాజిరాజితములై కెలఁకుల కొలఁకులు దొలఁకుచోట
ఘనసారఘనసారఖను లైనఘనటచ్ఛదచ్ఛటాకదళికాతరుల క్రేవ
సంతానసంతానసంతతాతాంతత శృంగారపాదపశ్రేణినడుమ
మాధుర్యమాధుర్యమధురసఫలగుచ్ఛవల్లులపందిటిచల్లనీడ
తే. శీతకరశీతకరశిలాంచితవితర్ది, సీమ సీమంతవతులు లేఁజిగురుశయ్య
నమర నమరకళావతివిధివసింపఁ, జేసి చేసిరి సముచితశిశిరవిధులు. 101

సీ. క్రొత్తగాఁ గూర్చిన గొజ్జంగివిరిమంచు నీరు నెమ్మేనిపై నించినించి
పరువైన యనఁటికంబముల జాఱినయట్టి చంద్రరజంబు పైఁజల్లిచల్లి
శశికాంతపాత్రల: జలువటారు సుగంధ మవయవంబుల నిండ నలఁదియలఁది
పూఁబేనెవడియు నంబుజనాళహారంబు లురవుగా నురమున నుంచియుంచి
తే. సరసనవ్యలామజ్జక జాలతాళ, వృంతములఁ జల్లగాఁ బ్రావిసరివిసరి
యూర్వశికిఁ బ్రాణసఖులు శైత్యోదయతకుఁ, జేసిరుపచారములు నేర్పు చేతనపుడు.

క. ఏలాలవంగనవసుమ, నోలామజ్జకసుగంధనుతకర్పూర
శ్రీలలితమాధురీజల, మాలేమకుఁ గ్రోలనిచ్చి రతివలు మఱియున్. 103

సీ. కలికిచన్నులమీఁద గర్పూరమిడుచు జంబీరఫలభ్రాంతి బెదరెనొకతె
పికవాణికురుల సంపెఁగదండఁ జుట్టుచుఁ జంచరీకభ్రాంతి జడిసెనొకతె
యింతి కన్నులయందు హిమజలంబునుపుచు వికచాంబుజభ్రాంతి వెఱచెనొకతె
చెలిమోవిమధురాంబువు లొసంగుచును మధుసారపూరభ్రాంతి జంకెనొకతె
తే. యతివ కుపచార మపచారమయ్యె ననుచుఁ, దావ మెచ్చుటకులికి సద్వస్తుఘటన
మానరుచుపేయముల నపమానములుగ, భ్రమసి ముగ్ధసఖుల్ తదంగములయందు.

క. పలుమఱు చల్లనిమందు, ల్చెలిపైఁ జల్లియును లోపలికి నొసఁగియుఁ దా
మలసిరె గాని విలాసిని, యలయికఁ దీర్పంగఁజాలరైరి లతాంగుల్. 105

తే. పూర్ణచంద్రోదయం బన్నఁ బొక్కిపడును, దరుణి కుసుమాకరంబన్నఁ దల్లడిల్లు
భూపతి యశైత్యకారిగాఁ బొగడికొనుచు,వనిత తనుసామ్య మెఱుఁగ నెవ్వరివశంబు·

తే. మాటిమాటికిఁ దొరఁగు చెమ్మటల మేటి, బోటి బిగువాటి చనుఁగవ సూటిదనరె
నీటువాటిల్లు సెలయేటి సీటితోడ, సాటిమీఱు నగద్వయిసాటి యగుచు. 107

ఉ. కప్పురపున్ రజంబునఁ బొగల్ బలియించి సురంటిగాడ్పు చేఁ
బుప్పొడులన్ రవుల్కొలిపి పుష్పతతిం గమలించి గంధపున్
లప్పలు పొంగులెత్తి పొరలం దెరలించి యలంచె నంగజుం
డప్పటి మందులెల్ల విరహాగ్నికి విందులు చేసికోమలిన్. 108

వ. మఱియును. 109

సీ. నిగమఘోటలలాట నేత్రానలజ్వాలఁ గాక దేఱిన కాముకాండములును
రాహుగ్రహోగ్రదంష్ట్రావిషగ్రాహియై కఱకెక్కిన శశాంకకౌముదియును
ఘోరాస్యభుజగభూత్కారాప్తి మెలఁగి నిశ్శంకఁ బైకొనుసమీరాంకురములు
దుస్సహవాసంబుతో గడిదేరిన కలకంఠములకు హుంకారరవము

తే. మచ్చరించినకైవడి మఱియుమఱియు, హృదయసంతాప మొదవింపనిందువదన
యోర్వఁ జాలక వగనొందుచునికిఁ జూచి, చెలులు చింతాసమాక్రాంతచిత్త లగుచు.

తే. కువలయాక్షులు కేతకీకుసుమగర్భ, దళముపై నవ్యహిమజలమిళితమైన
హరిణమదపంకమున వ్రాసిరపుడ లేఖ్య, తనువివేఘ్నప్రసూనేషువినుతలేఖ. 111

చ. వలపలిచేత భూశరము వామకరంబునఁ బచ్చవిల్లు కో
పులను వసంతకైరవవిధుల్ వెనుకన్ మలయానిలుండు ముం
గల వరశారికాశుకపికభ్రమరాళి వెలుంగఁగాఁ జెలుల్
వలపులరాజువైభవము వ్రాసిరి గేదఁగిపువ్వురేకునన్. 112

ఆ. వ్రాసి యెదుటనిలిపి వనితలు దివ్యవస్తువులు దెచ్చి యపుడు షోడశోప
చారములను బూజ సలుపుచు జగదేక, వీరు మారు నిట్లు వేఁడుకొనిరి. 113

సీ. పుట్టినాఁడవుగదా భువనైకసామ్రాజ్యదక్షుతా యాదిమదంపతులకుఁ
బట్టినాఁడవుగదా బ్రహ్మేశ్వరాదుల నైనఁగలంచుబాణాసనంబుఁ
గట్టినాఁడవుగదా కఠినవైరాగ్యసంస్తంభవిద్యకు బిరుదధ్వజంబు
చుట్టినాఁడవుగదా శుభ్రయశోలతాంకురములజాండకోటరమునిండ

తే. వర్ణనీయ మిందీవరవర్ణనీయ, మంబమహిమాతిశయమహీబృందముఖ్య
ముఖ్యులకు నాజవంజవసౌఖ్యదాన, చణవిరంచకృతానుగ్రహాసదన మదన. 114

ఉ. హల్లకపాణి నీశరశరాసనచిహ్నము లక్షులందు భ్రూ
వల్లికలన్ వహించుకొని వర్తిలుచున్ మణితచ్ఛలంబున
న్నెల్లనయోగ్యవేళలను నీతిరుమంత్రముఁ బల్కు మాచెలిం
జల్లనిచూపు చూడు సుమసాయక నిల్పు మతాభిమానమున్. 115

వ. అని ప్రార్థించుచు నించువిలుతునివలన నించుకైన ననుగ్రహంబు లేమి లేమ పరి
తాపాతిశయం బవలోకించి కించిన్మస్యలు వేసటపడుచు నప్పడుచుఁదనంబుల
పెద్ద నుద్దేశించి యి ట్లనిరి. 116

## మన్మథోపాలంభనము.

తే. కుసుమసాయకశృంగారరసశరీర, శాలివగునీకు మనసు పాషాణమయము
సద్గుణములేని దదియేటిచక్కఁదనము, కటాకటా తేనెపూసిన కత్తిగాదె. 117

ఉ. నారఁట తేఁటి జోకనలినారఁట తేరఁట చిల్క సౌరభో
ద్గారఁట విల్లు పూఁతనయగారఁట చుట్టము శైత్యపుక్ సదా
చారఁట కమ్మ గట్టుపరిచారఁట కోయిల కేతసీభవ
ద్వారఁట యిట్టినీ కొదుగువారఁట లోకు లదేమిచిత్రమో. 118

తే. మారణోపాయమర్మకర్మములయందు, నీనృశంసత చూచికా నిర్ణయించె
సార్థకముగాఁగఁ బంకరుహాసనుండు, మకరకేతన నీపేరు మారుఁ డనుచు. 119

క. అసమాశుగ నీచాపము, కుసుమం బని పెద్దలనుట కుత్సితసుమమం
చుసుమీ కాకుండిన నే, కుసుమంబులు నరుల మన్నిగొనునీరీతిన్. 120

క. ఎట్టుజనించితి వకటా, కట్టిఁడి వగునీవు మదన కరుణానిధులై
నట్టి తలిదండ్రులకు సుధ, పుట్టినజలరాశి విషము పుట్టినరీతిన్. 121

సీ. కుటిలోగ్రనిటలదృగ్ఘోరాగ్ని నీకు నిర్బంధపంచత్వంబు ప్రాప్త మగుట
యాకారహీనుఁడవై యుండియుఁను గాలిచందాన లోకసంచారివగుట
వేళఁగాచుకొని యావేశించియింతులఁ బురుషులఁ బీడపాల్పఱుచుచుంట
నీవుసోఁకిన నెంత నీతిశాలికినైనఁ బుణ్యాపాపవివేకబుద్ధి చెడుట
తే. యెంచిచూచిన భూతమ వీవుమదన, సంశయములేదు శివుఁడు మోక్షప్రదాత
యతనిచేఁ ద్రుంగియును ముక్తినందలేక, గ్రహమవైతివి విరహులకర్మవశత. 122

వ. అని మఱియుఁ బెక్కుచందంబులఁ గందర్పు నిందించి యుండిందిరాలక యిందీవర
పాలకుం డగునిందు నుద్దేశించి యి ట్లనియె. 123

## చంద్రోపాలంభనము.

సీ. శ్రీసహజోన్నతిఁ జెలువొందుటయె కాక శ్రీసహజోన్నతిఁ జెలువుఁగంటి
సత్కళానిధివై ప్రశస్తిఁ గాంచుటె గాక సత్కళానిధివై ప్రశస్తిఁ గంటి
కువలయహితవృత్తిఁ గొమరు మీఱుటె గాక కువలయహితవృత్తిఁ గొమరుగంటి
హరిణలక్ష్మఖ్యాతి నందియుండుటె గాక హరిణలక్ష్మఖ్యాతి నంద గంటి
తే. కడిసి విషమాంబకుని కాప్తగరిమఁ గనుటె, గాక విషమాంబకుని కాప్తగరిమఁ గంటి
తనరె నీవింత నీవింతఘనుఁడ వయ్యుఁ, జందమా మాచెలి నలంచఁ జందమామ. 124

తే. అమృతకరుఁ డనుపేరు నీ కాదియంద, హీనుఁడై యొప్పననుచు వాగీశుఁ డనుట
కర్థ మెవ్వరుఁ దెలియలేరైరి కాని, యరయ విరహులపాలిటి కడియనిజము. 125

క. ఇట్టిందురు మట్టిందురు, వెట్టులు నీలోనినలువు విషరాశి సుమా
జుట్టుకొని నిన్ను రాహువు, గట్టున మఱి త్రేన్పుకన్నె కాకున్న శశీ. 126

సీ. తినలేక వెడలఁ గ్రక్కిన రాహు వెఱుఁగు నీయంగంబు విషమాట యమృతమాట
బడలి ఖిన్నతనొందు పద్మిని యెఱుఁగు నీచాయ వేండ్రంబాట చల్లనాట
నిలువున నీటైన నెల తా లెఱుంగు నీకరము నిష్ఠురమాట సరసమాట
కవఁబాసి పొగులు జక్కవపత్తు లెఱుఁగు నీచర్య దారుణమాట సౌమ్యమాట
తే. యాలిఁ గోల్పడ్డనియుపాధ్యాయుఁ డెఱుఁగు, నీవు దుర్నీతి వగుట సునీతి వగుట
యెఱుఁగ రన్యులు నీమర్మ మెఱుఁగకునికి, జనులు నిన్నుఁ గూరగ్రహమనరు చంద్ర.

చ. చతురులమంచుఁ బండితులు సారెకు నీమెయికందుఁ జూచి క
ల్పితవచనంబులన్ మఱుఁగువెట్టి శశంబు మృగంబు లాంఛన
స్థితి యనిపల్కుచుందురు శశీ పటురౌద్రుఁడు వీరభద్రుఁడు
ద్ధతి నినుగుండియల్ కమలఁదన్నినచోట నదేమిపాపమో. 128

తే. కైరవాప్తకళంకంబు పేర విషము, లోనఁ బూర్ణించియుండఁ బైపైనిచంద్రి
కలు వెలింగించెదవు కుత్తుకను విషంబు, నాలుకను బెల్లమును గాదె పాలసునకు. 129

క. తమ్ములు కుముదప్రియ నీ, తమ్ములు నీయనుజనివసితమ్ములు శరజా
తమ్ములు నీయల్లుని కహి, తమ్ములుగాఁ జూడు వనుచితమ్ములు నడకల్. 130

శా. చూడంజాలక మిత్త్రబాంధవులకాజ్ఞోద్దై చనంజేయవో
క్రీడంగూడి మెలంగసత్పరిచరశ్రేణిం బ్రభ ల్గుంచవో
తోడంబుట్టువునింటిపైఁ దెగవా సిగ్ దోషాకరుం డంట కీ
జాడల్ సాక్షులు సేతిపేరపసవో చంద్రాదినామార్థముల్. 131

సీ. గ్రాహాది సత్త్వభీకరమహార్ణవగర్భబాడబజ్వలనసంపర్కవృద్ధి
త్రిజగద్భయంకరోత్కృష్టహాలాహలవిషహుతాశనసహావిర్భవంబు
భావసంభవభంగఫాలభాగాత్యవలాంతికతమవరాంగాశ్రయంబు
పురజయత్తుణరక్షికరణగోష్కరక్షణేశ్వసనాగ్నినైకటచక్రతాప్తి
తే. మొదలుగాఁ గ్రూరసాంగత్యములను బెంపుఁ, గనిన నీకెక్కుడిది మంచితనముచంద్ర
గడుసు వెన్నెలచిచ్చుల నుడుకఁజేసి, కనికరములేక యేఁచెదు కమలముఖుల. 132

తే. అనపరాధ నవధ్య నీయబల నింత, యేఁచెదవు చంద్ర యీయుసురేలపోవు
నష్టకళ మిత్త్రునింట హైన్యమునసుండ, నీకు సంప్రాప్తమగుఁగాక నెలకునెలకు. 133

వ. అని యనేకప్రకారంబుల నిశాకరు నిరాకరించి చంచలాక్షులు దక్షిణదిగాగమన విశేషంబున శైత్యమాంద్యసౌరభ్యంబులం బసమీఱు సమీరు నుపలక్షించి యిట్లనిరి. 134

## మలయానిలోపాలంభనము.

సీ. దండభృత్కింకరోద్దండహుంకరణకోలాహలంబుల లోపలను మెలంగి
యౌర్వసంతప్తయామ్యదిశాసముద్రకల్లోలజాలంబుల నోలలాడి
మలయశైలపటీరనిలయజిహ్మగఘోరవిషవక్త్రబిలముల విహృతిసలిపి
దర్దురప్రముఖపద్ధత్యవ్యటవ్యాశ్రయాశుతోసంబంధ మాచరించి
తే. వచ్చెదవు నీదుదుర్మార్గవర్తనంబు, తెలియ నీయవు బాహ్యశీతలమువలన
వంచకుఁడ వెట్లు నినునమ్మవచ్చు ననిల, యతివినయమెల్ల దూర్తత యనుటనిజము.

చ. సరసులసంగతిన్ మెలఁగు సౌమ్యుఁడనన్ మృదువర్తనంబుచే
వరయ ననుంగుఁజుట్టముక్రియన్ భువి నంతట నల్లిబిల్లివై
తిరుగుదువంచు నిన్ను వలితెమ్మర ప్రాణముగాఁగఁజూచు సుం
దరి నలయించె దిట్లనువుదక్షిణవేళఁ గుమిత్త్రులీదృశుల్. 136

తే. చల్లకాఁకల ననుకూలశాత్త్రవమునఁ, గోరి విరహులప్రాణముల్ గొందు వనిల
నిను జగత్ప్రాణుఁ డనిపల్క మనసుగొల్ప, దంటివేసిఁ బ్రభంజనుఁ డందుమిఁకను.

ఉ. వేసవిమంట లుప్పతిల వీఁచు నినున్ మలయాద్రిగంధపున్
వాసనలన్ సరోవరజవాసనలన్ జిలిపూన భావనల్
చేసెను వేళవెజ్జు భువి జీవులకై యటులయ్యుఁ బోక నీ
దోసము బెట్టుచిచ్చువలెఁ దోఁచు వియోగులకున్ సమీరణా. 138

తే. వాతవిధ్వంసనకరసాఖ్యవటులౌషధంబు నాగేంద్రమనుమంత్రితంబుఁ జేసి
వలదు నీపైఁ బ్రయోగింప మలయపవన, మందుమంత్రంబులనుగాని మట్టుపడవు.

వ. అని యిత్తెఱంగునఁ బవమానునవమానవచనంబులం బోనాడి పాంథశ్రవణబాధా
కరణనిజనినాదకలకలంబు లగుకోకిలంబుల నుద్దేశించి ముద్దియ లిట్లనిరి. 140

## కోకిలాద్యుపాలంభనము.

శా. ఇన్నాళ్లుం గడుటొంగియుండుదురు మాహేమాంగిమాధుర్యసం
పన్నంబైన యెలుంగుసొంపునకు నీపట్లన్ వియోగవ్యథా
ఖిన్నం గర్ణకఠోరనాదముల స్రుక్కింపంగ న్యాయంబె మీ
కెన్నం గోవెలలార సద్విజులకుం విద్రోహముల్ చెల్లునే. 141

శా. ఆహా కోవెల మీకు మాధవుఁడు భాగ్యం బిచ్చుటల్ పాంథపీ
డాహంకారత కాప్రవాళచయముక్తాచంద్రసానల్పలీ
లాహారంబులఁ బూనఁ గొమ్మల మనోల్లాసంబునం జేరఁ గే
శీహన్ మావులఁ జెక్కఁగాక భువి లోకేశుల్ విజాత్యున్నతుల్. 142

వ. అని వనప్రియంబుల నప్రియంబులు పలికి చెలికత్తియలు పలుకుములుకులంగలి
కిపీనుల కులుకుపుట్టించు చిలుకలం గనుంగొని. 143

చ. కర మనురక్తిఁ గొమ్మకరకంజమునం దిడి మీకుఁ బాలుఁ జ
క్కెరలును బెట్టి పెంచి పలికింపుచు మాటలు నేర్పినందుకా
విరసపుఁ గూఁతలన్ మిగుల వేదనఁ గొల్పెద రింతి కియ్యెడన్
గురువుకు బొమ్మవెట్టితిరి క్రూరవిచారమ కీరవారమా. 144

ఆ. రక్తముఖులు కావరపువిజాతులు కుజా, త్యాశ్రయములు మీర లగుటఁ జపల
వృత్తి నోటఁగాయవేయక వదరుచుఁ, గలఁచెదరు లతాంగిఁ జిలుకలార. 145

వ. అని యిట్లు కీరంబులం దూఱఁబలికి యళినికరంబులం జూచి యిట్లనిరి. 146

చ. నిలిచినచోట నిల్వక వనిం జలచిత్తముతో భ్రమింపుచుం
జెలఁగి యెలుంగుచేఁ జెవులు చిందఱవందఱనొందఁగూయుచున్

మలినశరీరులై మిగుల మత్తతనుండఁగఁ జేఁటులార పె
ద్దలు మధుపంబు లుండరుగదా మిము దుర్గుణమిట్టిదే కదా. 147

క. రణసీమ నెట్లు నిలుతురో, గణుతింపఁగఁ జేఁటులార కామునివింటన్
క్షణచిత్తులు మీరతఁడే, గుణము విచారించి మిమ్ము గుణముం జేసెన్. 148

క. అలికుంతల మీనామము, వెలయం దలమోచి యున్నవిశ్వాస మయో
తలపున నుంచక పలుకూఁ, తలచే నీగతి నలంచఁదగునే తరుణిన్. 149

వ. అని యివ్విధంబున. 150

తే. ఇందుముఖు లిందుకందర్పమందగంధ, వాహశుకపికభృంగసందోహముఖ్య
శత్రుపక్షంబు నిందించి సకియభయము, దీఱ నూఱడఁబల్కె నుదారఫణితి. 151

## ఊర్వశిని సఖు లూఱడించుట.

సీ. సంపెంగకైదువ సవరించుమరునితో హర్షించ నేర్చునే యళికులంబు
రామనామోక్తిచే రంజిల్లుచిలుకలఁ గూడివర్తించునే కోకిలములు
హరుని నెమ్మేనఁ బాయక యున్నకుముదాప్తు నాప్తుఁగాఁ జూచునే యసమబాణుఁ
డాదిత్యబింబోదయముగోరుతమ్ముల హితులుగాఁ దలఁచునే హిమకరుండు

తే. వారివారికి నన్యోన్యవైరవృత్తి, గలుగుటకు నిట్లు హేతువుల్ గలుగుటెల్ల
శత్రుపక్షంబునకు నపజయకరంబు, గాన నీకేల వెఱపింపఁ గమలనయన. 152

ఆ. కాముఁ డనఁగ నెంత గండుఁగోయిల యెంత, సోముఁ డెంతగాలి నేమ మెంత
భీము రాము గాముఁ బాముఁబ్రార్థించిన, భామ వారిగర్వభంగ మగును. 153

వ. అని యివ్విధంబున నాజవ్వని నూఱడింపుచుండి రయ్యవసరంబున. 154

సీ. బదరికావనభూమిఁ బరమాత్ముఁడైన నారాయణదేవుని నాశ్రయించి
వర్తించుఁ ద్రైలోక్యవర్తి నామమున నొక్కశుకోత్తమంబు త్రికాలవేది
సత్యలోకంబున శారదారమణి ముంజేతిపైనుండు రాచిలుకతోడి
బాంధవంబునఁ జేసి పడఁతియుఁ దాను దత్సందర్శనార్థంబు చనుచునుండి

తే. యమరపురిమీఁదుగాఁ బోవునపుడు నయన, గోచరం బగునూర్వశీకోమలాంగి
తోఁటసౌకర్యమునకు సంతోషమంది, యింతతడవిందు నిలుతమే యింతియనుచు 155

ఉ. పల్లవపుష్పగుచ్ఛఫలబంధురమైనరసాలశాఖపైఁ
జల్లదనంపుసొంపువెదచల్లెడు కొమ్మకుఁగొమ్మతోడఁదా
నల్లనఁజేరి నిల్చి తదుపాంతసరోవనశీతవాతపో
తోల్లసనార్తికై యెఱక లొయ్యన విచ్చుచు సొక్కి మెచ్చుచున్. 156

చ. అలయికదీఱ జాతసుఖుఁడై నిజచంచుపుటాంచలాహతిన్
గళితములైన పక్వసహకారఫలంబులమాధురీరసం
బెలమి భుజించి తాను దనయింతియుఁ దృప్తివహించి యచ్చటం
గలుగువినోదముల్ మఱియుఁ గన్గొనుచున్ విహరించియొక్కచోన్. 157

ఉ. వాడినమోముతోఁ జెమటవానలఁదోఁగిన చన్నుదోయితో
వీడినకొప్పుతోఁ బొడము వెచ్చని యూర్పులతోఁ గరాబ్జముం
గూడినచెక్కుతో వగలఁగూరెడుచిత్తముతో మరుండు వే
టాడఁగఁ జిక్కువడ్డమృగియై బెగడొందుచు నున్నయూర్వశిన్. 158

తే. సఖులు గావించునుచితోపచారములకుఁ, జెలులు ధైర్యంబు దెలిపెడుపలుకులకును
మనసుగొలుపక హా దైవమా యటంచు, విసువుగొనుచున్న యవ్వెలవెలఁదిఁ జూచి.

వ. కటకటంబడుచు శుకాంగన మనోహరున కిట్లనియె. 160

ఉ. అక్కట యీలతాంగి సకలావయవంబులుచూడ నెంతయున్
జిక్కఁదనంబు లొచ్చెమగుచంద మొకించుకయైన లేదు ముం
దెక్కడఁజూడలేదు నిజ మిట్టివిలాసిని నేమికారణం
బొక్కొ మనోవ్యథం బొరలుచున్నది చూచితె ప్రాణనాయకా. 161

తే. నాథ యీయింతిఁజూచిన నామనంబు, జాలిగొనియెడు మీపదాబ్జంబులాన
వినఁదగుదునేని తెల్పుఁడువిశ్వమునను, మీరెఱుంగనికార్య మేమియును లేదు.

## త్రైలోకవర్తి యనుచిలుక తనచెలికి నూర్వశివృత్తాంతముఁ దెల్పుట.

క. అని పలికిన ప్రియురాలిం, గనుఁగవ నుల్లాసరసవికాస మెసంగం
గనుగొని యిట్లనిపలికెన్, వినుమనిమాధుర్యరచనవిలసన్ముఖుఁడై. 163

సీ. పరమపావనమైన బదరికావనమున నిశ్చలంబుగఁ దపోనిష్ఠనలుపు
చున్న నారాయణయోగీంద్రు నియతి విఘ్నము సేయ గీర్వాణనాథుఁడంప
నమరాంగనలు వచ్చి హావభావవిలాసములు చూపుచును దనమ్రోల మెలఁగఁ
గాంచి నవ్వుచు నఖాగ్రంబులఁ దనతొడ చీఱి యం దభినవశ్రీయుతాంగి

తే. నివ్వరారోహఁ గల్పించి యవ్వినోద, మునకు లజ్జాభయంబుల మునుఁగుచున్న
యచ్చరలఁజూచి మీచేష్ట లతివలార, యిచట నేమగు మఱలిపొం డింద్రుకడకు.

క. అని తనయూరువున జనిం, చినదగుటన్ దరుణికూర్వశినామముఁ దా
నొనరించి ముఖ్యురాలగు, ననిమిషసఖులార మీకు ననుచునొసంగెన్. 165

క. ఆకొమ్మఁ దమకుఁ బెద్దగ, గైకొని యేతెంచి రమరకాంతలు దివికిన్
లోకస్తుతసుందరియై, నాకంబునఁ బెంపుగనియె నాటంగోలెన్. 166

మ. ఇది యాయూర్వశి ప్రాక్ప్రవృత్త మిపుడీ హేమాంగి గంధర్వతా
పదశం బెందెఁ బురూరవున్ దలఁచి తత్ప్రస్తావముల్ చాలనా
రదుచే విన్నదియై యెఱుంగుదువె యారాజేంద్రునిం జూతుమే
కద నారాయణసేవకై యతఁడు రాఁగా నవ్వనిన్ జవ్వనీ. 167

వ. అనిపలుకుచున్న జీవితేశ్వరువచనంబు లాలించి యించుకతఁడు తూష్ణీకత్వంబున విచారించి శిరఃకంపంబుసేయుచుఁ గీరభామిని యిట్లనియె. 168

క. అగునగు నెఱుఁగుదుఁ బ్రియకర, మగుమగువల కతనియంద మకలంకశశి
న్నగునగుమొగమింతికిఁ, దగు నగు నిద్దఱకుఁ జెలిమి తమిఁ గ్రీడింపన్. 169

మ. అను నీముచ్చట ప్రస్ఫుటాక్షరవచోవ్యాహారమై కర్ణరం
జన గైర్వాణసుశబ్దమై వినఁబడం జంద్రాస్య లాశ్చర్యశో
లనలోలద్వికచాంబికప్రభలలీలాచంద్రికల్ చల్లఁగ
న్గొని రాసన్నరసాలశాఖ నలరుం గొమ్మన్ శుకద్వంద్వమున్. 170

ఉ. కీరములన్ మనోజ్ఞరుచిఖేలన వర్ణవిశేషశోభితా
కారములన్ నవారుణముఖప్రథితాత్మగతానురాగవి
స్తారములన్ జనశ్రుతిరసాయనమంజులవాక్కథాసుధా
పూరములన్ గనుంగొని రపూర్వముదంబున నూర్వశీసఖుల్. 171

వ. ఇవ్విధంబున. 172

మ. మణిమంజీరఝుళంఝుళన్నినదసంపన్నాంఘ్రివిన్యాసవా
రణకుంభప్రతిమానపీనకుచభారప్రోచ్చలన్మధ్యలై
గణికల్ తత్సహకారముం గదిసి శోభాచంక్రమాక్షిద్వయీ
ఘృణు లుడ్డీనచకోరికాచయజయశ్రీ నొంద వీక్షింపుచున్. 173

వ. నిలిచి తత్తేజోవిశేషంబున కద్భుతం బందుచుం బ్రార్థనావచనపూర్వకప్రాంజలులై కీరోత్తముం గనుంగొని. 174

ఉ. కన్నుల పండువయ్యె నినుఁ గన్నఁ జెవుల్ కడుచల్లనయ్యె నీ
విన్నను వొందు నీపలుకు విన్నను నీకరుణార్ద్రదృష్టిపై
కొన్న వసంతలక్ష్మి నెలకొన్న లతావళు లయ్యె మేనులో
యన్న శుకప్రకాండ విను మన్నిటఁ బుణ్యశరీరి వెన్నఁగన్. 175

ఉ. కేళికినై శుకాకృతు లొగిన్ ధరియించి మెలంగునాజగ
న్మూలనిదానదంపతుల మువ్వురిలోపల నొక్కరో దయా
శీలత మన్మనోరథము చేకుఱ నొసంగఁగ వచ్చినట్టి మా
పాలిటిభాగ్యదేవతలొ పల్కుఁడు వరుస్ భవదీయవృత్తమున్. 176

వ. అని వినయభాషణంబులు పలుకుచున్న యన్నులు నవలోకించి కించిత్ప్రసారిత
నిజకటాక్షవీక్షణం బగుచుఁ బక్షివరుఁ డిట్లనియె. 177

సీ. మానివాసము ముక్తిమానివాసం బైనబదరికావనసీమ భామలార
మామైత్రి యలకరామామైత్రిఁ గేరైన శుకతల్లజముతోడ సుదతులార
మాయింపు ఖేదముల్ మాయింప భగవత్కథాప్రసంగంబులు తరుణులార
మానేత్రములకును మానేత్రజాదిలోకములు దృశ్యంబులు కాంతలార

తే. మానిజగతి దుస్సంగతి మాని జగతి, సత్ప్రచారతనుండుట సకియలార
మాహితప్రోక్తి వినుఁడు నమాహితమున, మీకు శుభవార్త పఱచెద మెలఁతలార.

ఉ. ఊర్వశి పాకశాసనునియోగమునన్ భువికేగు నచ్చటన్
సర్వగుణాభిరాము నృపచంద్రు బురూరవుఁ గాంచు నాతఁ డీ
పర్వశశాంకబింబముఖిపైఁ గడుఁ గూర్మి వహించు మామకా
శీర్వచనంబు సిద్ధముగఁ జేకుఱు నిద్దఱకున్ సరాగముల్. 179

ఉ. చంద్రనిభాస్య కానృపతిచంద్రునితో సతమైనకూటమిం
జంద్రునియందు లీయమగు చంద్రికయుం బలెనుండఁ గల్గెడుం
జంద్రవిలాసమూర్తు లగుచక్కనిపుత్రులఁ గాంచు భూమిలోఁ
జంద్రకులంబు వర్ధిలు నిజంబుగ నూర్వశికారణంబునన్. 180

వ. అచిరకాలంబున నీమనోరథంబు సాఫల్యం బగునని యూర్వశినుద్దేశించి యిట్లనియె.

శా. మానారాయణమూర్తియూరువున జన్మంబందుటం జేసి నీ
పై నెయ్యంబున నింతయుం దెలిపితిన్ భాగ్యంబుచే నీకు నా
భూనాథాగ్రణి మేలువాఁడగును నీపుణ్యంబు లీడేఱు బా
లా నిశ్చింతతనుండు మింక వగపేలా నీకు మేలయ్యెడున్. 182

క. అనిపలికి తాను ప్రేయసి,యును నవ్వలనరుగఁ దగుప్రయోజనముముదం
బునఁ దెలిపి పోయివచ్చెద, మనిచెప్పి సముద్గమించె నంబరవీథిన్. 183

తే. ఉభయపక్షప్రకాశత నొప్పుచక్ర, విభ్రమణలీల లెసఁగించు విమలజాడ్య
కరగతి నయంబు దనర శుకప్రకాండ, మవగుణములేని శశియన నరిగె దివిని. 184

తే. చిలుకమిథునంబు వెంట నాశ్రలులచూపు, లపు డదృశ్యావధికముగ నరిగి తిరిగె
సాధు లగుబంధువుల వదృష్ట సాగనంపి, వచ్చు టుచితంబుగద గుణవంతులకును. 185

క. చిలుక సుధారసధారలు, చిలుక వచించిన హితోక్తి చెవిఁజేర్చుటచే
వెలవెల దొలంగి వేలుపు, వెలవెలఁదికి మోముదమ్మి వికసిత మయ్యెన్. 186

వ. అప్పుడు. 187

సీ. తడిగట్టినట్లుచందనకర్దమంబు వాడినతనూలతమీఁద నెనయ నలఁది
యరుణోదయముగాఁగ నబ్జరాగపుతాళి సొలసినకుచకోకములను జేర్చి
మకరంద మొలుకు కమ్మనిపూలు చెదరిన కొప్పు తుమ్మెదగుంపుఁగూర్చిచుట్టి
చీఁకటి కప్పుగాఁ జెలఁగు కాటుక కాంతనయనోత్పలముల నందముగఁదీర్చి

తే. విరహవేదన బడలిన వెలఁదియంగ, కముల కుపచార మదియె శృంగార మదియె
తానొనర్చిరి తెలిసి యేకక్రియాప్తి, నావయస్యలనేర్పు నేమనఁగవచ్చు. 188

క. అంగీకృతకాలోచిత, శృంగారవిలాసయగుచుఁ జెలికత్తెలతో
రంగగు నిజమందిరమున, కంగన యేతెంచెఁ గోర్కు లతిశయమందన్. 189

ఉ. ఇంద్రుఁ డనుజ్ఞ యిచ్చుపనియెయ్యదిగల్గునొ భూమికేగ రా
జేంద్రునిదర్శనంబు ఘటియించుట యెట్లొకొ వాఁడు మన్నన
స్సాంద్రతరానురక్తికి వశంగతుఁడౌట కుపాయమేమొ ని
స్తంద్రతఁ జిల్కపల్కులు నిజంబగునో యది గాక తప్పునో. 190

వ. అని విచారింపుచు. 191

సీ. అభిలాష మీడేఱు ననుచు నమ్మికగాఁగ నాడినచిలుకవాక్యములవలనఁ
దఱుచైన కలలోని దర్శన స్పర్శన సంజల్పసంయోగసరణివలన
నతనిము న్గనుఁగొన్న యమరశిల్పకులు వ్రాసినపటం బెద నుంచుకొనుటవలనఁ
దలఁచి కావించునోములసమాప్తిని, బుణ్యావతులు దీవించుదీవనలవలన

తే. వామలోచన యాత్మీయవామలోచ, నం బదరు టాదిగా శకునములవలనఁ
దెచ్చుకోలుదిటంబున దినములొక్కఁ, గతిఁ గడుపుచుండె మనసు తద్గతము చేసి. 192

క. భువిఁ బుణ్యము లొనరింతురు, దివిభోగము లందుకొఱకుఁ దిరముగ వ్రతముల్
దివిమండి చేసె నూర్వశి, భువిభోగముకొఱకు నిది యపూర్వము గాదే. 193

వ. అనిపలికినం బరమహర్షసమన్వితులై మహర్షు లవ్వలివృత్తాంతంబు దేటపఱు
పుమని యడుగుటయును. 194

శా. కద్రూసంభవదర్పభంజనమహాగాంధర్వ గాంధర్వసం
పద్ద్రాఘిష్ఠకవంశరావలహరీమాధుర్య మాధుర్యయో
షిద్దృక్చారుచకోరికాప్రియముఖశ్రీరాజ శ్రీరాజమా
నద్రుస్ఫారతటార్కజావిహరణానందాత్మ నందాత్మజా. 195

క. పింఛాలలంకృతకచతా, పింఛాంచితనీలవర్ణబృందావనభూ
లాంఛితపదఘోషవధూ, వాంఛితపదమార్గ్యజగదవనవైదగ్ధ్యా. 196

కవిరాజవిరాజితము:—

చరణరణన్మణినూపురదీధితిసంవృతకాళియభోగిఫణా
ఖురజరజఃపటలావృతదిక్తటఘోటనిశాటవిభంగరణా
విరహరహస్సమయాగతయోషసువృత్తకటీసహవిభ్రమణా
పరమరమాంగలతాశ్రయవిగ్రహభద్రతమాలతరుస్ఫురణా. 197

గద్య. ఇది శ్రీమంగళాచలనృసింహకృపాప్రసాదసంప్రాప్త విద్యావైభవ కనుపర్తి
రాయనమంత్రితనూభవసుజనహితకృత్యనిత్య అబ్బయామాత్యప్రణీతం బైనకవిరాజ
మనోరంజనం బనుమహాప్రబంధంబునందు దృతీయాశ్వాసము. 198



# చతుర్థాశ్వాసము.



మత్స్యాంకావనధా
త్రీమండలభాగధేయసృష్టాంతజగ
త్క్షేమంకరచరణాంబుజ
కోమలవిన్యాసరాజగోపవిలాసా ! 1

వ. అవధరింపుము సమస్తసద్గుణసాంద్రులగు శౌనకాదిమునీంద్రులకు సామోదహృదయజలజాతుండై సూతుం డిట్లనియె నాసమయంబున. 2

క. మిత్రావరుణమునీంద్రులు, ధాత్రీస్థలి నంబురాశితటవనపుణ్య
క్షేత్రమునందుఁ దమోను, న్నేత్రు హరుగుఱించి తపము నిష్ఠసలుపుచున్. 3

సీ. ఆవిప్రవరులు కాయలుఁబండ్లు నాహారములుగాఁగఁ జేసి యాకలి యణంచి
యాబాడబులు దార్ఢ్య మతిశయిల్లఁగ మహాంభోమధ్యసీమలఁ బూనినిలిచి
యాద్విజవల్లభు లాత్మప్రకాశత చేఁ దమోగుణము నిర్జితముచేసి
యాకమలజకులఖ్యాతులుద్దీప్తచండాంశుబింబాభిముఖ్యము వహించి
తే. యమ్మహాగోత్రు లనిలశీతాతపాది, కములఁ దలఁకక నిశ్చలత్వమున నుండి
యవ్విబుధవర్యు లనిమిషంబైన దృష్టి, చేతసుమనస్కు లగుచుఁ జేసిరి తపంబు. 4

తే. అలఘువాగ్వైభవమున శేషాహిమూర్తు, లనుట కది వన్నె వెట్టిన యట్లుగాఁగ
నమ్మహాత్ములు మారుతాహారు లైరి, నిశ్చలం బైన తత్తపోనియతియందు. 5

వ. మఱియు నమ్మహర్షిపుంగవు లహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యదయార్జవక్షమాధృతిమితాహారశుచిత్వంబు లనుదశగుణంబుల నొప్పుయమంబున నిర్మలులయి తపస్సంతోషాస్తిక్యదానేశ్వర పూజావేదాంతశ్రవణ మతిలజ్జాజపవ్రతంబులను దశగుణంబులం గలుగు నియమంబునఁ గృతకృత్యులయి స్వస్తికాసన గోముఖాసన పద్మాసన వీరాసన సింహాసన మయూరాసన కుక్కుటాసన సిద్ధాసనాది సంజ్ఞలం గల నానావిధాసనంబుల నభ్యాసికులయి యిడానాడిం బవనం బత్యంతమందగతిం బూరకంబుచేసి కుంభకంబున నిలిపి జాలంధరోడ్డియాణమూల

బంధత్రయాభ్యాసపరిపాకంబున రేచకపూరకంబులు విసర్జితంబులయి శబ్దాదివిషయంబులు నివర్తింప నున్నిద్రితమైన కుండలిశక్తియందు ప్రత్యఙ్ముఖం బయినపవనంబు ప్రవేశించి సమాగమమోచనంబు నొందుచు నత్యుత్తమాంగస్థలంబున నతిరహస్యం బయినశృంగాటకకోటరంబున నమ్మారుతంబు మనస్సమేతంబయి నిలిచి యటమీఁదం ద్రికత్రాకారంబయిన సుషుమ్నామార్గంబునందు మందగమనంబున నడువఁ గుంభకనిష్ఠులయి యోగానలంబునం గరంగు సుధాస్థానస్రావకరసంబున నాప్యాయితశరీరు లగుచు నెట్టకేలకు నొయ్యనం బింగళానాడి రేచకంబు సేయుంచు నేవంవిధంబయిన ప్రాణాయామంబున సిద్ధులయి యష్టాదశస్థానపవనధృతంబును యోగకాలంబున మానసికంబుగ నిత్యకర్మంబులు నడుపుటయును బాహ్యదృశ్యంబులయందు నాత్మలక్ష్యంబుగఁ జూచుటయు నాదియగు చిహ్నంబులు గల ప్రత్యాహారంబునం బ్రవీణులయి జానుజంఘకటిబాహుశిరస్సులను పంచమండలంబులం బంచభూతంబుల నిలిపి యందు విఘ్నేశరుద్రమహేశబ్రహ్మవిష్ణువుల ధ్యానంబు సేయుచు ధారణనిష్ఠ ననుష్ఠాతలయి యాధారాదిషట్చక్రంబుల సగుణవిచారంబును హృత్కమలాంతర్జ్యోతియందు చిత్తంబు లీనంబగుటయు భ్రూమధ్యచిత్కళాచింతనంబు నాదియగుధ్యానంబున నిరూఢులయి యద్వితీయంబయి సర్వపరిపూర్ణంబైన బ్రహ్మంబు తానయి యుండుసమాధియందుఁ బరమానందు లయి పరమశివోపాసనఁ జేయుచుండి రయ్యెడ. 6

## గ్రీష్మఋతువర్ణనము.

మ. జగతిం దోఁచె నిదాఘ మంతఁ బ్రతిభాశ్లాఘ్యంబు సాంద్రీభవ
న్మృగతృష్ణాకృతకప్రవాహసలిలోర్మిస్వీకృతోదాఖిలా
షగతస్వాంతచరిష్ణు జంతునిచయాశామోఘ మభ్యర్చితా
ధ్వగపూర్వాఘము తిగ్మతోగ్రతపనద్రాఘిష్ఠఘృణ్యోఘమై. 7

సీ. విసరెఁ బశ్చిమదిశావిర్భూతవాతంబు హోరనివడ నిప్పు లుప్పతిలఁగఁ
గాఁచె నెండలు మహోగ్రంబులై దిశల నుర్వీస్థలి పెటపెట వేఁగుచుండ
నేర్చెఁ గార్చిచ్చు లుగ్రార్చిస్ఫుటంబులై యటవులఁ జిటచిటార్భటి నటింప
నెగసె గుప్పున సెగల్ నగకూటముల నినోష్ణవితప్తరవికాంతజంబు లగుచుఁ

తే. బొదవెఁ బెంధూళి శర్వరీభూతవితత, శక్తిసంస్తంభనక్రియోద్యుక్తసమయ
మంత్రసిద్ధవిసృష్టభస్మం బనంగ, సకలజనభీష్మమైన గ్రీష్మంబునందు. 8

చ. ఉడుగనిబాడబాగ్ని సెగ కోర్చియు నోర్వఁగలేక వేసవిన్
జడమయుఁ డయ్యు నయ్యపరసాగరుఁ డున్నన నూర్పు వేఁడిమిం
బడమటిగాడ్పు లుప్పతిలెఁ బారముగాక నిదాఘవేళలం
గడు సెగచేత మేహమయగాత్రజలుల్ తపియింపకుందురే. 9

క. వడగాడ్పు లెదుర్కొనఁగాఁ, బడమటికై యరుగుకమలబంధునివాజుల్
సుడివడిపడిసెడి వెడవెడ, నడచెననం బడవుగాఁగ నడచె నహంబుల్. 10

ఉ. సన్నము లయ్యె రాత్రులు ప్రసన్నములయ్యెను మల్లెగుంపు లా
సన్నములయ్యె జాజులు విషణ్ణములయ్యెను బొందువేళ లు
త్పన్నములయ్యెఁ గాడ్పులు విపన్నములయ్యెను జంతువుల్ సుసం
పన్నము లయ్యె నెండ లతిపన్నవసంతదినాంతరంబులన్. 11

సీ. శ్రీదేవి భూదేవి చెలఁగియొకచరణంబు నూరుదేశంబుల నుంచి యొత్త
సమయోచితంబుగా సరసంపుజోలలు దివ్యాంగనలు నిగ్గుదేరఁబాడ
సనకాదు లుపనిషత్సారసంస్తవకదంబోక్తై చర్చినదపాఠముజ్జగింప
సద్దుసద్దనుచు విష్వక్సేనుఁ డింద్రముఖ్యులను జేసన్న నవ్వలికినుప
తే. నమృతసాగరమధ్యశేషాహితల్ప, భాగమున సౌఖ్యనిరతిచేఁ బవ్వళించి
నిదురతమిఁ గన్నులరమోడ్చి నెఱిమొగిడ్చె విష్ణుమూర్తి తదాషాఢవేళయందు. 12

సీ. వాసితోశీరసంవాసితోదారసుధారసశైత్యాంబుపూరములను
వరదంతశఠఫలస్ఫురదంతరుద్భూతరసనిశ్వమిళితగోరసచయంబు
వేల్లదేలాచూర్ణతల్లజైకస్వాదుసంపన్నశర్కరసలిలములును
గలితకుస్తుంబరలలితజీరణముఖ్యసౌవీరతప్తపిష్టద్రవంబు
తే. మొదలుగాఁ గలపానీయములను బథిక, వితతికి నిదాఘశాంతిగావింపఁ బథము
లందుఁ జలిపందిరులు వెట్టి రడుగడుగున, జగతిఁబుణ్యాత్ము లాగ్రీష్మసమయమునను.

ఉ. మోహాకరస్తనోచ్ఛలనముల్ గనిపింపఁగ వేసవిం బ్రపా
గేహవిలాసినుల్ పసిఁడిగిండ్ల జలంబులు దేరఁ బాంథు లో
హోహొ లసత్పయోధరము లున్నతపుంగలశంబులం గభూ
దాహముఁ దీర్చుకొందుము గదా దయచేసిన నంద్రు నవ్వుచున్. 14

సీ. సరసపద్మాకరజలకేళులనుఁ బూటచలువలై తగుసన్నవలపములను
గులుకుపన్నీటఁ జొబ్బిలు సుగంధంబుల నమృణాళతాళవృంతానిలముల

పృథ్వీ. తళత్తళలసచ్ఛవిం దనరె ఘాటవిద్యుల్లతల్
పెళత్పెళమిళద్ధ్వనిం జెలఁగెఁ బేర్చి గర్జార్భటుల్
ఝుళంఝుళ గళజ్జలోద్ధతి నెసంగె నంభోదముల్
ఘుళంఘుళ విశృంఖలప్రగతిఁ గాంచి మించెన్నదుల్. 25

సీ. నీరాళ్ళఁ గొంది శంపారుచుల్ గనిపించె నభ్ర మభ్రమునిండ నాక్రమించె
వృష్టికుంభద్రోణవిస్ఫూర్తి వర్షించెఁ జాతకంబులు మింట సంభ్రమించె
నదులు కూలంకషోన్నతములై ప్రవహించె హాలికోద్యోగంబు లగ్గలించె
జాజితోఁటలు పుష్పసౌభాగ్యత వహించె జలజప్రకాశత సన్నగించె

తే. జనము మోదించె శాద్వలచ్ఛాయమించె, నీప మిగిరించె మల్లెమేల్నిర్గమించె
నెమలి నర్తించె భేకనాదము రహించె, భువిఁ దొలకరించె వానకందువ ఘటించె. 26

మ. జలసంజాతభవాండమండపగతక్ష్మాచక్రసింహాసన
స్థలధాత్రీధరశంభులింగములకున్ శంపాలతాదీపికల్
వెలుఁగన్ గర్జితమంత్రసూక్తులను ప్రావృట్కాలశైవుం డొన
ర్చెలసన్మేఘఘటాంబుధారల నవిచ్ఛిన్నాభిషేకక్రియల్. 27

మ. శరచాపోన్నతి సంస్కృతాంబరమణిచ్ఛాయాప్రకాశంబునన్
హరిసారంగచయప్రచారవిదితఖ్యాతిన్ మహాసారసు
స్థిరతన్ శంబరభంగరమ్యతనుభాతిన్ మీఱుసారస్వత
స్ఫురణంగాంచెను సార్వభౌమవిభవంబున్ వానకాలంబిలన్. 28

ఉ. వెచ్చనితీర్థమాడి నులివెచ్చపదార్థము లారగించి బ
ల్పచ్చడముల్ ముసుంగులిడి పైఁజలిసోఁకని కమ్మటిండ్లలో
ముచ్చముడింగి యింటిపని ముమ్మరమెల్లను దీర్చి ప్రక్కకున్
వచ్చినప్రోడయాండ్ర కురువంపుఁడు బల్చనుకొండలూన లో
మ్మిచ్చి కవుంగలించి సుఖియించిరి ప్రోషగృహస్థులజ్జడిన్. 29

సీ. పురుషుఁ డుత్పలపత్రములు పేఱుందున నుంచ నవని లాంగలరేఖ లమరెననుచు
ధవుఁడు మైపూఁత చన్గవనంట నెదనొక్క మెలఁగి కొండలమొగిల్మెసెననుచుఁ
జెలువుం డుదుసీమ తళుకుఁ జూపులఁ జూడ మిన్నులు తళతళ మెఱసెననుచు
విభుఁడు మర్మములంటి వెసఁగళల్ దొరగింపఁ బద్మాకరము నిండి పాఱెననుచు

తే. సరసు లొనరించు నర్మచేష్టలకు సొగసి, కలికిప్రౌఢ లభిప్రాయగర్భితముగఁ
బలుకుచుందురు వర్తమానముల్ దెలుపుకరణి, గగనగృహముల నన్వానకాలమునను. 30

చ. భయమమతులై హఠాద్గుభగుభద్రటమత్కటదుగ్ధితాక్షపిం
బ్రియవనితల్ చనుంగవలు బిట్టపడం బఱతెంచి కౌఁగిటన్
రయమునఁ జేర్చఁ దద్విభులు రంజిల నొయ్యెద మేదలందు నిం
తయి యలరించు నెవ్వరికి యత్నముసేయక వచ్చులాభముల్. 31

క. ఆవానకాలమున మి, న్నావరణముసేంద్ర లక్షకశరదీప్తమొనుం
గావించి రుద్రశకము ఘ, నావహమై త్రిభువనముల నట్టిట్టుచేయన్. 32

సీ. తతజటామండలాంతస్స్రవనిందుచో భాగీరథీజాటుఁ బ్రమదనాభుఁ
గండభాగంబులఁ గాల్వలై పాఱుచో దానధారాకటోత్కటగజాస్యు
దివ్యవిగ్రహముల దిగఁజాఱుచోట నిర్ఝరమహాదైన గోత్రాధరంబుఁ
జరణాంబుజంబులఁ బొరయుచో వియదాపగాప్రసూనుఁ ద్రివిక్రమసమాఖ్యుఁ
తే. బోల్పఁ దగి నమ్మహాముసల్ ఘోరజలద, ఘనవినిర్గళద్ధారాళబహుళవృష్టి
జలముచేతఁ దద్వ్యాప్తి కసమయమునను, వారినుహిమాతికయ మనిర్వాచ్యమరయ. 33

ఉ. గండములాని పార్శ్వములఁ గ్రమ్మి నితంబము లాఁగి పాదము
ల్నిండి ఝరీచయంబు లవనీధరసీమలఁ బాఱుకైవడిన్
గండము లాని పార్శ్వములఁ గ్రమ్మి నితంబములాఁగి పాదముల్
నిండి యొసంగె వర్షభవనీరము మానులపైఁ బ్రవాహమై. 34

శా. ఈచందంబున నమ్మహామునివరుల్ హృత్పద్మకోశాంతర
ద్యోచక్రోజ్జ్వలలింగశాంభవమహాజ్యోతిం బ్రపూర్ణంబుగా
లో చూపం దెలివిన్ సమస్తమును నాలోకించుటల్ సిద్ధవ
త్ప్రాచుర్యం బయినట్లు వేఁగునఁ దలింపం జొచ్చె విశ్వంబొగిన్. 35

తే. జగతి ఘటచక్రసామ్యమై జగతి యయ్యె, నగములుపవచ్చిలాభగ్ననగములయ్యె
వనధులకలంకరూపజీవనధులయ్యె, లోకములకాతపముదురాలోకమయ్యె. 36

క. అట్టిమహోపద్రవమున, నట్టిట్టై కలఁగె జగము హరిహయుని మదిం
బట్టెఁ దనయాధిపత్యం, బెట్టగునో యనువిచారమెంతయుభరమై. 37

క. ఏపగిదినైనవిఘ్నం, బాపాదింపంగవలయునత్యుగ్రకరం
బీపరమమునులతపమని, యాపురుహూతుండు మిగులనాత్మేరమునన్. 38

వ. ఇట్లని తలంచె. 39

మ. అతిసౌదర్యము నాటపాటవగ యొయ్యారంబు వాక్ప్రౌఢియుఁ గ్
రతిఁ జౌవష్టికళల్ ఘటించిమనసుల్ రంజిల్లఁగాఁజేయు ప్రౌ

ఫలము గల్గినయింతి వాసికి నిష్ఠల్ వీడి మోహింతుర
య్యతిముఖ్యుల్ సెగపొంత వెన్న పురుషుండా పో వధూచేష్టకున్. 40

## ఋషుల తపోవిఘ్నమునకై యింద్రుఁ డూర్వశినిబంపుట.

ఉ. అన్నిటజాణ యూర్వశి సదా సురభోగవతీజనంబులో
నన్నలినాయతాక్షి నట కంపిన నమ్మునులన్ భ్రమింపనో
పు న్నిజహావభావములఁ బొందగు నిప్పనియంచుఁ బిల్వఁబం
చె న్నిజదూతచే నమరశేఖరుఁ డయ్యరవిందలోచనన్. 41

తే. పిలువఁబంచిన నారాజబింబవదన,చిలుక మాడినమాటలు దలఁచుకొనుచు
సంతతము సంశయంబును సంభ్రమంబు,గదురమణిభూషణోజ్జ్వలగాత్రి యగుచు. 42

సీ. చరణమంజీరపుంజరవప్రమాణంబు భద్రేభగతివిలంబనము దెలుపఁ
గనరానినడుమునఁ గనికించుజవజవల్ కుచకుంభభారంబుగుట్టు దెలుప
నవికారవచనపేక్షాదివిలాసంబు లుత్తమనాయికావృత్తి దెలుప
వనజగంధభ్రాంతిఁ ఏసువు వెన్కాడు తేఁటు లాగఁబద్మినీజాతి యగుట దెలుపఁ
తే. పురుషనికరంబు మీఁదను బుష్పశరుఁడు, తెగి ప్రయోగంబుసేయ మూర్తీభవించి
వచ్చు మోహనమంత్రదేవత యనంగఁ,జనియె నూర్వశి సురరాజసన్నిధికిని. 43

మ. చని చింతామణిభద్రపీఠమున రాజశ్రీవిలాసోన్నతుల్
పెనుపొందన్ జగదేకవైభవమునం బేరోలగంబున్న యా
ఘనవాహుం బొడగాంచి మ్రొక్కి యెలమిం గైవారముల్ చేసి ని
ల్చిన సానుగ్రహలోచనాంచలరుచుల్ చెల్వొంద వీక్షింపుచున్. 44

ఉ. ఆవనజాయతాక్షికిఁ బ్రియంబున నిట్లని పల్కె నింద్రుఁ డిం
దీవరనీలవేణి జగతీస్థలిఁ బావనకాననంబునన్
భావములం జలింపక తపంబొనరించుచు నున్నవారు మి
త్రావరుణాఖ్యమౌను లతిదారుణనిష్ఠ జగద్భయంబునన్. 45

క. మోచాఫలమధురాధర, నీచాతుర్యమున వారినియమప్రత్యూ
హాచరణము గావింపుము, నీచేతం గాని కాదు నిజ మటునేయన్. 46

సీ. సుదతి నీకుచగురుల్ చూచినమునిసింహు లాశ్రయం బొనరించు టద్భుతంబె
వనితనీయౌవనవనము గాంచిన మౌనికుంజరుల్ రమియింపఁ గోరుటరుదె
కలికి నీకటిభూమి గనుఁగొన్న యతిరాజు లనురక్తినంటి పైకొనుటవెఱఁగె
రమణి నీమధ్యాంబరము గన్న ఋషిచంద్రు లవలంబనముసేయు టబ్బురంబె

స్తారోదారములై ప్రదీపకళికాసాంద్రంబులై దేవతా
గారంబుల్ నవగాత్రులం దనరె విఖ్యాతిన్ శరద్వేళలన్. 57

ఉ. అంబరలంబిఖండవిశదాంబుధరాళి కొసంగె ధూసర
త్వం బెలమిన్ శరత్ప్రథమపక్షదినంబుల మంత్రసిద్ధహ
స్తాంబుజదత్తదీక్షితహుతాశనకుండగతాజ్యభోజ్యభూ
షాంబరపుష్పచందనఫలాదిమహాహుతిహోమధూమముల్. 58

సీ. నిద్రానుభవముద్ర నెలకొన్న నునుఁగెంపుచేఁ గన్నులకు నెంత చెలువుఁదోఁప
బరివర్తనముల రాపడిన చందనచర్చ సుందరాంగంబున సొబగుమీఱఁ
జెమటచేఁ గరఁగి కించిద్వ్యక్తమగుతిలకంబు నెన్నుదుట నందంబుగులుక
లంబితం బగుకుండలంపుఁబోత్తున నేర్పడినరేఖ హంసపీఠిక వెలుంగ
తే. మేలుకొని లేచి కూర్చుండెఁ బాలకడలి, నట్టనడుమ సహస్రఫణాఫణీంద్ర
భోగశయ్యాతలంబున భువనకర్త, కమలనాభుండు తచ్ఛరత్కాలమునను. 59

ఉ. కాముప్రయాణదుందుభులకై వడిఁ దచ్ఛరదాగమంబునన్
వేమఱు మ్రోసె దిక్కులఁ నవీనఫలోదయసస్యమంజరీ
హేమతిసంభ్రమద్విహగణార్థసముద్ధతి శాలిపాలికా
స్తోమఘణంఘణత్కటకశోభితహస్తచపేటనాదముల్. 60

వ. మఱియుఁ దత్సమయంబున సాధుజనంబులుం బోలి పంకరహితస్వచ్ఛజీవనంబైన స్రవంతీవితానంబును జంపకమహీరుహంబులగతి నసాశ్రితసారసంబులైన జీమూతఖండంబులును ననూపమభూములచందంబున మందీకృతశిఖిప్రకాశంబు లయిన ధరాధరంబులును వైద్యశాస్త్రంబువిధంబున గౌరాభ్రకగుణప్రకటంబయిన తారాపథంబును భాగ్యవంతునిమందిరంబుకై వడి శ్రీవిశేషాభిరామం బయినచంద్రికాపుంజంబును విష్ణువిగ్రహంబులరీతిం గమలాకరంబులయిన కొలంకులును గలిగి నితంబినీకదంబకనితంబబింబంబులకు నుపమానంబు సేయందగు నందంబులం దనరు సమున్నతసైకతంబులవలనను దానశీలుసత్కీర్తివిస్ఫూర్తి నకలంకధావళ్యవికసనంబయిన కాశప్రచయంబులవలనను చాపాంధకారంబులం బరిహరించుటకు దృష్టాంతంబుఁ జూపుకరణిఁ దమఃపటలంబు నణంచుచు సుజనమందిరాంగణంబులం బ్రకాశించుకార్తికనియమదీపికాజాలంబులవలనను నక్తభోజనవ్రతనిష్ఠ లొనర్చు నన్వహమహారుద్రాభిషేకపూజావిధానవిశేషంబులం దనరి విదోషంబులయిన ప్రదోషంబులం గళ్యాణనిలయశబ్దార్థంబు ధ్వనిపరంబయ్యిన నిజాభిధేయలీలం దెలుపుశివాలయచయంబులవలనను సకలసౌకర్యాలవాలం బయిన శరత్కాలంబు ప్రవర్తిల్లె. 61

## ఊర్వశి మిత్రావరుణులయొద్దికి భూమికి వచ్చుట.

క. ఆ త్తఱి నత్తరళేక్షణ, మత్తద్విపయాన యువతిమణి యూర్వశిలో
హత్తినవేడ్కను ధరకు న్, ద్యుత్తలమార్గమున డిగ్గి యటచని యెమటన్. 62

సీ. పంటముత్తైనప్రోంటలమొలకలు పడమటిదొరయేలు విడుపప్రోలు
మిాన్నై మెలంగుసామికిఁ జుట్టుకొల్లాయ కేతనంపుసరకుతోఁడపుట్టువు
వేల్పుపాతరకత్తైపెద్దసిచారుబొక్క కుండపుట్టుగుజోగిగొన్నప్రక్క
రేజేసిసిరికబ్బరించుత్రొక్కులప్రోవు తపసిదోసపుమంటదాఁచుతావు

తే. బల్లిపపుటేటియిల్లాండ్రయల్లిబెల్లి, మేరవప్పకవిరిచిన నీరువెల్లి
నిట్టనేరేడుదిబ్బకుఁజుట్టువాఁడు, కీరు చెన్నారు మున్నీరు తేఱవగాంచి. 63

వ. ప్రమోదమేదురహృదయసరసీరుహ యగుచుం జని యప్పారావారంబు తీరంబు
నందు. 64

చ. చెలువలను దాను నూర్వశి ఋషిప్రవరాశ్రమసీమచేరి సం
చలదవలగ్నకీలితల సద్రశనావరకింకిణీస్వనుల్
కలితకరాంఘ్రిపద్మకటకస్ఫుటనాదముతోడ నైక్యమై
చెలఁగ మెలంగుచుణ్ ధరకు జేరవ తీఁగెమెఱుంగుకైవడిన్. 65

సీ. తనతనుమధ్యసౌందర్యరేఖకులోఁగి కొదమసింగంబులు గుహలుచేరఁ
దనమందయాన మోహనలీలకును లజ్జనొంది మత్తేభముల్ క్రిందుచూడఁ
దనచంచలావలోకనచారుతకు నోడి సారంగనికరంబు పారిగఱవఁ
దనమంజులస్వరోదారత కళుకొంది కోకిలంబులు కొనకొమ్మలెక్కఁ

తే. దనవినీలకచప్రశస్తతకుఁ జిక్కి, భృంగనిచయంబు గీపెట్టఁ బృథులజఘన
యల్లనల్లన నేతెంచి యధికనిష్ఠఁ, దపమునాపించు నత్తపోధనులఁ గాంచి. 66

మ. పటవాసంబుల నంగరాగములఁ బుష్పస్తోమదామంబులం
బటుసౌరభ్యపరంపరల్ వొదువఁ దత్ప్రాంతంబునం జేరి సం
ఘటితస్వాంజలిఫాలలై మునులు దద్గాత్రి వీక్షింపకుం
డుట భావించి ప్రయాససాధ్యమనుచుణ్ డోలాయమానాత్మలై. 67

వ. ఇంచుకతడవు విచారించి నిజవిలాసవిభ్రమవిద్యాప్రాగల్భ్యంబులఁజూపి యెట్లయి
నను రాగరసమగ్నులం జేయుదుంగాక యనునవామికం దత్ప్రదేశంబున మందా
రకుందచందనమాలతీమధురికక్రముక ఖర్జూరనారంగనారికేళపున్నాగచాంపేయల
వంగమాతులుంగరంభాజంబీర జంబూప్రముఖనిఖిలతరుషండంబుల నజహద్వసంత

శాంతత్వంబులై ప్రకాశించు ప్రవాళలతా ప్రతానకోరకలతాంతమంజరీపరాగ మకరందశలాటుఫలగుచ్ఛప్రముఖసౌభాగ్యంబులం గన్నులపండువై కోయిలలయెలుంగులఁ జిలుకలకలకలంబులఁ గొఱవంకలరవాంకంబులఁ బారావతంబులరుతంబులఁ గేకులకేకారవంబులఁ దుమ్మెదలరొదలఁ గర్ణపర్వంబయి కబంధజాతసౌగంధికకుముదసముదయామందబంధురసుగంధిసంబంధిగంధవహ కారణబంధుకృతోపచార సుఖసమ్మోదితప్రాణినికరంబులయిన కమలాకరంబులఁ గొంబొప్పునప్పుణ్యాశ్రమంబున విబుధవేశ్యాలలామంబు వయస్యలుం దానును విహారంబొనర్చె నప్పుడు. 68

సీ. మకరందనదులఁ బెంబడి నంచలించుచో హంసాంగనలరేఖ యచ్చుపడఁగఁ
బొలుపొందు పల్లవప్రంజంబు చిదుముచోఁ గోకంతయువతులగరిమఁ దనరఁ
గలితసౌరభకుసుమాఘ్రాణంబు సేయుంచో భ్రమరకాంతలపొంత పరిఢవిల్ల
రసమనోహరఫలగ్రహణంబు సేయుంచో శుకవిలాసినులపొందిక రహింప

తే. నమరలీలావతులు తన్వనాంతరమున, విహరణం బొనరింపుచు వేడ్కమీఱఁ
జేయుశృంగారచేష్టల శ్రీయొసంగె, మదనధాటి నిరాఘాటమహిమ యగుచు. 69

చ. పరువడి మల్లెమొగ్గలును బాటలముల్ కలయంగఁ గోసి యొ
క్కరమణి దెచ్చియొక్కకుఁ గానుకపట్టిన దంతకాంతిసుం
దరతయు మోవికెంపియుఁ గనంబడ నవ్వఁ దదంగపుష్పవి
స్ఫురణల తారతమ్యములు పోల్క కేలికబంటువాసిగన్. 70

తే. ముదితయొక్కతె సంపెంగమొగ్గతాపి, కొనుటకై నాసికాద్వారమునకుఁ జేర్పఁ
గోరి సౌందర్యభిక్షకై చేరఁబోలు, వాకిటకనంచు నవ్విరి వనితలెల్ల. 71

తే. తరుణిసంపెఁగపువ్వులదండగూర్చి, కబరికాభృంగవితతిపైఁ గదియఁజుట్ట
వింతయై యొప్పె నొప్పుటవిస్మయంబె, శత్రువులు మిత్రులైన సౌజన్యగుణము. 72

ఉ. శుకచంచూపుటఘాతరేఖలఁ గడుం జొంపొందుశాఖావలం
బకజంబీరఫలద్వయంబు గని కొమ్మా చూచితే ప్రాణనా
యకునిం గూడిన బాల చన్గవకు సామ్యంబయ్యె నౌనంచు నొ
క్కకురంగేక్షణ చూపెఁ దోడిచెలికిం గందర్పుఁ డగ్గింపఁగన్. 73

క. శ్రవణావతంసములుగా, నవరించిరి వకుళముకుళచయ మింతులు క
న్గవ తలఁదిరుగక యుండం, దవిలి మరుం డిడినశాసనంబులనంగన్. 74

చ. మఱఁదల రావె యంచు నొకమానిని యొక్కతెఁ జీరి వచ్చున
త్తఱి విరిచెండ్లు చన్నుఁగవ దాఁక వడిన్ వయివం దటాలునం

దెఱవ కవుఁగిలించి వెనుతియ్యక చన్గవ దట్టుచన్వయం
బఱిముఱి నొత్తె నవ్వి కహహా సరికీఁ సరియంచు నంగనల్. 75

చ. విరులకు నొక్కయిందుముఖి వేడుకతో నిజశాఖవంచుచోఁ
బురుషమణీజ మయ్యు గురుఁబోఁడి పయింట చెఱంగువట్టి త
ద్గురుకుచముల్ బయల్పడఁగఁ ద్రోచె నచేతనమయ్యు మాయురే
పురుషులు చేతనుల్ మనుతఁ బొందరె చక్కనిరంతిఁ జూచినన్. 76

మ. అరవిందాక్షులు దిగ్గయుయ్యెలల నొయ్యారంబుగా నూఁగఁ జొ
చ్చిరి పాదాబ్జము లప్పుడిక్కిసలయశ్రేణిం దలల్ద్రొక్క సుం
దరశోభానఖపఙ్క్తి చక్కఁగమిపై దండెత్త మంజీరపుం
జరవం బభ్రధునీమరాళములు వాక్స్తంభంబు గావింపఁగన్. 77

శా. పాదాక్రాంతములయ్యె రాగగుణసంపత్పల్లవవ్రాతముల్
మోదంబొప్ప నుయాల లూఁగుచుఁ బదంబుల్ ప్రాంతవృక్షాళికిన్
మీఁదం జూపు మెఱుంగుబోండ్ల కుచితంబే కా విటీకోటికిం
బాదాక్రాంతము గాట రాగగుణసంపత్పల్లవవ్రాతముల్. 78

## పుష్పాపచయవర్ణనాదికము.

సీ. అలివేణికెంగేల నంటమాకందంబు పికవాణిపాడినఁ బ్రేంకణంబు
పొలఁతుక కలికిచూపులఁ జూడఁ దిలకంబు చెలిపదాబ్జంబుఁ జేర్చిన నశోక
మలసగామిని ముద్దుపల్కుఁ బల్కిన గోఁగు నలినాక్షిహాసనం బొనర్పఁ బొన్న
కనకాంగి యూర్పుసోఁకిన సిందువారంబు చానమోమెత్తినఁ జంపకంబు
తే. కుసుమకోమలియొదఁ జేర్చుకొనినఁ గ్రోవి, యువతిపుక్కిటిమధువు పైనుమియఁ బొగడ
తమి నలరి పూచెఁబో యచేతనము లయ్యుఁ, బురుషులనఁ నెంత చెలులకుమరులుకొలుప.

వ. మఱియు నయ్యరవిందలోచనానిచయంబు పుష్పాపచయంబు స్వచ్ఛందవిహారణకుతూ
హలాధీనమానస లయియొనర్చుచుం దమలోన. 80

రగడ. తరుణి తరుణిసుమాళి యభ్రపుఁదారిఁ దా విలసిల్లె నిత్తఱి
సరయ సరయత మాని చేకొన రమ్మర మ్మని పిల్చె బిత్తరి
కదలి కదలి నటింప దళములఁ గానఁగా నరుదయ్యె నందము
ముదిత ముదితమిళిందమాఁగదె మొల్ల మొల్లపువిరిమరందము
తనరు తనరుచిగరుడరత్నమతల్లి తల్లియ నా వెలుంగుచు
వనిత వనితరుశాఖఁ గీరము వ్రాలె వ్రాలెడువేడ్కఁ బొంగుచుఁ

బొగడఁ బొగడఁగ నొప్పుఁ జూడుము పూని పూని కరంబు గొమ్మది
నగము నగమును బోలె నున్నది నాతి నాతిలకంబు సుమ్మది
వరస వరసహకారపాళి సువర్ణవర్ణపరాగజాతముఁ
గురువ గురువగు వలపునద్దెస గుప్ప గుప్పన వీచెవాతము
కోక కోకనదస్తనాంఘ్రి ముకుందకుందనిదానలాభమె
నీకు నీకురువేరు లిట్లాడినింద నిందన నింతలోభమె
వలపు వలపున దమ్మియని శశివదనవదనము సారెఁ జేరఁగ
నలికి నలికిభ్రమించె నగ్గజయాన యానవటాలు గేరఁగ
తా లతాలపుఁడోల నూఁగుచుఁ దన్నుఁ దన్నుగ మది చలించెను
మేలమే లలితాంగిప్రౌఢిమ మెచ్చు మెచ్చుగ నందగించెను
అతివ యతివర్ణితములై చెన్నారు నారుచిరంపుమల్లెలు
హితమహితమతి నొసఁగి కైకొనవింతవింతలె నీకుఁ జెల్లెల
యక్క యక్కలకంఠకులరవ మందమందత చెలఁగె నిందము
నిక్క నిక్కజరాజి దట్టపుసేద నీడగ్గఱనె యుందము
జాతిజాతి సుగంధమిచట నెసంగసంగతమయ్యెఁ జా వివి
గోతు గోతులితాబ్జ త్రుంచవె గోర గోరకములు ప్రియాళివి
లలన లలనవపాటలీపటలంబు లంబుజగంధిపొదపొద
గలయఁ గలయవి యెల్లఁ గోయఁగఁ గానఁ గానవె యటకుఁ బోదపొద
కాంత కాంతపుగొజ్జఁగుల నివె కంటెఁ గంటికి నింపుగా నివి
నింతు నింతులఁ గానసీకొడి నిచ్చ నిచ్చకువేయఁ గానివి
కమ్మ కమ్మరొ చూతు సంపెంగలను గలనునుగాంతవృత్తులు
కొమ్మకొమ్మకుఁ బూని నిగిడెదఁ గొమ్మ కొమ్మలె పొన్నగుత్తులు
కలసి కలసితచంచలతవనకమలకమలత నాటఁజూపెడు
నలరునలరుల తీఁగయదె నటనాఁగ నాగము గెలువ నోపెడు. 81

వ. అని యన్యోన్యసంభాషణతత్పరలై చెలంగి మెలంగుచుండి రప్పుడు. 82

సీ. స్వేదాంబుకణికలచేఁ గుచంబులకు దృష్టాంతమయ్యెఁ బయోధరాభిధాన
మపరంజిపసిఁడిచాయలఁ గుల్కు తనువల్లికలయందు బడలికల్ గానుపించె
వడదాఁకి కసుగంది వదనేందుబింబముల్ కెందమ్మిచాయల నందగించె
నలసభావములైన యంఘ్రివిన్యాసముల్ విహరణోత్సాహంబు విడుపుఁ దెలిపెఁ

తే. బ్రాంతసరసీరుహాకరాంభస్తరంగ, పవనముల మీఁద హృదయము పరువులెత్తె
వేల్పు వెలయాండ్ర కారామవిహృతివలన, సంభవించినఘనపరిశ్రాంతివలన. 83

జలకేళీవర్ణనము.

క. వనకేళియలంతఁ దీర్పఁగ, వనకేళియ యుచితమనుచు వనితలు పలుకన్
వినిహితకరమని సఖిపై, వినిహితకరయగుచు మరలె వెలఁదుక యచటన్. 84

సీ. సరసాలికయపాఁర సరసానుభవధీర తరసారసఝంకార కరమదాళి
కలనాదకృతతాళి కలనాయుతమరాళి లలనాప్రసవజాల లలితకేళి
రటదాగమాభంగ నటదాతతతరంగ ఘటదాకృతిరథాంగ పటలశాలి
పవనార్భకవినోద జవనాట్యకృన్మోద భువనాద్భుతామోద కువలయాళి

తే. ప్రకటనికటలటత్స్ఫుట పటుపటీర, ఘటపటీపరిమళ మిళిత నవీనమృదుల
కదళికాతరుసంగళిత కలికశశిర, జనిపులినపాళి యొక్కకాసారమౌళి. 85

వ. మఱియును. 86

తే. భువనములు దనలోపలఁ బొదలుచుండ, రాజహంసరథాంగవిరాజి యగుచు
నబ్జభూషితమై యొప్పె నక్కొలంకు, హరునిపోలిక తనయందు నచ్చుపడఁగ. 87

ఉ. హల్లకపాళిపేర వికచాబ్జదళంబులపేరఁ జక్రవా
కొల్లసనంబుపేరఁ జెలువొందెడు హంసకులంబుపేర సం
ధిల్లు శయాంబక స్తనగతిస్ఫురణల్ నయనాభిరామమై
చెల్లఁగఁ దద్వినోదసరసీరమసొంపు వహించె నెంతయున్. 88

తే. ఇందిరామందిరమునకు మందిరమఁట, పుట్టినిల్లఁట పుష్పవద్భోగినులకు
నాయుధాగారమఁట మాధవాత్మజునకు, సరసిమహిమంబు వర్ణింప శక్యమగునె. 89

ఉ. అట్టి సరోవరంబుఁగని యవ్వనితల్ జనితానురాగలై
యిట్టి కొలంకుఁ జూచి మును పెన్నఁ డెఱుంగ మటంచు నెమ్మదిం
బుట్టిన తద్విహారరతబుద్ధి జొకాటపు రేవెలుంగురా
మెట్టులమీఁద బాదములు మెట్టుచు నందెలు ఘల్లుఘల్లనన్. 90

తే. అలివ లవలంబితాన్యోన్యహస్తకమల, లగుచు సలిలంబులోపల డిగి నిజాంగ
లలితలావణ్యముక్తాఫలప్రదీప్తి, చే నలంకరణంబు చేసిరి కొలంకు. 91

మ. జలజాతోత్పలహల్లకప్రముఖపుష్పశ్రేణి నెట్టాడుచున్
జలపూరంబులఁ జల్లులాడుచు నుదంచచ్చంచరీకాళి న
గ్గలికం జోపుచు హంససారసరథాంగవ్రాతముం దోలుచున్
సలిలక్రీడ లొనర్చి రంగనలు సింజత్కంకణోదారలై. 92

సీ. వెలయించెఁ గ్రొత్తచెంగలువపువ్వులగముల్ రమణీమణులహస్తరాగలక్ష్మి
సమకొల్పె నభినవచక్రవాకసమృద్ధి పృథ్వీబోఁడులకుచాభోగమహిమ
యొనఁగఁజేసె నపూర్వబిసరుహసామగ్రి బింబాధరలయాస్యబింబసుషమ
పొదలించె వింతతుమ్మెదగుంపులను దటిల్లోచనాకచభారమేచకంబు
ఆ. సహజమయిన సరసిసౌభాగ్యమునకు సౌభాగ్యమొదవఁజేసెఁ బద్మముఖుల
యంగములవిలాసమనని శ్రీ శ్రీ జేయు, ననెడిమాట నిశ్చయంబుగాఁగ. 93

సీ. ఈముద్దుమోముల కెనయౌనె తనలోనితమ్ములు పంకజాతమ్ము లనుచు
నీవాలుఁగన్నుల కెనయౌనె తనలోని కైరవంబులు దివాభీరు లనుచు
నీచన్నుఁగవలకు నెనయౌనె తనలోని చక్రపక్షులు విలక్షణము లనుచు
నీవళిరేఖల కెనయౌనె తనలోని ఘనతరంగములు భంగంబు లనుచు
తే. నీశిరోజములకు నెనయౌనె తనలోని భ్రమరములు సువర్ణసువిరోధు
లనుచు దద్వీచీవిహారవిలోచన,వ్యాజమునఁ గలంక మందెఁ గొలఁకు. 94

సీ. కచవిలాసము చూచికాదె చలించె శైవాలముల్ మదభృంగ జాలములును
ఘనకుచోన్నతి చూచికాదె జంకె సరోజకుట్మలానీకముల్ కోకములును
గనుచూపువగఁ జూచికాదె తలంకె నిందీవరములు నండభూవరములు
కరరక్తిమము చూచికాదె కంపమునొందె నవహల్లకములు కెందమ్మిగములు
తే. ననుచు నిజవిహారణరభసాతిరేక, లుఠదభంగురభంగవిలోలతత్త
దాకృతులు చూచి పలుకుదు రబ్జముఖులు, చతురభాషలు జలకేళిసమయమునను.

క. అంభోరుహాకరమున వి,జృంభణమున సీఁదుటకు ధరించిన శుంభ
త్కుంభప్లవంబు లనఁ గుచ, కుంభంబులు దనరముద్దుగుమ్మలు వరుసన్. 96

క. జలముల మునుఁగుచుఁ దేలుచు, మెలఁగఁగ జవరాండ్ర ముద్దుమేనులు వొలిచెన్
జలదంబులోన నెడనెడ, లలితగతిందోఁచుచంచలాలత లనఁగన్. 97

సీ. గుత్తంపుగుబ్బలు గుఱిచేసి వైచెఁ బయోజకుట్మలముల నొకతె నొకతె
కులుకువాల్గన్నులు గుఱిచేసి వైచె నీలోత్పలావళులచే నొకతె నొకతె
కొమరారుబాహువుల్ గుఱిచేసి వైచెఁ గొంచక మృణాళంబుల నొకతె నొకతె
క్రొన్ననకెమ్మోవి గుఱిచేసి వైచె హల్లకనికాయంబున నొకతె నొకతె
తే. తగవు దప్పని జగడ మీతరుణులందు, సూటిపడె మేలు మే లని జోకఁ జెలులు
సరసమాడంగ విరుల వసంతమాడి, రాలతాంగులు పంకేరుహాకరమున. 98

చ. లలనలముద్దుమేనుల నలందిన నిర్మలచంద్రసారసం
కలితపటీరపంకనవగంధరసంబును బూని వింతగా
వల పుదయించు తత్సరసివారి నపూర్వముదార్తిఁ జేలుచుం
జెలఁగె మరాళదంపతులు చిత్రగతిం గలనాదవైఖరిన్. 99

తే. ఇష్వధంబునఁ గొంతప్రొద్దిందువదన, లంబుజాకరకేళివిహారలీల
మెలఁగి చాలించి వెలువడి రలమరుండు, పదును వెట్టి వెడల్చుసాయకము లనఁగ.

క. అనురాగరసార్ద్రములై, యొనసి తొలంగని విటాలి హృదయములఁగతిన్
వనితలతనువుల నంటెన్, ఘనరససంప్లుతములైన కనకాంబరముల్. 101

చ. తడిసిన వల్వపయ్యెదలు దాఁకొని పైపయి నంటి యుండఁగా
నడుమ నగోచరం బగు వినూత్నవిలాసత నొప్పె నప్పుడ
ప్పడఁతుల గుబ్బచన్నవలు ప్రౌఢకవీంద్రులచే రచింపఁగాఁ
బడుమృదుభాషపాకరసబంధురకావ్యవచస్సమంబులై. 102

సీ. అంగనాకచనీరజాతశీర్ణంబులై పద్మోపలముల భావమునఁ బొలుచు
మదవతీవదనేందుమండలావృతములై తారకావళివినోదమునఁ దనరుఁ
గామినీకుచహేమకలశస్థితంబులై ముక్తాఫలంబుల మురువుఁ గాంచు
లలితవతీగాత్ర లతికాశ్రయంబులై నవకోరకంబులనయముఁ జెలువు
తే. వెల్లివెట్టిన లావణ్యవిభవవాహి, సీసముద్భూతబుద్బుదాసిక మనఁగఁ
వగిన జలబిందువితతి కాంతలమనోహ, రాంగకంబుల జలకేళికాంతమునను. 103

శా. సౌవర్ణాంబరముల్ ధరించి మణిభూషాజాలముల్ దాల్చి మే
ల్పూవుందండలఁ గీలుగంటు సిగ లొప్పు ల్మీఱఁగా వైచి నె
త్తావుల్ గ్రమ్మెడు చందనం బలఁది కాంతల్ నవ్యశృంగారలీ
లావిభ్రాచితలై సుశీతలరసాలచ్ఛాయ నాసీనులై. 104

వ. ఉండి రయ్యెడ నయ్యూర్వశి వశీకరణార్థంబుగా సంగీతప్రసంగం బెసంగించు
నుత్సాహంబున. 105

చ. గవిసెనఁ బాయఁగాఁ దివిచి కైకొని సారెలు చక్కనొత్తి మా
ర్దవఫణితిన్ శ్రుతుల్ గలియఁ దంత్రులు చక్కఁగ మేళగించి చ
న్గవపయి నొక్కకాయ యొకకాయ నిజాంకమునందు నుంచి ప
ల్లవమృదులాంగుళీహతి కలక్వణితంబుగ వీణ మీఁటుచున్. 106

సీ. బంగారుజలపోఁత రంగుమీఱినకాయ కుచమండలంబుపైఁ గొమరుమిగుల
సరసాంగుళులు సారెసారె సారెలమీఁద సారోహణావరోహణతఁదనర
నేర్పు రెంపఁగరాక యేకమై తంత్రగాత్రంబుల నాదామృతంబు దొరుగ
భావానుభవలీలఁ బైకొన్న మదిసొక్కు కనుచూపువింతచేఁ గానఁబడఁగ

తే. మంద్రమధ్యమతారకసాంద్రసరిగ, మపదనిస్వరానుస్వరమాధురీధు
రీణగీతప్రబంధప్రమాణఘటిత, వీణ వాయించె గానప్రవీణ యగుచు. 107

తే. వెలఁదికుచకుంభములతోడ వీణకాయ, పడఁతివీణాస్వరముతో విపంచిరవము
చేసె సహవాస మహగుణస్నేహ మనఁగ, నందమాఁగద యీడుజోడైనచెలిమి. 108

చ. మలయజగంధి తాళపరిమాణమనోహరరాగగీతికా
కలసినదంబు తంత్రమున గాత్రమునం జెలగింపు నింపుచే
శిలలు ద్రవించెఁ జిత్రములఁ జీవకళల్ ధరియించె దారువుల్
పొలుపుగ నంకురించె మృగముల్ మదిఁజొక్కువహించె నెంతయున్. 109

శా. ఆగాంధర్వనినాదవైభవము బ్రహ్మానందమై యందమై
భోగేచ్ఛాంకురకందమై శ్రుతిసుఖోద్భూతామృతస్యందమై
వాగర్థైకరసానుభూతి కుతుకస్వచ్ఛందమై యొప్పుచున్
రాగాంభోనిధి ముంచి యెత్తె మునిచంద్రస్వాంతకంజంబులన్. 110

ఉ. చల్లఁదనంపుసొంపు వెదచల్లుచు వెన్నెలతేటవోలె వి
ద్యుల్లతికాంగి గానరసముద్గతమై ముని మానసాంతరా
లోల్లసనప్రపూర్తిఁ జెలువొంది కరంగఁగఁ జేసె నింపు సం
ధిల్లఁ దదీయధైర్యరజసీకరకాంత శిలోచ్చయంబులన్. 111

తే. రాగమా యిది మదికనురాగ మనుచుఁ,బదములా యివి ప్రేమ కాస్పదము లనుచుఁ
దాళమా యిది రతికినుతాళమనుచు,యోగు లద్భుతరసభంగయోగు లగుచు. 112

శా. ధ్యానానందనిమీలనంబు లగునేత్రద్వంద్వముల్ విచ్చి య
మ్మానుల్ గాంచిరి చెంగటన్ నిజసఖీమధ్యంబునం బొల్చు శం
పానైగన్నిగగాత్రి నీలచికురన్ బంధూకరాగాధరన్
మీనాక్షిన్ దృఢతుందిలస్తనిదరస్మేరాననాంభోరుహన్. 113

వ. కాంచి యక్కళాపతీతిలకంబు చక్కఁదనంబునకు నక్కజం బగునాశ్చర్యంబు
నొందుచు. 114

చ. పలుకుల ముద్దునెమ్మొగముబాగు పిఱుందులసోయగంబు చ
న్నులగమకంబు కన్నులవినోదము చేతులయొప్పిదంబు చె
క్కులబిగి కౌనులేఁత వగ కొప్పువిలాసము మోవికెంపు మై
చెలువము పిసిసొమ్ముగ రచించెఁ జుమీ యజుఁ డింతకింతకున్. 115

ఉ. తావిపసిండికమ్మి వనితామణి మేను కళంకులేని రా
కావిధుబింబ మంగన మొగంబు సుధారసమూరు కెంపుళీ
లావతి మోవి యిట్టటుఁ దొలంగని జక్కవ లింతిచన్ను లా
రా వలరాయఁ డైనను విరాళిఁ గొనుం గద దీనిఁ జూచినన్. 116

క. తెలుపక తెలుపుచు నున్నది, జలజానన మోము పూర్ణచంద్రుఁ డగుట కో
మలహాసచంద్రికాధర, లలితసుధాప్రవృత్తి సంగలక్షణములచేన్. 117

సీ. ఘనసారసారసాంగత్యంబు నొల్లని గజనిమ్మపండ్లచక్కందనంబు
ముక్తామణులగూఢముగ నణంచుకయున్న కుంభికుంభములవిజృంభణంబు
చేరఁబోయినసుశృంగారరసాకృతి గనుపించుకొండలగౌరవంబు
చకితస్వభావచాంచల్యపత్త్రకములై భ్రమియించు చక్రవాకములసొబగు

తే. పోల్పఁదగు నెట్లు కలితకర్పూరమై ప్రకాశమాక్తికహారమై కదిసి చూడ
సరసమై విస్తరళపత్త్రసహితమై యొసంగుసీయంగనామణిచన్నుఁగవకు. 118

ఉ. అంబుజగర్భుఁ డింతియధరాంగుళిహాసశిరోరుహాదు లం
దంబగు కెంపు విద్రుమకదంబము మౌక్తికముల్ సుచేంద్రనీ
లంబులు నాదిగాఁగ నుపలంబులె కూర్చి రచించె దీని చి
త్తంబును నట్లనేయఁడుగదా మదిలో ననుమాన మయ్యెడున్. 119

మ. అనురాగంబున నట్టిరూపవతి తా నై కౌఁగిటం జేర్చి పై
కొని కించిచ్చలితస్తనాగ్ర యగుచుం గోకోక్తకళాప్రార్థయు
క్తిని బింబాధరలిప్రసంగకలనం గ్రీడించునాభాగ్య మె
వ్వనికిం గల్గు నదృష్టలభ్యములు గావా సుందరీసౌఖ్యముల్. 120

వ. అని విచారింపుచు. 121

సీ. భస్మాంగరాగకల్పనఁ దొఱంగి లతాంగి వలిగుబ్బమొనల మై యలమఁ దివురు
నాసాగ్రదృష్టివిన్యాసంబు చాలించి నాతిమర్మంబులు నాటఁజూచు
నాదసంశ్రవణసన్నాహనంబు మఱచి తన్విమృదూక్తి వినుటకు వీనులొగ్గుఁ
దొరుగు బ్రహ్మపదామృతరస మానుట మాని మానినికెమ్మోవి యానఁగోరుఁ

తే. కేవలం బగుకుంభకక్రియ సడల్చి, కొమ్మముఖపద్మసురభి మూర్కొనఁదలంచుఁ
గరణపంచక మిట్లు శుద్ధతముఁ జేసి, మునియునం బాత్మనిష్ఠ వీడ్కొని కరంగి. 122

తే. మగువతనుసీమ నాపాదమస్తకమును, దిరుగ మానులచూపులఁ దియ్యవింటి
గడుసుమన్నీఁడు చనుగట్ల నడిమియిఱుకు, గనుమ నరికట్టె నిట్టటుఁ గదలనీక. 123

ఉ. పయ్యెదజాఱువాటిఱఁగు పయ్యెదఁ జిక్కటమై బిగించి యా
యయ్యల కాసగొల్పఁ జెలి యయ్యలఘుస్తనపాళిమీఁదఁ జే
వెయ్యను బుద్ధిపుట్టె మఱివెయ్యను కొన్న విరక్తి గల్గునే
తియ్యనివింటిదంట యొఱదియ్యని వాఁడికటారి యెట్టిదో. 124

సీ. అంకంబులయ్యె నీలాలకచెక్కిళ్ల మకరదళంబులు మన్మథునకుఁ
జాపంబులయ్యెఁ గంజాతపత్రేక్షణభ్రూవల్లికాద్వయి భావజునకు
బాణంబులయ్యెఁ జంపకమోహనాంగియపాంగమాలికలు పంచాశుగునకు
నళిబలంబయ్యె సీతాంశుబింబాననబలుకొప్పు శంబరభంజనునకు
తే. నమ్మునీంద్రులమీఁద నహంకరించి, దండువెడలెడు పుష్పకోదండపాణి
కమరె సాధనసంపత్తి యలఘుమహిమ, బాలఁతియంగకలీలావిభూతివలన. 125

ఉ. ఆవల రాయరాహుతుఁ డహంకృతి వచ్చని తెక్కుపక్కెరన్
ఠీవివహించు తేజిని వడిం దుమికింపుచు నుగ్రమూర్తియై
కేవున నార్చి తాఁకి నఱకెన్ యతిహృద్ధృతి ఖండఖండముల్
గా వరకేతకీకుసుమగర్భదళోజ్జ్వలఖడ్గధారచేన్. 126

తే. ఇట్లు మదనవ్యథాభిన్నహృదయు లగుచు, నున్న మిత్రావరుణమాను లన్నిలింప
సుందరీమణిమోమునఁ జూడ్కి నిలిపి, యెద్దియేనియుఁ బలుక నూహించునపుడు. 127

ఉ. పంకజనేత్ర యమ్మునులభావ మెఱింగి తరంగితప్రమో
దాంకవిలోలలోచనదృగంచలయై గళితోత్తరీయయై
పొంకపుఁ జన్నుదోయి వలపుల్ గొలుప న్నవరత్నకింకిణీ
కంకణమంజులధ్వనులు ఘల్లన నిబ్బితితోడ మందహా
సాంకురలక్ష్మిఁ జిత్తము బయల్పడ డిగ్గున లేచి నిల్చినన్. 128

క. ఆపగ యబ్బురపడి మో, హావేశతఁ జూడఁజూడ యతివరులమనో
భావము లానందాబ్ధి, ర్భావంబులఁ జొక్కి వీర్యపతనం బయ్యెన్. 129

వ. తదనంతరంబ. 130

## మిత్రావరుణు లూర్వశిని శపించుట.

క. తెలివొంది యాత్మనిష్ఠా, చలనమునకు వగచి తాపసజనోత్తము లీ
లలనకతంబున విఘ్నం, బొలసెఁ దపంబునకు ననుచు నొదవెడు నలుకన్. 131

క. మానవమానవతీస్థితి, తోనుండుము భూమి ననుచుఁ దొడరి శపింపన్
మానిని శాపవిముక్తికిఁగా నెంతయు వేఁడుకొనినఁ గరుణాన్వితులై. 132

క. కతిపయదినములు భువిలో, నతిసంతోషమునఁ నుండి యంతట నమరా
వతినుండఁగలవు పూర్వస్థితినంచు ననుగ్రహంబుచేసిరి మానుల్. 133

వ. అంత నక్కాంత చింతారహితస్వాంతయై యమ్మునీంద్రుల వియోగంబునఁ బ్రస్ఖలితశుక్రంబు కుంభక్షిప్తంబుగావించి వారలచేత ననుజ్ఞాతయై చని పురూరవుని తోడి సంబంధం బపేక్షించి తిరుగుచుండఁ గుంభగతం బయినమిత్రావరుణుల తేజంబువలన మహామహిమప్రాశస్త్యంబై యగస్త్యుండును, నిమినృపాలశాపనష్ట శరీరుండై పునర్దేహప్రాప్తికిఁ బ్రహ్మానియోగంబున మిత్రావరుణతేజఃప్రవిష్టుం డయిన మునిశ్రేష్ఠుఁ డగువసిష్ఠుండును సంభవించి రట యూర్వశిం దోడ్కొని పోవుటకై నాట్యమేళకర్త లగుటగంధర్వు లచటికి వచ్చి యమ్మగువయభిప్రాయం బెఱింగి యిప్పుడంతి హృదయం బిప్పుడు మరల్పవశంబుగాదు మఱికొన్ని దినంబుల కయినం దోడ్కొనిచన నుపాయం బిప్పుడ చేయవలయు నని యూహించి యత్తరుణిం గనుంగొని నీవు పురూరవునిపొందునకయి బద్ధానురాగంబున నున్నదానవు నీకోర్కె విఫలంబు చేయంగూడదు గావున నిన్నొకటి యర్థించెద మంగీకరింప వలయు నతనిసఖ్యం బనుసంధించునపుడు నీవు క్రీడార్థంబుగాఁ బెంచిన జోడు తగళ్లను జోరమృగాద్యుపద్రవంబులం బొరయకుండ నిరంతరంబు సంరక్షించు నట్లును వివస్త్రతాకారంబుగాని యాకారంబున నెప్పుడు నీకడ మెలంగునట్లును సమయంబు చేసి యొడం బఱుచునది యని యియ్యకొలిపి యయ్యింతి వీడ్కొని చని రంత. 134

## హేమంత ఋతువర్ణనము.

క. హేమంతము నవయావన, సీమంతవతీకుచాద్రిసీమాంతరవి
శ్రామసుఖయువనిరాకృతి, సామంతం బగుచుఁ దనరు జగతిఁ సుగతిన్. 135

తే. చలికి బెగడొంది మేరువుచాటుఁ జొచ్చి, యెట్టకేలకుఁ గాని రాఁ డినుఁడు వెడలి
వెడలి పరువెత్తి యపరాద్రి వెనుక కేగు, నితరజనముల శీతార్తి యెన్న నేల. 136

తే. మాసములలోనఁ దనమూర్తి మార్గశీర్ష, మనుభగవదుక్తికిది సాక్షి యయ్యె ననఁగఁ
బాడిపంటలు బలిసి సౌభాగ్యమహిమ, లోచనానంద మయి యుండె లోకమునను.

చ. చలిచలి యంచు మానవులు సంకుచితాంగకులై వణంకుచుం
బొలఁతులగుబ్బచన్గవలఁబొంతల డాఁగియు మారుతంబుపై
నొలయని యిండ్లసేగియుఁ గటూష్ణపదార్థము లారగించియుం
గళితపుఁ బచ్చడా లిడియుఁ గప్పియుఁ గుంపటుల న్మెలంగువ
హ్నుల సెగఁగాఁగియుఁ గడపుచుందురు ప్రొద్దులు సీతుకందువన్. 138

సీ. తతహంసమాలికాతల్పభాగంబులపై జోడువాయక పవ్వళించి
యగరుగంధపుఁబూతఁ దగుగుబ్బచన్నుల సెగలారఁ గౌఁగిళ్లఁ బిగియఁజేర్చి
తమిదోఁచు సంతరుష్ణము దెల్పుచూపులు మోముఁదమ్ములు గ్రమ్ముద్దు లొసఁగి
సలవంగనవజాతిఫలమిళద్వీటియుతాధరసీధువు లానిచ్చి

ఆ. ప్రచురనర్మమర్మరుచిరలై శ్యామాజనంబు సలుపుసురతనాట్యసుఖము
రసికులకు మనోభిరంజనం బయి యొప్పె, భువిని హిమదినైకభోగ్య మగుట. 139

వ. తదనంతరంబ. 140

## శిశర ఋతువర్ణనము.

క. పన్నీటిజడికి సామని, వెన్నెలల కబోధవేళ వీడ్కొలుపు పయో
జోన్నతికి ధాన్యలక్ష్మీ ప్రసన్నంబగు నెళవు శిశిరసమయము దోఁచెన్. 141

సీ. జగదేకమాత సీశ్వరిఁ గన్నవరగోత్ర మాశ్రమస్థలముగా నమరు నెద్ది
సత్యవతీపరాశరులకూటములకై కల్పించె నహారంధకార మెద్ది
జైవాతృకునికరచ్ఛాయాకలాపంబు తనమూర్తిమయముగాఁ దనరు నెద్ది
పన్నీరుపేరిటఁ బరఁగి భోగులకు వేసవివేళ సౌఖ్యం బొసంగు నెద్ది

తే. యట్టినీహార మఖిలదిగంతరములఁ, బర్వె నీరంధ్రమై కకుప్పాలకావ
రోధయావతయవనికారుచిరధవళ, పటపటుత్వంబు దనయందుఁబట్టువడఁగ. 142

క. వరతుహినబిందుసాంద్రో, దరము లగుచు నాగవల్లిదళములు దనరున్
సురతాంతశ్రమజలకణ, భరితశ్యామాకపోలఫలకాభము లై. 143

శా. సంకేతంబుల జారులం గలసి తత్సంయోగజశ్రాంతితో
లంకె న్నిల్పెడుప్రేమబంధముల రేల్ గౌఁగిళ్ల నిద్రించి ని
శ్శంకం జేరుదు రిండ్లు రేపకడలం జారాంగనల్ ఛాదితా
శాంతోద్యచ్ఛిశిరాగమాధికహిమాధ్యావృత్త్యదృశ్యక్రియన్. 144

క. ఉండఁగ ఘనఘనసారక, రండము క్రియ భూనభోంతరాళవ్యాప్తా
ఖండహిమపాండిమమున న,జాండకటాహంబు దదహరామలయందున్. 145

ఉ. ఆయెడ నప్పురూరవుఁడు నుగ్రపరాక్రముఁ డష్టదిక్పతీ-
నాయకలోకమౌళినవనవ్యకిరీటకిరీటఘృష్టపా
ర్గేయనిజైకశాసనవిశేషలసద్గుఁడై యనశత్రుపక్షని
ర్దాయితఖడ్గజిహ్వగపతంగసదృగ్గుఁడై జగమేలుచున్నెడన్. 146

వ. ఒక్కనాఁడు. 147

## పురూరవుఁడు మాఘస్నానముచేయ నేగుట.

క. ద్వాదశి నభ్యంగము ప్రా, మాదికమున సంఘటించె మనుజపతి కను
ర్వ్యాదార్ద్ర వచ్చుఁగాదె ప్ర, మాదం బొకవేళ బుద్ధిమంతులకయినన్. 148

ఉ. ఆదురితంబుచే నృపతి యానననీమ వికారభావము
త్పాదకమైన నాప్తు లగుబ్రాహ్మణముఖ్యులతోడఁ జెప్పినన్
ద్వాదశిపుణ్యకాలమునఁ దైలముసొం దలయంటికొంట వో
పోనయమయ్యెఁ గానఁ గల దొక్కయుపాయము దీనిఁ మాన్పఁగన్. 149

శా. ప్రారబ్ధాఘపరంపరాదహనకుంభద్రోణికాద్యాప్తికా
ధారాపాతము సంచితోగ్రదురితధ్వాంతచ్ఛటాచ్ఛేదన
ప్రారంభస్ఫుటభాస్కరోదయము ఘోరాగామికాంహోంబుము
గ్వారధ్వంసకలాగవాశుగము మాఘస్నాన ముర్వీశ్వరా. 150

తే. అరుణుఁ డించుక యుదయించు నపుడు గ్రుంకు,లిడఁ బవిత్రులఁ జేయుదు నిలసురాపు
నైనఁ బ్రహ్మఘ్నునైన నటంచు మ్రోయు, నలితదేవత మాఘమాసంబునందు. 151

మ. కలుగున్ స్నానము భాగ్యవంతులకు గంగారంగదుత్తుంగభం
గలసత్పాండిమతోఁ గళిందతనయాకల్లోలమాలానము
జ్జ్వలనైల్యం బెదిరింప గర్భితసరస్వత్యార్ద్రిమాగారంబుతో
నలరం బొల్చు త్రివేణి సార్కమకరోద్యన్మాఘమాసంబునన్. 152

క. కావున మాఘస్నానముఁ, గావింపుము భోగమోక్షఘంటాపథమై
భూవల్లభ సంకల్పఫ,లావాప్తి యొసంగఁజేయు నతిశీఘ్రమునన్. 153

చ. అని మఱియుం దదీయసుకృతాతిశయంబు సవిస్తరంబుగా
వెనుకటిసత్కథల్ దెలుప వీనులవిందుగ నాలకించి మే

లనుచుఁ బురూరవుండు సకలాఘవిభంగకు గంగకుఁ జయం
బనఁ జని మాఘమాసదినముల్ గ్రమియింపుచునుండె నిష్ఠతోన్. 154

క. స్నానంబుల నియమూచు,స్థానంబుల సిద్ధయోగసల్లక్ష్యాహరి
ధ్యానంబుల నానావిధ, దానంబుల హర్షపూరితస్వాంతుండై. 155

వ. ఉండి యొక్కనాఁడు 156

సీ. ఏకాంతవసతిఁ బద్మాసనాసీనుఁడై తనువు బుజూన్నతస్థాయిఁ జేసి
పరఁగఁ బ్రాణాయామపరిశుద్ధిఁ బవను భ్రూమధ్యశృంగాటకాంబరముఁ జేర్చి
శబ్దాదివిషయముల్ సడలి డెందమువాతనిలయనిశ్చలదీపకళికవోల
నేకాగ్రత రహింప నీక్షణంబులు నాసికాగ్రవిన్యస్తంబులై నెలంగ

తే. నాదబిందుకళాస్ఫూర్తి పాదుకొనఁగ, లోను వెలి యనుభేదంబు గానఁబడక
సర్వపరిపూర్ణ మగువిష్ణుశబ్దవాచ్య, సిద్ధవస్తువు ధ్యానంబు సేయుచుండె. 157

శా. ఆయానంద మమందమై యమృతవర్షాసారసంసేచన
ప్రాయంబై లభితస్వపూర్వసుఖసారంబై యనిర్వాచ్యవి
ద్యాయోగానుభవైకమై వెలయ నంతర్జ్యోతి నారాయణుఁ
డీయుక్తం బగునిర్వికల్పకసమాధిం బూని భావింపుచుజన్. 158

క. నియమసమాప్త్యవసానస,మయమున ననిలంబు మొదవిమట్టునకు శనైః
క్రియఁ జేర్చి ముకుళితాక్షి,ద్వయ మల్లన విచ్చి చూచి ధరణిపుఁ డెదుటన్. 159

## తనకుఁ బ్రత్యక్షమైనవిష్ణుని రాజు స్తుతించుట.

సీ. కమలాంచితంబులై కనుపట్టె నయనవక్షోనాభివివరముల్ సొంపుమీఱ
నబ్జారిహితదీప్తతాసమానంబులై వదనహస్తప్రభావాప్తు లమర
ఘనవిరాజద్ద్యుతికలితంబులై శరీరాంబరధ్వజలీల లతిశయిల్ల
సుమనోవిభాసితసుత్యంబులై స్థైర్యపరిపాకమాళిసంపదలు దనర

తే. నపుడు ప్రత్యక్షమయ్యె సుధాంశువంశ, రాజమౌళికి నాదినారాయణుండు
జన్మజన్మాంతరసహస్రసంచితాత్త, సుకృతపరిపాక భాగ్యవిస్ఫురణఁ జేసి. 160

దండకము:— శ్రీమద్రమాభద్ర మాతంగకుంభోపమాన స్తనన్యస్త కస్తూరికా చిత్ర
పత్రాంకురాలంక్రియాం కచ్ఛలోద్భాసియంతః కళంకప్రభాస్తోకరాకాకురం
గాంకబింబాకృతిన్ సారసౌరభ్యధావళ్యపాటీరపంకైకచర్చామిళచ్చారుదోరంతర
స్ఫూర్తి వర్తిల్లఁగాఁ దత్కురంగాంకబింబంబుతో సాహచర్యంబు పాటించు తారా
వళుల్ వోలె ముక్తాఫలోదారహారావళుల్ సొంపుమీఱంగఁ దత్తారకావారకాం

తుల్ ప్రకాశించునవ్వేళ సంఫుల్లదుల్లాసలక్ష్మీ స్వైరాప్తిన్ నీలోత్పలారామమో
నాఁగ నిద్దంపునెమ్మేనినైల్యం బతుల్యస్థితి స్త్రీ ఱ నయ్యుత్పలారామసాంగత్యముం
గాంచు లీలాసుధాసారకాసారమై విగ్రహాకరణ్య లావణ్య సంపత్తి యొప్పారఁ
గాఁ దత్సుధాసార కాసారభాగంబునం దట్టమై తెట్టువల్ గట్టియున్నట్టి సైత్త
ల్మిషన్నెళ్ళభాతిన్ సితంబంబుపై వర్ణితోద్దీర్ణ సౌవర్ణ పీతాంబరా డంబరం బొప్ప
నత్తమ్మిపుప్పొళ్ళ చెంతన్ నితాంతంబు పెంత్తై వెలుంగొందు రంగత్తరంగంబులం
బోలి యొప్పారు నంచద్వళీరేఖ శోభిల్లఁగాఁ దత్తరంగాళిపైఁ బొల్చునె
ద్బాలశైవాల వల్ల్యాకృతిన్ రోమరాజీస్వరూపంబు గన్పట్టఁ దద్బాలశైవాల
వల్లీవిగ్రభాగంబునం దేలి కల్పించు నాకంబుకంబున్ విడంబించు రేఖాత్ర
యీరమ్యకంఠం బతంతద్యుతిన్ గేటువాటింపఁ దత్కూలంబునం దామీప్య దేశంబునన్
మంజు భాషామిషప్రస్రవస్తాకరంపంబుతో లోచనచ్ఛద్మసంఫుల్లపత్త్రాభిరూప్యం
బుతో నొప్పుపద్మంబునన్ సుందరంబైన నెమ్మోము సమ్మోహనశ్రీలఁ దెంపారఁ
దత్పద్మసౌరభ్యపారంపరాస్వాదనాసక్తిపై మూఁగు బత్తేటిమొత్తంబుచందంబుం దలం
పించు నీలంపుఛాయల్ వెదల్ చల్లు నోయాకరంపుం గేశబంధం బహంభావప్రమో
దంబు సంధింప నత్తేఁటి మొత్తంబు నిర్వాంకలన్ లీల గ్రీడించు రాయంచలానంచు
నెంచన్ వినోదించుచున్ గ్రేవలం గేవలంబైన లావణ్య తారుణ్యసంపత్తి ను
ప్పొంగు దివ్యాంగనాశ్రేణి పాణిద్వయీ స్వీచునిస్తుల్యభావజ్ఞ చామరస్తోమ మందం
బునొందంగ నాయంచలంచద్గతి స్థాయునవ్య క్రమాధుర్యధుర్యస్వనంబోయనం జా
మరగ్రాహిణీ హేమరాజన్మణీకంకణక్రేంకృతుల్ పొంకమై మ్రోయఁగాఁ దత్స్వర
ప్రాప్తికిన్ వ్యాప్తివాటిల్లు నజ్ఞాపకంతద్రుమారూఢ హేలాశికవ్రాతకంఠోదితంబైన
యప్పంచమాఖ్యస్వరంబుం బలెం జెంగటన్ వచ్చువైమానికస్త్రీలసంగీతముల్ రంగు
రత్తుల్ వహింపంగ నప్పంచమంబుం బ్రమాణించి యామీఁదటన్ దైవతాంచన్నిషాద
శ్రుతుల్ నింపఁగా లక్ష్యముల్ దెల్పుచందాన హేషావిశేషంబులం బృంహితంబుల్
చెలంగించునుత్తుంగరంగత్తురంగంబులన్ భద్రమాతంగయూథంబులం జక్కఁగా నెక్కి
వెన్వెంట దిక్పాలకశ్రేణి యేతేర నేవంవిధాకారకల్యాంగాదలీలాలసద్వైభవశ్రీలచే
నందమై లోచనానందమై చిత్కళానందమై యొప్పురూపంబుతో నిట్లు ప్రత్యక్షమై
నట్టి యాదేవతాచక్రవర్తిన్ లసద్దివ్యమూర్తిన్ జగద్దేయకీర్తిన్ హృతబ్రాహ్మణార్తిన్
నమద్యోగిబృందున్ దరస్మేరశోభాజితజ్యోత్స్నితాచంద్రముక్తాసుకుందున్ ము
కుందున్ ముకుందాది నానావిధానప్రధానాభిధానాలకానాకముఖ్యస్ఫురద్రత్న
కోటీరరుగ్రాజినీరాజనాభాజనాంఘ్రిద్వయీభాసమానున్ సమానాసమానాంగసౌ

భాగ్యసౌభాగ్యనీలాలకాఫాలకాన్తిరేఖాంకితప్రస్ఫురత్కంబుజిత్కంధరుఁ గంధ
రాక్షేపకృత్కోమలశ్యామలచ్ఛాయికాబంధురుఁ బంధురక్షాకృపామంథరుఁ
మంథరుఁ మంథరగ్రావధారంధరాన్యగ్రహోద్భూత చింతామణిశ్రీసుధాకామధుగ్దే
వతాసింధురుఁ సింధురాజన్య రాజత్తరంగోపరి స్ఫూర్జితాహీంద్ర భోగస్థలానల్ప
తల్పుఁ నిజాకల్పతేజోభిరాముఁ జగత్కల్పనాకౌశలుఁ సిద్ధసంకల్పుసంకల్పసంసి
ద్ధిగాంచుచుఁ జన్మసాఫల్యమయ్యెం గదా నేఁటి కంచుఁ బ్రమోదించుచున్.

తే. అట్లు ప్రత్యక్షమైన రమాధినాథుఁ, గాంచి యానందరససమాక్రాంతహృదయ
కమలుఁడై మేనఁ బులకాంకురములు నిండ, నతులతరభక్తి సాష్టాంగనతు లొనర్చి.

వ. ఇట్లని స్తుతియించె. 163

సీ. భూచక్రధూర్వహ భోగిభోగశయాన యానాయితేనసూతానుజాత
జాతరూపమయప్రశస్తనాభీపద్మ పద్మాలయాలయబాహుమధ్య
మధ్యవిలాసనంపజ్జితమృగరాజ రాజహంసాంబకరాజమాన
మానసదహరశుంభజ్జ్యోతిరాకార కారణోత్పన్నావతారవార

తే. వారణాధీశదైన్యాంధకారసూర్య, సూర్యమండవచస్తుత్యసుప్రభావ
భావభవకోటిసుందరశ్రీవిచిత్ర, చిత్రకాయమహాసురామిత్రమిత్ర. 164

సీ. తరుణేందుధరమిత్ర దానవసీచైత్ర కమలాకళత్ర జగత్పవిత్ర
భరితమంథరగోత్ర భ్రాజితాయుతమిత్ర రక్షితాదితిపుత్ర రమ్యగాత్ర
శయనీయవటపత్ర సౌవర్ణనేత్ర పాపలతాలవిత్ర దోర్బలవిచిత్ర
పోషితవైధాత్ర భువనహితక్షాత్ర పరిహృతభవగోత్ర వరచరిత్ర

తే. వికసితశ్వేతశతపత్ర విమలనేత్ర, చండభండనభూజైత్ర దండయాత్ర
నిగమశాస్త్రాగమస్తోత్ర నికరపాత్ర, యంబకశ్రోత్రరాజఫణాతపత్ర. 165

పాదభ్రమకకందము:—

దానవజలేజవనదా, భానుతతవిభాకరైక భావితతను భా
మానాథ వివిధనామా, యానసరసహారహీరహాసరసనయా. 166

ఓష్ఠ్యకందము:—

ప్రాపై మాపైఁ బ్రేమఁ, మాపాపముఁ బాపి ప్రోవుమా మము భవ్యా
భ్రోపమ్యభావిభావా, భూపా భ్రూవిభ్రమాప్రభూపా మాపా. 167

నిరోష్ఠ్యమహాస్రగ్ధర:—

కరఖేలచ్చక్రధారాఖరకరకరనిర్ఖండితోద్దండచండా
సురరాట్చక్రాంధకారశ్రుతితురగజటాజూటరంగత్తరంగో

క్షీరగంగానిర్ఝరాకరచరణచరణాక్రాంతనాంచితస్థలాశో
ద్ధురకాంతిచ్ఛన్నగోత్రాద్యదకధరోయుక్తరాజత్కిరీటా. 168

ద్వ్యక్షరకందము:—

మామామనీన నేమా, నేమమున నమానమామము నిమ్నెన్నను నా
నామునిమనోన్మనిమన, నామనమున నిమ్మినాను నన్నోమ్ముమునా. 169

కందము - గోమూత్రికాబంధము:—

మురహరసుఖకరలీలా, పరమకృపాధామ విజయభామాసారా
పురహరసఖ సురపాలా, వరసుకృతాధార వినయవాసఖరా. 170

నాగబంధము - చంపకము:—

జలరుహనాభ కేశవధరసారసగర్భసమేతవైభవా
సలలితరూపకేల ఖలజాలహరప్రభభూరిభోగదా
విలసితపావనశైలధరధీరవరద్విపమోహవారణా
జ్వలదరివాసఖేలకరసారశుభప్రదనీలవారణా. 171

ఛత్రబంధము - కందము:—

ధీరవరద సామరనుత, సారసనయన యెనయైనసరణి మకరహా
హారకమణిరదసురసా, సారసుదరసారసురమసారదవరదా. 172

స్రగ్ధర - అష్టదళపద్మబంధము:—

హారీనిష్ఠావిబల్యాద్యభినుతసమరోగ్రాఘసుశ్రీవరాహా
హారావశ్రీసుఖగ్రాహకరదిముఖరాల్యావనస్థాసురీహా
హారీసుస్థానవల్యాయశవినసమగ్రాటకప్రాక్షరోహా
హారోక్షప్రాకటగ్రాహ్యాసితయశసకల్యాబలిష్ఠానికీహా. 173

చక్రబంధము - శార్దూలము:—

వక్షశ్రీమణిసుప్రదీప్తమనసేవ్యా యచ్ఛనీలాంగదా
యక్షాగోచర కన్దానంగ మతి భాగ్యంబబ్బె నాక్షిప్త పే
దక్షోపాధిః బవిత్రుఁజేయు మనువొందన్ నన్నాతంకదా
దాక్షిణ్యావహ గేయ నాకు దరియుం దా వాక్యసీవేకదా. 174

సర్వతోభద్రబంధశ్లోకము:—

నభోగోదదగోభోన, భోప్రమాక్షక్షమాప్రభో
గోమాశయాయాశమాగో, దక్షయానననయాక్షద. 175

ఆంధ్రగీర్వాణ భాషాశ్లేషకందము:—

దేవరమే లారసికా, యేవరసస్మానకమది సేననయము నీ
తావమరుస్నాకదనం, దావాలాయమనుమాట దప్పువినవయా. 176

కందద్వయరుగ్మవతీ కమలవిలసిత గర్భక్రౌంచపదవృత్తము:—

శ్రీమహిమానిశ్రేయససీమా చిరశుభకరవిలసితగుణఖేలా
సామజసంరక్షానుతసామా సరసిజభవసురసముదయపాలా
తామరసాప్తస్థానకధామా దరసినదచకితదనుసుతజాలా
తామసదూరా ధామసుధామా తరుణసజలజలధరనిభనీలా. 177

ఆపద్యములోనే గర్భకందము:—

శ్రీమహిమానిశ్రేయస, సీమాచిరశుభకరవిలసితగుణఖేలా
సామజసంరక్షానుత, సామాసరసిజభవసురసముదయపాలా. 178

ద్వితీయకందము:—

తామరసాప్తస్థానక, ధామా దరసినదచకితదనుసుతజాలా
తామసదూరా ధామసు,ధామాతరుణసజలజలధరనిభనీలా. 179

ఆపద్యములోనే గర్భరుగ్మవతీవృత్తము:—

శ్రీమహిమానిశ్రేయససీమా, సామజసంరక్షానుతసామా
తామరసాప్తస్థానకధామా, తామసదూరా ధామసుధామా. 180

ఆపద్యములో గర్భకమలవిలసితము:—

చిరశుభకరవిలసితగుణఖేలా, సరసిజభవసురసముదయపాలా
దరసినదచకితదనుసుతఖేలా, తరుణసజలజలధరణిభనీలా. 181

మ. అజరుద్రాదులు మిమ్మెఱింగి నుతిసేయన్ లేరు నేనెంతవాఁ
డ జగద్రక్షణదక్ష నిన్నుఁగొనియాడ న్నిస్వభావంబు దా
సజనానుగ్రహాపేక్షితం బగుట నాజన్మంబు సాఫల్యమం
ద జడుండంచు నిరాకరింపక ప్రసన్నుండౌట సర్వేశ్వరా. 182

చ. అని వినుతించురాజుఁ గరుణామృతశీతలదృష్టిఁ జూచి యి
ట్లను మదుపాస్తిసిద్ధి ననఘాత్ముఁడవైతివి గాన వంశపా
వన నినుగారవింప నిటవచ్చితి మెచ్చితి నిచ్చితిన్ మనం
బునఁ గలకోర్కులెల్లఁ బరిపూర్ణసుఖంబున నుండు నెమ్మదిన్. 183

తే. అనుచు నిజపాంచజన్యగర్భామృతంబు, తనువుపైఁ జల్లి దోషముల్ దలఁగఁజేసి
పలికె వెండియు శ్రితపారిజాత, మారమాభర్త సౌమ్యకుమారుతోడ. 181

శా. వైవర్ణ్యంబు దొలంగె వాడకకళాస్వచ్ఛంబు మేఁబోవము
శ్రీవర్తిల్లెను నీదుమోము మనసా శ్లేషించు సౌందర్యలీ
లావిస్ఫూర్తి యొసంగు దివ్యవరితాలాభంబు గల్గున్ సుపు
త్రావాప్త్యాది ఘటించు నేలుము యనేకాబ్దంబు లీరాజ్యమున్. 182

క. తుదిఁ దనపాయమహాసుఖ, సదనం బగుమత్పదమున సంతసమున నుం
డెద వంచు చానతిచ్చి ప్ర, మదమున వెంచేసె మరలి మాధవుఁ డంతన్. 183

శా. ఆచక్రాంచన మాదయాకసపుఁ జూపాకోమలస్మేర మా
వాచామాధురి యాపిపర్తిసకళత్వం బాత్మలోఁ గొంచుచున్
భూచక్రేశ్వరుఁ డేగె నంతఁ బురహర్మ్యాభ్యంతరాసీకర
త్నాచింతామణిగా యటంచు సముదాశ్చర్యంబుతో పీటికిన్. 184

క. తనరాకను రాకను జంద్రు నిరాకను బొందునమృతతోయధిగతి నూ
తనశృంగారరసోన్నతి, వినుతింపఁగ నొప్పుపురి ప్రవేశించి తగన్. 185

తే. అన్నరేంద్రుండు రాజ్యభోగానుభూతి, దల్లమున దల్లసిల్లుచు నుండె ననుచుఁ
బలుకఁ దరువాతికథ వచనప్రాప్తిఁ దెలుప, మరి మునీంద్రులు సంప్రీతి నడుగుటయును.

పుష్పమాలికాబంధము: చంపకము:—
శమదమధామమానస లసత్సురవావృతనూతనాతసీ
సుమసమకోమలాంగ శుచిశుభ్రశుభాకరధీరసారకీ
ర్తిమహిమ సామగేయకృతకృత్య కృపానిధి రాధికాధిపా
సమదమహామురారిచరచక్రచరాచరవారధారణా. 187

ఖడ్గబంధము: కందము:—
పీనఘనదానకనకన, పీనమణిస్థగితమకుట విజయోదోగ్రా
గానకళాద్భుతదనుభూ, గానతపదకమలసజ్జనాముత్తమనగా. 188

గోమూత్రికాబంధము: ఉత్సాహము:—
తారహారహీరభూరిధామకీర్తికారణా
చారుశైల్యసాంద్రదేహచైత్రకార్యఖేలనా
క్రూరవారవీరవైరిగోమహార్తివారణా
మేరుతుల్యవీంద్రవాహమిత్రకావ్యపాలనా. 189

గద్య. ఇది శ్రీమంగళాచల నృసింహకృపాప్రసాద సంప్రాప్త విద్యావైభవ కనుపర్తి రామనమంత్రితనూభవ సుజనహితకృత్య నిత్య అబ్బయామాత్యప్రణీతం బయిన కవిరాజమనోరంజనం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

# పంచమాశ్వాసము.





హరినీలసముజ్జ్వల
దేహద్యుతిజాల వినతదిక్పాలచతు
ర్వ్యూహస్ఫుటలీలజగ
న్మోహన గోపాలరణితమురళీలోలా. 1

వ. అవధరింపుము సమస్తసద్గుణసాంద్రు లగుశౌనకాదిమునీంద్రులకు సామోదహృదయజలజాతుండై సూతుం డిట్లనియె నట నూర్వశీసౌగంధికగంధి యవ్వసుంధరారమణుసంబంధంబునకై సంధిల్లుప్రేమబంధంబున నంతంతకు నగ్గలించుచు నంతచింతాభరపరిశ్రాంతి నెంతయు నలసి సొలసి బాహులతాద్వయావలంబితాంసభాగోభయపార్శ్వగతప్రాణసఖీయుగళాధీనశరీరయై యపాటవమాంద్యగమనంబున వనాంతరంబులఁ బరిభ్రమించుచు హృదయాంతరాళంబున ననస్తమితస్థితివశ్రాంతప్రకాశమానంబై తపింపజేయు విప్రలంభప్రద్యోతనద్యోతంముద్యమంబువలనం గాలనిరూపణంబు దెలియక నిమేషంబులు మాసంబులుగా గ్రహింపుచు నకలంకమీనాంకబిరుదాంకగీతికలు నిశ్శంక నంకించి పొంకంబుగాఁ బలుకుచిలుక గోరువంక కోయిలమూఁకల కలకలంబుల కులుకుచు వికసితకుసుమవిసరపరిచ్యుతపరాగపటలసాంద్రస్థలంబులు నిదాఘమధ్యందినాతపతప్తసికతాతలంబులుగా నడుగిడ నలుకుచు మరందంబులకై ముసరుమిళిందమ్ముల నందమ్ములై యమందపరిమళానందకందమ్ము లగుకెందమ్ములం దనరు నరవిందాకరబృందమ్ములగు చందమ్ములం గని సధూమాంగారకుండమ్ములుగా విచారించి తొలంగుచు మరుత్పరంపరాకంపమానవిశాలరసాలసాలప్రవాళజాలలీలాఖేలనంబులు శంబరాంతకుండు శాంబరీవిడంబనంబున బహుముఖంబుల జళిపించు కౌక్షేయకవిక్షేపంబులుగాఁ దలంచి కలంగుచుఁ దిరిగి తిరిగి వింధ్యపర్వతప్రాంతంబునఁ జైత్రరథోపమానం బగునొక్కవిచిత్రోద్యానంబు చేరి భద్రోపమానస్వచ్ఛతరచ్ఛాయాతరుచ్ఛాయాతలంబునం గూర్చుండి

నిట్టూర్పులు నిగుడించుచు నాందోళితమానసయై యిట్లని వితర్కించె. 2

ఉ. ఆనరనాథచంద్రు విషమాగమసిద్ధికి నింద్రు పంపు భా
గ్యానుగుణంబుగాఁగ హృదయంబున నమ్మెటువచ్చి వాసి మో
మైనను జూడనైతి నకటా వికటాప్తశంబరాహితా
నూనవరూథినీకలకలోద్ధతి కెవ్విధి నోర్తు దైవమా. 3

చ. వలచితినంచుఁ బోయి జనవల్లభు నేనయి పల్కరించినం
బులకదనంబు గాదె ననుఁ జూచి యనాదరణంబు సేసినన్
నిలుచుటయెట్లు ప్రాణములు నేర్పున నాపయిఁ బ్రేమ వానికిం
గలుగఁగఁజేసి కూర్చుచుపకారులు నాకిఁక నెవ్వ రక్కటా. 4

క. మనసిజ్యుక యలయించుచు, దనువలచినరంభనైనఁ దావలచినచోఁ
జెనఁటికినైనను వశుఁడై, చనువిచ్చును బురుషుఁ డెంతసరసుండైనన్. 5

శా. సౌందర్యంబును యౌవనంబు సిరియున్ సారస్యమున్ వైభవా
నందంబుం గలనాయకుండు వశుఁడై నైసర్గికప్రేమయా
ప్పం దాఁజైకొని నర్మమర్మవచనోపశ్లేషపుంభావయా
చ్ఞం దన్ వేఁడ రమింపఁగల్గుట గదా సౌఖ్యంబు వామాక్షికిన్. 6

క. సరివలపులైన కూటమి, సరసంబై సుఖమొసంగు జవ్వని కైనం
బురుషునికైనను గూరిమి, యరగొఱఁదగు కలయి కది నిరర్థక మరయన్. 7

ఉ. ఇక్కడి కేల వచ్చు జగదేకనిజాతపవారణాబ్జస
మ్యక్కిరణాపరూపితసమస్తదిగంతనృపాతపత్రవిభుం
డక్కుసుమాస్త్రమోహనశుభాంగుఁడు వచ్చిన వచ్చుఁగాక నా
యక్కఱ వానికేటి కరుదా యొలజవ్వను లంతవానికిన్. 8

వ. అని తలంచి నిట్టూర్పు నిగిడించుచు. 9

తే. ముందు విరహాగ్నిసంతాప మందుచున్న, యపుడకారణబంధుఁడై యరుగుదెంచి
సరసహితవాక్సుధాధారఁ జల్లఁజేసి, నట్టిశుకవాణి నీకఁ గాంచు టెట్టొ యనుచు. 10

క. కాంచనగాత్రి తలంచిన, యించుకతడవునకు శుక మహీనాథుకమై
చంచలగరుదంచలమరు, దంచితరవమెసఁగఁ దోఁచె నంబరవీథిన్. 11

శా. రాకారమ్యనిశాకరోదయమునన్ రంజిల్లునీలోత్పలా
నీకంబుం బలెఁ దద్విలోకనసముత్సేకంబులై సాద్భుత
వ్యాకోచస్థితి నేత్రముల్ మెఱయఁగా నాళీకదంబంబు నా
ళీకాభాస్యయుఁ బూర్వసౌహృదయనాళీకాంతరంగంబులన్. 12

క. ఉత్కంఠాతిశయంబుల, నుత్కంఠాభిముఖు లగుచు నుకుంపోదయనం
దత్కైరవదళనయనలు, దత్కైరవరాగ మనుసుదర్శనపరతన్. 13

వ. ఉన్నంత. 14

సీ. భగవత్కథానులాపప్రసంగతఁ దనశుకనామము మహార్థశోభితముగ
వైమానికుల చెప్పవడనికన్నులు తనతనులీలఁ జూచి సార్థకమునొంద
నరవిందరాగరాగాననద్యుతి తనకరుణారసవ్యాప్తిగతి వెలుంగఁ
జాంచల్యరహితవీక్షావిలాసము తనగాంభీర్యగుణసూచకంబుగాఁగఁ

తే. జిలుకతేఁడు నభోంతరసీమనుండి, డిగ్గి చనుదెంచి ప్రాలెఁ బటీరగంధు
లున్నవనిశాఖిశాఖపై నొఱపుమేని, పసిమిగారుడమణిపరంపరలనీన. 15

వ. అప్పుడు. 16

ఉ. పెన్నిధిఁ గన్నపేదగతిఁ బెంపున నుర్వశి హర్షసారసం
పన్నవికాసమానముఖపంకజయై తగలేచి మ్రొక్కినన్
మన్ననతో శుభం బొసఁగుమాటల దీవనలిచ్చి కెంపురా
వన్నియ మోముపుల్గు మృదువాక్షణితిం జెలితోడ నిట్లనున్. 17

క. నీలాలక చాలింబడ, నేలా యిఁక నీదుకోర్కి లీడేరఁగ భూ
పాలావతంస మిచటికి, వాలాయము వచ్చు మేలువాఁ డగునీకున్. 18

వ. మఱి యొకయుపాయం బెఱింగించెద సకలావయవసంపూర్ణసరససౌందర్యసౌభాగ్య
సముదారంబగునీయాకారంబు పటంబున స్ఫుటంబుగా వ్రాయించి యారూపంబప్పు
రూరవునికిన్ దృగ్గోచరం బగునట్లుచేసినం బ్రేమాంకురం బతనిహృదయంబున నుద
యంబై పూర్వానురాగనిదానం బగునాగమిష్యమాణవసంతసమయంబుననమ్మహీకాం
తుండు వనాంతరంబునకువిహారోత్సుకస్వాంతుండై యేతెంచి నిన్నుఁ గాంచి
శోభావైభవ పరాభూతచంచలంబులగుతావకదృగంచలంబులకు సహాయంబుగా
విజృంభించి జళిపించు నించువిలుతుని ఖడ్గాంచలధగద్ధగలచే సంచలితమానసుండై
నీతోడికూటమి వాటించు ననేకసమవేకసమం బగుస్నేహమోహంబులఁ గ్రీడిం
చెద రని చెదరనిమనస్తాపంబు దీఱనాడించి యారాజకీరంబు ముదితాముదితవా
రంబై మేఘద్వారంబుననుండిన ప్రచారంబున నరిగెఁ దదనంతరంబ శిల్పకళావిశేషం
బున వలంతియగు బొలంతియొక్కతె యన్నెలంతరూపంబు శృంగారరసానురూపకం
బుగా లిఖయించి యవ్విచిత్రపటంబు గైకొని నిజమాయాబలంబుల నెవ్వరు నెఱుంగ
కుండ నమ్మహీజానిరాజధాని యుపాంతంబున భూకాంతునివిహారస్థానం బగునుద్యా

వంబునం జేసి తదంతర్విరచితకనకమణిఖచితకేళీగృహద్వారపార్శ్వభాగమృగాంక
శిలామయవితర్దికాపరిస్థలంబునకు నూతనాలంకారంబుగాఁ బరియతకపేయకుడ్యంబా
ధారంబుగా నిలిపి చనియె నంత. 19

క. వనపాలకు లప్పటమ్ముం, గని యాకారాంబునఁ బతిరుగల ప్రతిమల నెం
దును జూడ మీఁద కెవ్వఁడు, గొనివచ్చెరొ మదికి వెఱఁగుగొలిపెడు మిగులన్. 20

క. పిలికకుఁ గాఁచుకుత్తము, చాలన్ బయపేయు నచుచు సరసముగంధ
శ్రీలెసఁగు విరులు కోసి ప్రవాళపుటంబులను బోడిచి పఱలెడం వేడ్కన్. 21

తే. చిత్రపటపూర్వకముగ విచిత్రపుష్ప, పత్రపుటములు గొనివచ్చి ప్రభునిసన్ని
ధానమునఁ బెట్టి మ్రొక్కిన దద్విలాస,మునకు నరుదంది యొక్కఁడి పనుచు నడుగ.

ఆ. సామి వాకిటతోఁటలో మిద్దెముంగలి, యరఁగుమీఁద నుండె నాడ కెవఁడు
దెచ్చిపెట్టినాఁడొ దేవరా యెఱుఁగము, కానరాదు వింతమానిసఁడుగు. 23

క. అని జాతీయపుమాటలు, తనతో నాడంగ మొగముదమ్మిఁ దదాక
ర్ణనహాస్యరసముఁ జిత్రముఁ,గనుఁగొను నద్భుతరసంబుఁ గలసివెలుంగన్. 24

వ. ఉద్యానపాలకుల నుచితవస్తుప్రదానంబుల నాదరించి వనావనక్రియకు నాజ్ఞాపించి
పనిచి క్రమ్మఱ నప్పటం బభిముఖంబుగా నునుచుకొని యద్దివ్యవిలాసినీరూపంబు
సాపేక్షవీక్షణంబుల నుపలక్షించుచు. 25

ఉ. క్రమ్మఱఁ గ్రమ్మఱ న్విభుఁడు గన్గొనుఁ దచ్చరణాంగుళీప్రపా
దమ్ములు జానుజంఘలు నితంబము నాభ్యుదరావలగ్నపా
ర్శ్వమ్ములు వెన్నుఁజన్నులుఁ గరంబులుఁ గంఠము మోవిఁ జెక్కులా
స్యమ్మును ముక్కుఁ జూపు బొమలాచెవులా నుదు రా ప్రవేణియున్. 26

ఉ. చూడఁగఁ జూడఁగా మదికిఁ జొక్కుదవన్ భ్రమఁ జెంది నిక్కపుం
జేడియఁగాఁ దలంచి యెదఁ జేర్చుకొనం దమకించు నేలమా
టాడవు కోమలీ యని ప్రియంబునఁ బల్కఁదలంచు నారతి
క్రీడల మంత్రవాది యొనరించిన శాంబరియందు మగ్నుఁడై. 27

వ. ఇట్లని తలంచు. 28

ఉ. ఎవ్వతెరూప మొక్కొ యిది యింతవిచిత్రవిలాసరేఖ మే
జవ్వనులందుఁ జూడ మిది చక్కఁదనంబులఁ గుమ్మ కాముచే
క్రొవ్విరితూపు రత్నములకుప్ప మెఱుంగులతేటఁ బ్రొప్పు హా
యవ్వనజాతలోచన నిజాకృతిఁ జూచునుపాయ మెద్దియో. 29

క. ఎవ్వనికి వలచునో యెల, జవ్వని తద్రూపలిఖితచారుపటం బె
ట్లవ్వనిఁ జేరెనొ హరుచే, నొవ్వనిమరుశక్తి యనిఁ జనుంగద దానిన్. 30

చ. అరయఁగ నాలతాంగి లిఖితాంగ మచేతనమయ్యు డెందముల్
గరఁగఁగ జేయుచున్నయది కన్గొనినంతనె హంసయానముల్
సరసమృదూక్తులుం గులుకుచల్లెడుచూపులు గల్గియొప్పు న
త్తరుణిసచేతనాంగము నెవంగదియించిన సౌఖ్య మెట్టిదో. 31

వ. అని యనేకప్రకారంబుల మదనవికారం బొదవించువిచారంబున నక్కాంతవృత్తాం
తంబు దెలియుటకై వితర్కించుచు. 32

సీ. పటముచెంత నయో సుపర్వాంగనోత్తమా యని వ్రాసియున్నదివ్యలిపివలన
క్షితిపకన్యాశ్రేష్ఠ చిత్రసంగతిపటం బునుప విచిత్రమై యుంటవలన
జనలోకశిల్పకుల్ గసి నిర్జరీలేఖ యనినిశ్చయించినయందువలనఁ
బ్రాసంగికమున నారదుఁడు మున్నప్సరోజనము వర్ణించి పేర్కొనుటవలన
తే. భావిసంబంధమున కభిప్రాయమైన, తలఁపుగోలుపు ఋణానుబంధంబువలన
నతనిమదిదోఁచెఁ దచ్చిత్రితాంగలీల, యుర్వశీకాంతరూపు గానోపుననుచు. 33

క. ఏరీతినయిన నాలల, నారత్నముతోడి పొందొనర్పవలయు నం
చారాజశేఖరుఁడు మది, నారనితమి సాత్త్వికోదయముగా నుండెన్. 34

క. అంత నతాంతనితాంతల, తాంతవనాంతర్నిశాంతహరిదంతసమా
క్రాంతరవకాంతముదితా, నంతశకుంతము వసంత మాగతమయ్యెన్. 35

## వసంతఋతువర్ణనము.

తే. ప్రాదశమ్ములన్ మలినాంబరమ్ము విడిచి, కట్టెఁ గెందలిరాకుచెంగావివలువ
వనరమాదేవి మాధవస్వామిరాక, కపుడు వాసకసజ్జిక యగుటఁ జేసి. 36

సీ. తలిరుజొంపము పేరఁ బులకాంకురము లూనుఁ బువ్వులపేర లేనవ్వునవ్వు
నలరుఁదేనియ పేర హర్షాశ్రువులు నించు నళిపాళి పేరఁ గొప్పులవరించుఁ
బుప్పొడిపేర సొంపుగ గందవొడిపూయుఁ జిల్కపల్కులపేరఁ జెలులఁజీరు
ఫలరాజిపేర దీప్తమణిభూషలుదాల్చుఁ బరభృతధ్వనిపేరఁ బాటపాడుఁ
తే. జిరసమాగతమాధవవరసమాగ, మోదితావ్యాహతౌత్సుక్యమున వనీర
మారమణి మేలుపడినకోమలులచేష్ట, లట్టులౌఁగద ప్రాణనాయకులయెడల. 37

ఉ. నూతనపుష్పితక్రమమనోహరయావనరేఖఁ బల్లవ
వ్రాతము గూడి కొమ్మలు విరాజితలీల నెసంగునత్తటిన్

నూతనపుష్పితక్రమమనోహరయౌవనరేఖఁ బల్లవ
వ్రాతముఁ గూడఁ గొమ్మలు విరాజితలీల నెసంగి రెంతయున్. 38

క. అమరె వసంతత్యాగము, లమితములై ప్రకృతికి నభిమతఫలముల్
సుమహితపారాశనముల్, క్రమమున నధ్యాగతాళులకు నొనగూడన్. 39

శా. కాలజ్ఞానవచోద్విజప్రకరతి వేడ్కం బుష్పవద్గణ్యన
వ్వేళం గాంచి కుహూకుహూర్తిఁ బలికెన్ వేకృష్ణపక్షస్థితిన్
లాలిత్యాకృతి యొప్ప శ్రుత్యనుగతిన్ నానావనీసీమలం
బ్రాలేయద్యుతిరేఖ నష్టమగునప్పట్టున్ యథార్థంబుగన్. 40

సీ. మాధవాగమనసంభ్రమరణత్తూర్యముల్ వనరమాకంకణక్వాణనములు
శంబరాంతకవందిజయశబ్దములు పాంథకాంతాప్రలాపస్వయామంతునములు
దంపతీమానసంస్తంభనమంత్రముల్ పంచమశ్రుతితంత్రిబోధనములు
బాలికాగణనాదపానరుక్తములు భృంగాంగనాగీతికోపాంగకములు

తే. వల్లికానర్తకీనాట్యవాదనములు, నగశతాంగాగ్రఘంటాఘణంఘణములు
రసికమానసాహ్వానపారంపరములు, చెలఁగెఁ గలకంఠకంఠకూజితము లపుడు. 41

మ. లతకూనల్ గనుఁజెంపుమీఱి బుతువేళాపుంరతిక్రీడ సం
తతిగల్గన్ ఫలగర్భభారములఁ జెంపంబోలుఁ గానన్న లం
బితరోలంబకదంబకేలిమము గన్పింపం గనంబేమి న
వ్యతరాంతర్మకరందదుగ్ధసుమగుచ్ఛాంచత్కుచాగ్రంబులన్. 42

ఉ. ఈచిగురాకువంటిది సుమీ తనప్రేయసిమోవి యంచుఁ బ
ల్లూచినమాధవీలతికపోలికగా చెలియంగమంచు నే
రాచిలుకన్ జయించుఁగద రామవచోగతి యంచు పద్యముల్
చూచి వధూటులం దలఁచి సొక్కుచు నుందురు పాంథులత్తఱిన్. 43

సీ. తనుసుఖంబిచ్చు శీతలతరుచ్ఛాయావిశేషముల్ బాలికాశ్లేషములుచు
వీక్షణప్రీతిగావించు జాంబీరసమాజముల్ యువతివక్షోజములును
గర్ణపర్వమొనర్చు కలరవాదికకంఠరణితముల్ మదవతీమణితములును
ఘ్రాణతృప్తియొసంగు ఘనపుష్పసురభిసంబంధముల్ వనితాస్యగంధములుచు

తే. నాలుకకు నింపుపుట్టించు నవఫలరస, పూరములు యౌవతాధరసారములును
సరసులకు నిట్టు లవ్వనుల్ జవ్వనులును, జేయువేడ్కలు వింతలై చెల్లెనపుడు. 44

సీ. తాళీఫలస్ఫూర్తిఁ దనరెడువీఁగుఁజన్గొండల జవజవల్ మెండుకొనఁగ
నాయముల్ గరఁగంగ నాడునర్మోక్తిహెచ్చరికల గుసగుసల్ సందడింప

నోరుచెక్కు టనటు నొక్కుచు బడిబడి నిడుచుంబనముల చప్పుడు చెలంగ
సమరతిప్రతివేగసంపూర్తికై చేయు సచపేటహుంకృతిస్వనము లడర
తే. వయసు గడుసుదనంబున వర్తమాన, కాలమహిమను సిగ్గుసిగ్గరితనంబు
దాల్పఁగఁ బ్రగల్భ లంగజోద్ధతి రమింపు, సొంపుమధువేళ భోగుల కింపొనర్చె. 45

శా. పన్నీటం జలకం బమర్చి చలువల్ పైఁదాల్పఁగా నిచ్చి ద
ధ్యన్నాహారము గంధలేపము విరుల్ తాంబూలముల్ సొంపుమీ
ఱ న్నవ్యవ్యజనాతపత్రచరణత్రాణాదులన్ భాగ్యసం
పన్నుల్ విప్రుల కర్చగా నొసఁగి రవ్వైశాఖమాసంబునన్. 46

వ. అట్టి వసంతకాలంబునందు. 47

చ. ఘనుఁడు పురూరవుండు త్రిజగత్పరిపూరితకీర్తి రాజ్యపా
లన మొనరింపుచుం దనకలంపున నుర్వశిచిత్రరూపభా
వనప్రతిబింబశక్తియొదవంగఁ దదీయనిసర్గరూపవ
ర్ణనమునకై యుపాయము విచారము సేయుచునుండె నయ్యెడన్. 48

మ. ఒకనాఁ డానృపశేఖరుండు తపనీయోద్యత్సభామండపా
ధికశోభామణిభద్రపీఠమున నుద్దీప్తిన్ సుఖాసీనుఁడై
సకలామాత్యసుహృత్పురోహితవయస్యప్రౌఢవిద్వత్కవీం
ద్రకళావన్వనితాద్యనేకపరివారస్ఫూర్తి వర్తిల్లఁగన్. 49

క. పేరోలగమున నుండఁగఁ, జారులు దేశాంతరములఁ జరియించి రయం
బారఁ జనుదెంచి మ్రొక్కిన, వారల మన్నించి మనుజవల్లభుఁ డెలమిన్. 50

## చారులు పురూరవునకు విచిత్రవనవృత్తాంతముం దెల్పుట.

వ. లోకవార్తావిశేషసంశ్రవణకుతూహలసూచనాలక్షణంబు లయినకటాక్షవీక్షణంబు లం గనుంగొనిన నయ్యింగితం బెఱింగి పునఃప్రణామం బాచరించి వినయవచనచమత్కారు లయినచారు లిట్లని విన్నవించిరి. 51

క. భూవల్లభ కురుకోసల, సౌవీరవరాటలాటసౌరాష్ట్రకళిం
గావంతివిషయనగరీ, నీవృచ్ఛయవార్త లరసి నీసన్నిధికిన్. 52

ఉ. వచ్చితి మోనృపాలక భవత్పరిపాలనధర్మ మెట్టిదో
యెచ్చటఁ జూచినన్ బ్రజ లభీష్టపదార్థసమృద్ధిసౌఖ్యముల్
నిచ్చలు గాంచి పుణ్యము లనేకవిధంబుల నాచరింపుచున్
సచ్చరితస్థితిన్ మెలఁగుచందము కన్నులపండు వయ్యెడున్. 53

క. విని నిలిచి మఱియు నాలిం,చిన వీనుల సోఁకె నమృతశీతలమధుర
స్వనవాగ్వైఖరి వనితా,జనసంచారప్రకారసంసూచక మై. 63

వ. అట్లాలించి. 64

చ. ఇది విజనస్థలం బిచట నిట్లు మెలంగెడువారు దేవతా
సుదతులొ రాజకన్యకలొ చూచినఁ దప్పగునేమొ యంచు మా
హృదయములందు శంక జనియించిన నవ్వలఁబోక క్రమ్మఱన్
మొదలిటి త్రోవఁబట్టి వనముల్ నగముల్ పురముల్ గ్రమించుచున్. 65

క. దేవరసందర్శనమునకై వచ్చితి మఱచుఁ బలుక నవనీరమణుం
డావనము చూచువేడుక, భావంబునఁ బొడమ నటకుఁ బయనంబయ్యెన్. 66

శా. తప్తస్వర్ణసువర్ణరత్నఘృణిసాంద్రంబై మరుద్వేగవ
త్సప్తిస్ఫూర్జితమై ఘణంఘణరవాంచద్ఘంటికాబద్ధమై
వ్యాప్తోదారవిభాగజాహితపతాకౌన్నత్యమైయొప్పు న
ద్దీప్తస్యందనమెక్కి భూషణమణీదేదీప్యమానాంగుఁడై. 67

## పురూరవుఁడు చిత్రవనముం జూడనేగుట.

క. చారులు చూపుపథంబునఁ, జారుతరాటోపచతురచతురంగయుతిన్
స్వారివెడలె నమ్రశిర,స్స్వారి పురూరవుఁడు వైభవాడంబరుఁడై. 68

వ. అప్పుడు. 69

ఉ. కోమలగంధవాహ మనుకూలగతిం బ్రసరించెఁ బుణ్యకాం
తామణిపూర్ణకుంభయుగ ఘాతమహాలఫలప్రసూనము
శ్యామలవస్తుపుంజ మెదురయ్యె సువర్ణపయోవిహంగముల్
వామదిశాగతిన్ మెలఁగె పల్లభుచుల్లను పల్లవింపఁగన్. 70

వ. అట్లు చనిచని పురోభాగంబున. 71

చ. సకలధరాధురంధరభుజాభుజగేంద్రుఁ డతండు గాంచె హా
టకతటకూటకోటినికటప్రకటభ్రమరాంబుభృద్వితా
నకశకలప్రకాండమహానాగమానద్విపయూథనిగ్రహో
త్సుకజవనోత్పతద్ధరికిశోరవిశాలము వింధ్యశైలమున్. 72

తే. కాంచి యంచితమోదవికాసమాన,మానసాంభోజుఁడై యసమానలీల
మానవేంద్రశిరోమణి మఱియు మఱియుఁ,దద్విశేషావలోకితోత్సాహమునను. 73

సీ. కరిణీకరోత్కీర్ణఝరిణీకసిక్తాభ్రచరిణీకుచోపరిచ్ఛన్నశాటి
జలజాతరాగాద్యుపలజాతమయపరిష్కలజాతలప్రభాసాంద్రమూర్తి
నటనాధిగతశిఖిస్ఫుటనాదహృదయసంఘటనార్తతాబిలంగతభుజంగి
శిఖరాంతరప్రయాణఖరాంశుసాన్నిధ్యసుఖకరాజితాబ్జినీస్ఫురితసరసి
తే. కిసలయఫలలసదసమకుసుమవిసర,సరసతరకరకరసవిహరణపరపరభృత
నికరమధుకరకలరవశుకకులముఖ, విహగముఖరవముఖరి యవ్వింధ్యశిఖరి. 74

మ. అని వర్ణింపుచు నవ్విభుండు తదగప్రాంతాటవీపద్ధతిం
జనియెన్ మేఖలకన్యకాతటవతీసంఫుల్లసౌగంధికా
భినవాంభోజపరాగసౌరభమిళత్ప్రేంఖత్తరంగోక్షమ
గ్ననితాంతాగతశైత్యమాంద్యపవమానస్పర్శజానందుఁడై. 75

తే. ఇవ్విధంబున నవ్విభుం డేగి యెదుటఁ, గాంచె నవమల్లికావల్లికామతల్లి
కావలీనర్తనోపదేష్టాయమాన,మృదుపవనమై వెలింగెడు తదుపవనము. 76

వ. కాంచి హృదయంబున నుదయం బగుపేక్షణాపేక్ష నాక్షమావల్లభుండు శతాంగావతరణంబు చేసి నిజబలంబు నచ్చట నిలువ నియమించి మృదులతరపాదుకాకలితపదకమలుండై సమానవయస్కుండును సమానగుణసంపన్నుండును నతిప్రియసఖుండును నగుచతురమతి యనుమంత్రితనూభవుండు తనతోడన రా నతనికరాంబుజం బవలంబనంబు చేసి భద్రదంతావళప్రతిమానయానంబున మూర్తిమంతుం డయినవసంతుం డన నయ్యుద్యానంబు ప్రవేశించి నిజాగమనోత్సాహంబున వనదేవత లుప్పరిగలపయినుండి వెల్లుఁగఁ జల్లులాజలచందంబున నందంబయి వృక్షాగ్రంబులనుండి పవనవిక్షేపవశంబున జలజలరాలు విరులవర్షంబునను హర్షంబు నొందుచు మంగళగీతపఠనంబులతోఁ గర్పూరదీపికారాజి నీరాజనంబు లొసంగు కొమ్మలవిధంబునం గొమ్మలు చరత్కలకంఠవధూమధురస్వనభాస్వరంబు లయి తరళాయమానతరుణారుణపల్లవసల్లలితనిజోపశాఖాశిఖరంబు లయికనుపట్టు నయంబునకుఁ బ్రియంబందుచు నడుగులకు మడుగులు పఱచినకరణి జరణన్యాసంబునకు నుల్లాసవికాసకరంబయి వనమేదిని మేదురంబుగాఁ గప్పి యొప్పుపుప్పొడివిరతకు సంతసింపుచు మింటనంటం బెరిఁగి తఱచుగాఁ బూచిన రసాలాదిసాలంబులకొమ్మల ముసురుకొని మసలుచు రసంబులు మెసఁగు భృంగనికరంబుల నత్తులెత్తి కమంగొని యదభ్రిశుభ్రేతరాభ్రవిభ్రమభ్రాంతి విచ్చలవిడిం బురివిచ్చి హెచ్చి మెచ్చొదవ నచ్చటచ్చట నాట్యంబులు సలుపుమయూరవారంబుల సొంపునకు నింపందుచుఁ

బరిపక్వబహువిధమధురఫలరసాహారవిశేషం బునందోఁచుకయువడి నత్యంతమాధుర్య మంజుమనోహరంబు లయినవచనరచనాచమత్కారంబుల శృంగారకథాప్రసంగం బులు సేయు కలికిచిలుకలవినోదంబునకు మోదంబు నొందుచు రతిసుందరీకందర్పుల క్రీడామందిరంబులఁబొందిక శ్రవణానందఝంకరణగాంధర్వబంధురంబు లయిన మిళిందబృందమ్ములసందడి సంచలించు పరువంపువిరులగమిం దొరుఁగు నమందమక రందబిందుసందోహమ్ము సోనల నలరారు పుష్పవల్లికల మొల్లంపుటల్లికల నుల్లసిల్లు చల్లఁదనంబునం బొదలు పొదరిండ్ల యందంబునకు నానందంబు నొందుచు మఱి మఱియుఁ దద్విశేషంబులు గనుంగొని కొనియాడుచు సఖుండును దానును జనిచని ముందట. 77

ఉ. కాంచనశైలధీరుఁ డటఁ గాంచె నటత్తటకాంచనద్రుమా
ఖాంచలవాతచంచలనవాంబుజసంగితరంగమాలికా
సంచయడోలికాభ్రమణసంభ్రమలోలమరాళబాలికా
ప్రాంచితకేలికాకలితహంసము నొక్కసరోవతంసమున్. 78

క. కాంచి ప్రమోదించి నయం, బెంచి సఖునితోడ ననియె నిక్కొలను విలో
కించితె కిలికించితసుఖ,దాంచిత యగురవికి నేతదబ్జిని దినమున్. 79

సీ. ఇందిందిరాలకబృందసంపదఁ జూపి ఫేనిసత్పటకుకన్నెలుఁకుఁ జూపి
చక్రవాకస్తనసౌభాగ్యములు చూపి యరుణోత్పలాధరస్ఫురణ చూపి
యతులమృణాలబాహావిలాసము చూపి సౌగంధికాంగవాసనలు చూపి
లీలాతరంగవళిప్రకాశత చూపి యరవిందచరణసుందరతఁ జూపి

తే. యింపు పుట్టించుచున్నది హృదయమునకు, నిక్కొలఁకు వింతచూచితివే వయస్య
కలితయౌవనరూపరేఖావిలాస, విభ్రమోదార యగుప్రౌఢవేశ్య వోలె. 80

క. కువలయపుష్కరములతోఁ, భువనములు నిజోదరమునఁ బొలుపొందఁగ స
త్కవివచనవర్ణితం బయి, శివులీల న్మెఱసి సరసి చెన్నువహించెన్. 81

తే. ఇప్పయోజాకరంబున నొప్పుమీఱు, తమ్ములెల్లను బారిజాతమ్ములయ్యె
నరయ నిందుల జలపూర మమృతమయ్యె, నతిశయశ్లేషత స్వభావగతి వహింప. 82

క. వరవర్ణిని యగుపద్మిని, పరివృతబహుళాళి యయ్యుఁ బట్టపగ లినుఁ
బరపతిఁ గలసి వలపునం, బరఁగెడు గురియే వరాబ్జవాసనలింకన్. 83

ఉ. ఆనుచుందత్సరసీరుహాకరము డాయంబోవఁ దత్తీరభూ
మిని సెత్తావియనంటులం దొరుఁగు నమ్మోల్కప్రపుంధూళి పైఁ

గనన య్యెన్ రుచిరాంగుళీవలయరేఖాలక్ష్యమాణాంఘ్రిస
తనవిన్యాసము లంగనాజనవనాంతక్రీడ సూచింపుచున్. 84

క. ఆజాడం జనిచని యా, భూజాసి లసద్రసాలభూజాంతిక
భ్రాజితభువి శశికాంతపు, రాజగతి వసించి యున్న రాజనిభాస్యన్. 85

చ. చుక్కలలోని చంద్రకళ సొంపున హారమణివ్రజంబులోఁ
జక్కనినాయకోపలము చందమునం జెలికత్తెలందులో
నక్కజపున్ విలాసమున నందముగుల్కుచు నున్నదానిఁ దా
మక్కచకృత్కపక్షితతిమోహితపూరుషుఁ గాంచె ముందటన్. 86

క. చూచి సలోలవిలోలా, లోచనుఁ డయి ముందు తావిలోకించినలీ
లాచిత్రరూపవిభవం, బిచెలువ దిగా యటంచు నెంతయు వేడ్కన్. 87

ఉ. అగ్గజరాజకుంభకుచయుగ్మము చందము డెందమున్ దమిన్
మొగ్గఁగఁ జేయ డాయఁ జనుమచ్చుట నచ్చట నిల్చి శంకతో
నగ్గలికం గనుంగొనఁగ నత్తతి చిత్తరి చూచె మోముఁ బ్రా
స్నిగ్ధవిగస్నిగల్ తళుకు నిద్దపుముద్దపుసొంపు నింపఁగన్. 88

క. తరుణియు రమణుఁడు నొండొరు, పరుచిరగతి నరసిపాటుఁ జూచినచూపుల్
మరుఁ డేమఱించి యేసిన, శరములక్రియ మానసములు జల్లనికించెన్. 89

తే. రమణి రమణీయరూపాభిరాము నతనిఁ, గాంచి తాంచితతాలంబిభుంబికాచి
రత్నరత్నతులాకోటిరవ మెసంగ, సారసారంగలోలదృగ్జాల యగుచు. 90

ఉ. దిగ్గున లేచి శంకితమతిన్ శశికాంతశిలావితర్దికన్
డిగ్గి బెడంగుగుబ్బలు నటింపఁగఁ గౌను వడంక వేడ్కతో
సిగ్గు మొగంబునన్ మొలవఁ జెంత నికుంజముచాటు కేగె స
వ్యగ్గమనంబునం జకితహంసికలీల సఖీసమేత యై. 91

క. నడుపువగ పిఱుఁదుపొంకము, నడుము సొబగు వెచ్చ చెన్ను నవకపుజిగి కే
ల్జడతీరు విభునికన్నుల, కడరించెఁ బ్రియంబు మగువ యటు మరలునెడన్. 92

తే. ఇట్లు పొదరింటిమాటున కేగి నిలిచి, యింతచక్కనిపురుషుని నెందుఁ గాన
మితనిఁ జూడఁబరూపవ్రండే యటంచుఁ, దోఁచుచున్నది యని వాంఛతోడ మఱియు.

క. తరుణి తదీయనికుంజాం, తరసంధులఁ గానవచ్చు ధరణీశ్వరుసుం
దరమూర్తి విలోకింపుచు, మరువేదన కగ్గమగుచు మది నిట్లనియెన్. 94

సీ. కిసలయారుణకాంతి బిసరుహంబులఁ గూర్చి విరచించెనో వీనిచరణయుగము
నీలంపుఁ జకచకల్ రోలంబములఁ గూర్చి కల్పించెనో వీనికచభరంబు

శ్రోత్రము త్రిపురఘ్ను వృత్తడి పైఁ గూర్చి చేసెనో వీని విలాసమూర్తి
తనరుబింబమ్ము దుత్త్వ మొనరఁ గెంపునఁ గూర్చి కావించెనో వీని కావిమోవి

తే. యిట్లు సౌందర్యరససార మేర్చి కూర్చి, తనచమత్కారమునకు నిదర్శనముగ
వీని సృజయించెఁ గాఁబోలు విశ్వగురుఁడు, గాక కల్గునె యిట్టియాకారగరిమ. 95

క. మరునిం జూడమె కుసుమాకరునిం గనుఁగొనమె యమృతకరునిఁ నలకూ
బరునిఁ వీక్షింపమె యీ, సరసునిఁ బోలుదురె రూపసౌభాగ్యమునన్. 96

తే. అకట యిటువంటి భువనమోహనవిలాస, మూర్తి ప్రియుఁడు గానోఁచని ముద్దుగుమ్మ
చక్కఁదనమును జతురత జవ్వనంబు, నడవిఁ గాసిన వెన్నెలయట్లుగాదె. 97

పురూరవుం డూర్వశికడకుఁ జెలికాని బంపుట.

మ. అని యూహింపుచు నున్నచో నరవరుం డచ్చోట నాసీనుఁడై
తనమిత్త్రుం గని పల్కె నిట్టియతిసౌందర్యాంగి నేభూములన్
వినియుం జూచి యెఱుంగ మమ్మరుఁడు నుర్వీశ్వర్యారఁడే దీనిఁ జూ
చిన నిక్కోమలి వర్తనంబు దెలియం జిత్తంబునం గోరెదన్. 98

క. అనవుడుఁ బలితతలఁపు మదిం, గనియంగనచంప మరసి క్రమ్మఱ నేతెం
తు ననుచు నయ్యుర్వశియుం, న్ననికుంజంబునకు మంత్రినందనుఁ డరిగెన్. 99

క. అరుదెంచున తనిరాకడ, నరపాలునను గ్రహంబునకు మూలముగాఁ
బరమామోదము నొందుచు, హరిణాక్షి బహూకరింప నాసీనుండై. 100

వ. మృదుమధురభాషణంబుల నవ్విలాసినితో నతం డిట్లనియె. 101

ఉ. ఉత్తమనాయికాగుణము లొప్పుచున్నవి నిన్నుఁ జూడ నో
మత్తమరాళయాన సురమానినివో నరభామవో ఫణా
భృత్తరుణీశిరోమణివొ యెవ్వరు నీవు నిమిత్తమేమి నీ
విత్తరుభూములందిరుగ నెయ్యది పేరు నిజంబు దెల్పుమా. 102

శా. మావృత్తాంతముఁ దెల్పెద న్వినుము రామా మామకీయాంసపే
ఠీవిన్యస్తకరాబ్జుఁడై యపుడు ప్రౌఢిం బొల్చి యంతంత రాఁ
గా వీక్షించితివోఁ గదా యతఁడు లోకస్తుత్యకీర్తిప్రతా
పావార్యుండు పురూరవుండు జనలోకైకాతపత్రుం డిలన్. 103

తత్ప్రపితామహుం డఁట సుధాజలరాశి పితామహుండు రా
జత్ప్రభుఁ డైనచంద్రుఁడఁట సౌమ్యుఁడు తండ్రఁట సంప్రదాయవే

తత్ప్రతిభన్ రహించు నఁట ధాత్రిఁ బురూరవుతోడ సాటికిన్
సత్ప్రభుతావిశేషమునఁ జర్చలు సేయఁగ నెవ్వఁ డంగనా. 104
సీ. ధరణీశునకుఁ బట్టు ధవళాతపత్త్రంబు నీడకు లోనుగా నిలుచుచున్న
రాజుగూర్చుండెడి రత్నసింహాసనం బొరసి చెయ్యూనుక యుండుచున్న
జననాథునకు వీచుచామరంబుల గాడ్పు తుదలు మైఁ బొలయంగఁ గదియుచున్న
నధిపుతో నేకాంత మాడువారల విన్నపముల కొఁగావని పలుకుచున్నఁ
తే. గలిగి వర్తింతు నెప్పుడు గారవమున, రాజరాజైన యప్పురూరవుని ప్రోల
ననుఁగుఁజెలికాఁడ నెంతయు నతని కేను, జతురమతి యండ్రు నాపేరు చంద్రవదన.
తే. అమ్మహారాజుసఖ్యసౌఖ్యానుభూతి, గల్గు టెవ్వరికైన భాగ్యమునఁ జుమ్ము
మనసుగలవారి కతనిసంబంధ మేను, ఘటనసేయంగఁ జాలుదుఁ గమలవదన. 106
వ. అని పలుకుచున్నంత. 107
చ. హృదయము ఝల్లుఝల్లు మనియెం బులకాంకురపాళి నెమ్మెయిం
బొదలెఁ బ్రమోదబాష్పజలపూరము కన్నులఁ జిందె నార్ద్రసం
పద వహియించెఁ గొంతువిడి పట్టు పురూరవురాకఁ దెల్పుత
న్మృదువచనాక్షరంబు లెలమిం జెవి సోఁకినయంత నింతికిన్. 108
తే. అట్లు రాగప్రవాహమగ్నాంతరంగ, యగుచు మందాక్షసంకుచితావలోక
నాంచలంబుల నిజవయస్యాలలామ, చూచెఁ దద్భావ మెఱిఁగి యమాత్యవనిత. 109
వ. అమ్మంత్రికుమారునితో ని ట్లనియె. 110
సీ. అనఘాత్ముఁ డైన నారాయణయోగీంద్రునూరుదేశంబున నుద్భవిల్లె
సకలకళ్యాణభాజనమై వెలింగెడు నమరావతీస్థలి నధివసించెఁ
బ్రౌఢిగాంధర్వాప్సరగకళావతులకు నాయకురాలితనంబు గాంచె
నృత్యసంగీతసాహిత్యపాండిత్యశక్తి మేటివేల్పులచేత మెప్పువడసె
తే. నుర్వశియనంగ నొప్పు నీయుత్పలాక్షి, యరయ నెయ్యంపుచెలికత్తియలము మేము
ధారుణీస్థలి నొకనిమిత్తమున నిట్లు, సంచరింపంగవలసె నీచంద్రముఖికి. 111
చ. విను మిఁక దాఁపనేల నయవిశ్రుతుఁడైన పురూరవక్షితీ
శునిగుణముల్ జగజ్జనవచోరచనశ్రుతిరంజనంబుగా
విని విని దర్శనంబునకు వేడుకనొందుచు నున్నమాఘన
స్తని కతఁ డిందు వచ్చుట నిదానముగాదె యభీష్టసిద్ధికిన్. 112
క. అని సాభిప్రాయంబుగ, వనజానన పలుక మనుజవరు విహృతినెపం
బున నిక్కుంజసమీపం, బునకుం గొనివత్తు వినయమునఁ గనుఁగొనుఁడీ. 113

క. ఇయ్యంతి కోర్కి సఫలం, బయ్యెడు నని యనునయించి యధిపతి కడకుం
జయ్యన నరిగి మృదూక్తులఁ, దొయ్యలివృత్తాంత మతనితోఁ దెల్పుటయున్. 114

ఉ. ఆపలుకుల్ సుధారససమంచితసారములై చెవుల్ సొరన్
భూపతి యాత్మహర్షరసపూర్తికి నేమనవచ్చుఁ బూర్వసం
తాపవశాకృశశ్లథకనత్కటకాంగదముద్రికాదిర
త్నోపలభూష లంగములయుబ్బునఁ బొల్చెను బిక్కటంబులై. 115

తే. ఉల్లమునకు నిండాపలై వెల్లివిరియఁ, బొంగుచానందరసవార్ధిబుద్బుదంబు
లనఁగ దట్టంబులై పులకాంకురంబు, లవయవంబులఁ బొడమంగ నవ్విభుంకు. 116

మ. చిరకాలంబునుండియున్ హృదయరాజీవాంతరాళంబునన్
హారిజుం జేసినచిల్కుటమ్ముకొని సమ్యక్కీలితం బైన ని
ర్జరబిబ్బోకవతీలలామవిషయేచ్ఛాబద్ధసంకల్ప మీ
శ్వరుఁ డీడేర్పఁ ఫలించె నేఁటి కనుచున్ సన్మిత్రుతో నిట్లనున్. 117

ఉ. ఈచపలాక్షిరూపము సుమీ మునుచిత్రపటంబునందు నేఁ
జూచి విరాళినొందుట కిశోరమృగేక్షణ యీలతాంగి దృ
గ్గోచరమయ్యె నిచ్చట నకుంఠితభాగ్యగతిన్ ఫలంబ మే
లా చతురత్వ మేర్పడ విలాసినిపొందు ఘటింపఁజేయుమా. 118

వ. అనినం జతురమతి యమ్మహీపతి కిట్లనియె. 119

మ. జగతీనాథకులావతంస వినుమా సంకల్పసిద్ధుండ వీ
వగుటన్ నీదుమనోరథంబు సఫలం బౌ సంశయం బేల బా
లిక నిచ్చోఁ గలవింతలెల్లఁ గనుపోల్కిన్ దత్సమీపంబునం
దగురీతిన్ విహరింపుచుండ నవలా తా నే నినుం జేరెడున్. 120

చ. అనవుడు సంతసించి మనుజాధిపుఁ డాప్తసహాయుఁడై బుగు
ల్కొనియెడు తావులం బొలుచు క్రొవ్విరితేనియ లాని ఝుంకృతి
ధ్వను లొనరించుతుమ్మెదకదంబముచేఁ జెలువొందుపూఁబొదల్
గనుఁగొనుచు న్నిలింపగణికాస్థితకుంజముచెంత కేగినన్. 121

ఉ. సిగ్గును వేడ్కయున్ బెరసి చీఁకటివెన్నెలలై మొగంబులోఁ
నిగ్గొకవింతసేయ నృపుసన్నిధి నోఁదలవాంచి నీకుఁ దా
మొగ్గితి నంచుఁ దెల్పుగతి మ్రొక్కె లతాంగి పతాకయుగ్మస
మ్యగ్గరుడోపలాంకవలయాంకితహస్తఘటల్లలాట యై. 122

వ. అప్పుడు. 123

చ. పొలతుకగుబ్బచన్నుఁగవ పొంకున కయ్యెడ చాలదయ్యెఁ దొ
య్యలికనుదోయివిప్పునకు నాననబింబము చాలదయ్యె న
వ్వెలఁదిదరస్మితామృతపు వెల్లికిఁ జెక్కులు చాలవయ్యె నా
చెలియనురాగ మెంతయని చెప్పఁదు నాథునిఁ గాంచునయ్యెడన్. 124

సీ. నయనోత్పలముల కానంద మబ్బెనెకదా యాస్యాబ్జమునకు వైకాస్య మొదవె
హర్షాశ్రుహిమపూర మగ్గలించెనె కదా కచతమంబునకు శృంగార మొదవె
తనువల్లికకుఁ జల్లఁదన మబ్బెనెకదా కుచకోకములకుఁ బైకొనియె నుబ్బు
పులకాంకురంబులు పొరలి పాఱెనెకదా చెక్కుటద్దములకు జిగిరహించె

తే. నిష్కళంకకళాపూర్ణనృపతిచంద్రదర్శనవిశేషమున సముత్సాహరసత
రంగితము లయ్యె నతివసర్వాంగకముల, బూర్వమైత్రి ఘటించు టద్భుత మనంగ.

వ. అప్పు డవ్విభుం డవ్విలాసిని విలాసవిశేషంబున కద్భుతం బందుచు డెందంబున
నిట్లని తలంచె. 126

తే. అతివకనుదమ్ము లింతిముఖారవింద, మతివహస్తాంబుజములు తన్వంగిచరణ
కంజములు కొమ్మసెమ్మేనికమలసురభి, చాలుచున్నవి పద్మినీజాతియగుట. 127

సీ. సరసీరుహము లోకచక్షుర్హితోదార మని మొగంబునఁ బోలు ననఁగఁ దగునె
జక్కవల్ రాజతాచలచిత్రపత్త్రంబు లని చన్నుఁగవఁ బోలు ననఁగఁ దగునె
యవనీతలంబు రత్నాకరమేఖల మని పిఱుందును బోలు ననఁగఁ దగునె
పికములు మాధవప్రియమంజులరవంబు లని పల్కులను బోలు ననఁగఁ దగునె

తే. సోమునకు నోడి దోషాప్తి జోమునీడి, చక్రఘాటి నణంగి ప్రశస్తవర్ణ
సంపదఁ దొఱంగి యివి యెట్లు సాటివచ్చుఁ, గంబుకంఠిమనోజ్ఞాంగకంబులకును.

ఉ. ఏమితపంబుఁ జేసెనొ సుమీ యళు లివ్వెలికేశబంధ మై
తా ముదయించినందుకు నిదర్శనమౌఁగద సుప్రసూనపుం
ఘామలగంధబంధురరసాతిశయానుభవంబు గల్గునే
కా మఱి పూర్వజన్మమునఁ గల్గినవృత్తి భవాంతరంబునన్. 129

ఉ. దూరపుఁబొందులన్ సుఖము దోఁపక పుష్పరసంబు పేరఁ గ
న్నీరిడుచున్న యక్కుముదినిం గరుణించి లతాంగిముద్దుమో
మై రహిఁదాల్చి చంద్రుఁ డెద నంటఁగఁ జేర్చెన సానురక్తి నిం
పారెడు శోణకోణరుచిరాయతనేత్రయుగచ్ఛలంబునన్. 130

తే. అతివనునుగౌనదృశ్యవశ్యాదికళలఁ, దనరి మృగరాజజయలీలఁ దగిలియున్న
సుందరతనొంది పెంపు మిన్నంది యట్లు, లేమిచే ముష్టిపట్టుట కేమిగతమొ. 131

క. కనఁబడునఁట సగుణస్థితిఁ, గనరాదఁట నిర్గుణాప్తిఁ గలదో లేదో
కనకాంగినడుముపోలిక, యెనయఁ జిదంబరరహస్య మెవ్వఁ డెఱుంగున్. 132

వ. అని తలంపుచు మోహావేశంబున. 133

క. అపు డయ్యింతిం గనుఁగొని, యపరిమితానందహృదయుఁ డై యి ట్లనియెన్
గపురంపుఁజలువపలుకులు, చపలాంబకవీనులకు రసాయనములు గాన్. 134

సీ. ఉవిద నీకొప్పు నీలోత్పలంబులు కెంపు భామ నీకన్నులు పంకజములు
లలన నీనాస తిలప్రసూనము మధూకములు నీచెక్కిళ్లు కమలగంధి
తెఱవ నీముద్దువాతెఱ పాటలము మల్లెమొగ్గలు సేవంతములు మృగాక్షి
వెలఁది నీపాలిండ్లు విరిచెండ్లు బంధూకములు నీకరంబులు ముద్దుగుమ్మ
తే. నెలఁత నీమేను సంపెంగ నీపదములు, హల్లకము లింతి సుమనోలతాంగి నిన్నుఁ
బువ్వుగమి చేత నిర్మించెఁ బో విధాత, చాన నీపొందు పుష్పప్రాభాఫలంబు. 135

సీ. కులుకువెన్నెలనవ్వు చిలుకు చెక్కిళ్లకుఁ దళుకుముత్యంపుఁ గమ్మలమెఱుంగు
కెంపుసంపద పెంపు నింపు లేమోవికి వీటికారసరాగవిభ్రమంబు
ఖంజనప్రతిమానరంజనం బగుచూడ్కిఁ గంజనరేఖాసమాశ్రయంబు
మురిపెంపుసంపెంగ విరిపెంపుగలమేని కమలకాంచనదుకూలానుభూతి
తే. గలిగి నైసర్గికమున నుత్కర్ష మెసఁగ, వెలఁది నీరూపుచూడ్కికి విందులొసఁగెఁ
గలిమిగలచోటఁ మఱియును గలిమి గలుగు, ననినజనవాక్యమునకు దృష్టాంతముగను.

సీ. చంద్రసారమె గాదు చంద్రసారముఁ గూర్చి చేసెఁ గాఁబోలు నీచిన్నినవ్వు
కమలలీలయ కాదు కమలలీలయుఁ గూర్చి కల్పింపఁబోలు నీకన్నుదోయి
సరసహేమమె కాదు సరసహేమముఁ గూర్చి విరచింపఁబోలు నీవిమలమూర్తి
సత్ప్రవాళమె కాదు సత్ప్రవాళముఁ గూర్చి యొనరింపఁబోలు నీయోష్ఠబింబ
తే. మంబురుహసూతి సృజనకాలంబునందుఁ, గాక యిట్టియదృష్టపూర్వైకమోహ
నాంగసౌభాగ్యమమర నరాహిరాజ, కన్యలకుఁ గల్గనేర్చునె కమలవదన. 137

సీ. వనిత నీమోవులవాఁడికి నోడి మన్మథమార్గణములు సూనంబులయ్యె
సుదతి నీచిఱునవ్వుసొగసున కోడి వెన్నెల కౌముదీవచనీయమయ్యె
లలన నీస్వనమంజులతకు నోడి పికస్వనంబులు పంచమత్వంబు నొంచె
యువతి నీనడకల కోడి హంసీపదన్యాసమాదాసీన్య మనుభవించె

తే. ఇట్లు నీచక్కఁదనముతో నీడుగాక, పరిభవమునొంది యున్నశంబరవిరోధి
సాయకాదులు నన్నేమిసేయఁజాలు, నింక నీదయ గలిగిన నిందువదన. 138

క. అనుమాన మేల నీక నే, నినుమానఁగఁజాల నీవు నెఱజాణవు పై
కొనుమా ననుఁ జల్లఁగఁ గను, గొను మానకమల మెత్తి కువలయనయనా. 139

వ. అని పలికిన. 140

క. కనుఁగవ మెఱుఁగులు గ్రక్కఁ, న్వనజానన ఱెప్పలెత్తి వడిఁ జూచె నరీ
లున మరుఁ డొఱవెఱికి తఱి, క్కనఁ గా బరికించుచంద్రహాస మనంగన్. 141

వ. ఇట్లు కనుంగొని. 142

ఉ. రాజనిభాస్య పల్కె నలరాజకుమారకుమారుతోడ నో
రాజకుమార ముందు సురరాజకుమారకుఁ జూతు వాహినీ
రాజకుమారుఁ జూతు ఘనరాజకుమారునిఁ జూతుఁ గాని నీ
రాజదలేఖ్యమూర్తి నరిరా జగమందు వసింప రెవ్వరున్. 143

శా. నీలావణ్యము నీగుణాతిశయము న్నీభావము న్నీవచో
లాలిత్యంబును నీప్రతాపమును జాలన్ విన్నదానన్ మరు
త్పాలాస్థానమునందు నారదుఁడు చెప్పన్ మోహవిభ్రాంతనై
భూలోకేశ్వర నాఁటనుండియును నీపొందాత్మలోఁ గోరుచున్. 144

మ. వినుమయ్యింద్రునిపంపున న్మనితపోవిఘ్నార్థమై వచ్చి ని
న్ననుఁగోనె ట్లొనఁగూడునో యనుచుఁ గాంక్షన్ దైవము న్వేఁడుకొం
చు నిమేషం బొక యేఁడుగాఁ గడపుచున్ క్షోణీశ యీకైవడి
న్వనవాసంబులు సేయునాకు నినుఁ గానంగల్గె భాగ్యంబునన్. 145

చ. విరహమునం గృశింపుచును వెన్నెలయొంపల నెండి కంతుపూ
శరములవానలం దడిసి చందనశైలపుఁజల్లగాడ్పుని
బ్బరపువడన్ శ్రమంపడి తపం బొనరించుచు నున్నదాన నో
నరవర నీకునై యిటులు నావలపే మని యింకఁ దెల్పుదున్. 146

వ. అని మఱియును. 147

మ. హృదయేశా ననుఁ జూడు నీకొఱకు నే నిట్లైతి నంచున్ సగ
ద్గదదీనోక్తులచేఁ గపోలఫలకాంతాశ్రుబిందుచ్ఛటన్
వదనగ్లాని యొసంగ నుస్సురనుచున్ వామాక్షి చూపెన్ మనో
జదశాయాసకృశాంగవల్లి పతికిన్ సమ్మోహముం జేయుచున్. 148

వ. అప్పు డప్పడంతిం జూచి యతండు రాగరసమగ్నుం డగుచు నిట్లనియె. 149

ఉ. నీమొగ మేను నామొగము నీవు నెఱుఁగకముందు ముందుగా
నేమి ఋణానుబంధమొ సుమీ సరిమోహము లగ్గలించె నో
హేమలతాంగి యింక మఱిఁ నేటికి నమ్మిక మాట పల్కెదం
గాముఁడు సాక్షిగాఁగఁ గలకాలముఁ గూడి సుఖింత మింపుగన్. 150

క. నావుడు సంతసమంది క, ళావతి యిట్లనియె నోయిలావల్లభ మ
ద్భావంబున కనుకూలుఁడ, వై వర్తింపంగవలయు నది విను మనుచున్. 151

క. వేడుకకై తాఁ బెంచిన, జోడుతగళ్లను సువర్ణసూత్రాంచితఘం
టాడోలనఘణఘణనిన, దాడంబరకంధరంబు లై తగువానిన్. 152

వ. చెలికత్తియలచేతఁ దెప్పించి యప్పతికిఁ జూపి యి ట్లనియె. 153

మ. అవనీనాయక నీవిదుష్టమృగచోరాద్యాపదల్ పొందనీ
క విమర్శింపుచు నెల్లప్రొద్దు దయతోఁ గాపాడుచుండన్ వివ
స్త్రవికారస్థితి లేక నాకడ వసించన్ మాటపట్టిచ్చెదే
ని వినోదంబుల జోడువాయ కెపుడున్ నీతోడఁ గ్రీడించెదన్. 154

## పురూరవుఁ డూర్వశిని నిజపురంబునకుఁ దెచ్చుట.

తే. అనుచు సమయంబుచేసె న ట్లాలతాంగి, వనితల తలంపు లెఱుఁగ నెవ్వరివశంబు
జనపతియు నట్లకా యని సమ్మతించె, వనజముఖులకుఁ బురుషులు వశులుగారె. 155

వ. ఇ ట్లన్యోన్యస్నేహానుగుణంబు లగుమాటల నాడుకొనిన యనంతరంబ యమ్మహీకాంతుం డక్కాంతం దోడ్కొని పురంబున కరుగుతలంపున మరలి వనంబు వెలువడి నిజబలంబులం గలుపుకొని యూర్వశీసహితంబుగాఁ గనకరథారూఢుం డయి రోహిణీయుక్తుం డగుచంద్రుండునుం బోలె మహేంద్రవైభవంబున రాజధానికిం జని సామంతసచివప్రముఖపరిజనంబులఁ దగురీతి బహూకరించి తత్తద్గృహంబుల కనిపి నిజనికేతనంబు ప్రవేశించి యుండె నప్పుడు పరిచారికాజనంబులు తత్సమయోచితంబు లయినరాజోపచారంబులు సేయుచుండి రయ్యెడ. 156

ఉ. కంకణనిక్వణంబు ఘలుఘల్లన మ్రోయఁ గపోలపాళితా
టంకరుచుల్ వెలుంగ నుదుటం జిఱుచెమ్మట గ్రమ్మ హారముల్
కుంకుమగంధపుస్వలపు గుబ్బలపై నటియింప నొక్కయే
ణాంకనిభాస్య భూపతికి నంటె సుగంధపునూనె యత్తఱిన్. 157

చ. మగువకరాబ్జతాండవచమత్కృతిచేఁ దలయంటుచున్నచో
సొగసగు నూర్పుతావి పయిసోఁకినఁ గంకణనాదఝుంకృతిన్
మొగమనుతమ్మికిన్ వలచి ముక్కనుసంపెఁగమొగ్గ కల్కిపై
కెగయుచు వ్రాలుచుండె మధుపేంద్రుఁడు పెన్నెఱిగుంపుఁదమ్మెపల్. 158

మ. పరఁగన్ భూవిభుమేన నగ్గిడి తలం బ్రాపెన్ సుగంధద్రవం
బరవిందాస్య నతానతాగ్ర కుచకుంభాలోలహారావళుల్
స్మరసామ్రాజ్యపదాభిషేకమునకుం జైవంచు బంగారుగిం
డ్లరహిం జాఱుసుధాసుధాకలన లీలాఖేలనమ్రాంగి యై. 159

తే. కడిసి జలకంబువోసి రక్కాంతిశిఖికిఁ, గామినులు కమ్రకరకంజకలితకనక
కాచకంకణకమనీయకలరవంబు, కర్ణహితముగఁ గాంచనకలశములను. 160

సీ. తడియొత్తె నొక్కసుందరి రాజమౌళికి లాలితధౌతదుకూలమునను
కట్ట నొసంగె నొక్కలతాంగి యధిపతి కసమానమృదులదివ్యాంబరంబు
సిగవైచె నొక్కరాజీవాక్షి విభునకు వికచప్రసూనమాలికలు చుట్టి
ధూపం బిడియె నొక్కతొయ్యలి నృపునకుఁ జందనాగరురజస్సారమునను

తే. దిద్దె నుదుటను గస్తూరితిలక మొకతె, యలఁదె నొక్కతె నెమ్మేన మలయజంబు
వీవన ధరించి చల్లఁగా విసరె నొకతె, చంద్రవంశాబ్ధిసంపూర్ణచంద్రునకును. 161

వ. తదనంతరంబ. 162

సీ. గారెలు బూరెలు కండమండెంగ లప్పంబులు మొదలైనభక్ష్యములను
సరసాన్నమును బాయసమ్ము సూపము శాకములు మొదలైనట్టి భోజ్యములును
పడిదెంబు లానవాల్ పరిపక్వఫలములు సురసముల్ మొదలైన చోష్యములును
బహువిధంబుల నొప్పు పచ్చళ్ల తేనియల్సిగరులు మొదలైన లేహ్యములను

తే. నారికేళోదకంబు పానకము చల్ల, నీరు మొదలైన యట్టిపానీయములును
ననఁగ జేరైనపంచపదార్థములను, భూరమణుఁ డిష్టసహితుఁడై యారగించె. 163

ఉ. కారపుఁగూరలున్ మిగులఁ గాఁగినచారులు నెయ్యపప్పు పొం
గారినయానవాలు పరమాన్నము కమ్మనిపిండివంట క
ర్పూరమువంటి నెయ్యి కడుఁ బొత్తిగవార్చిన యన్న ముప్పునన్
గూరిన యల్లమావుపెరుఁగున్ భుజియించె నృపాలుఁ డయ్యెడన్. 164

తే. ఉప్పు పులుసు తీపి యొగరు కారము చేఁదు, ననఁగఁ దగినరసము లాఱునుల్బ
ణముల నుల్బణములు సమములు నగుపదార్థముల భోజనంబు ప్రహితమయ్యె.

వ. భోజనాంతరంబున. 166

తే. పండుటాకులు కపురంపుబాగములును, ముత్తియపుసున్నము లవంగములును నేల
కులును జాపత్రియాకిగాఁ గూర్చి యపుడు, జనవిభుఁ డొనర్చెఁ దాంబూలచర్వణంబు.

సీ. నవరత్నఖచితమైన కిరీటమాణిముత్యములచౌకట్లు కుందనపుఁజిలుక
తాళితో సరిపెసల్ తారహారములు పచ్చలభుజకీర్తులు జాతికెంపు
రవలతాయెతులు వజ్రపుఁగంకణములు మెఱుంగులరాకట్టుటుంగరములు
ధగధగల్ గులుకు బంగారంపుమేఖల ఘల్లుఘల్లుమ్రోయునందె లంగకములందు

తే. వెలుఁగ గటితటి సిద్ధంపుఁబలువసక్త్రి, జిగటుదుప్పటి వలెవాటు పసరువిరుల
సరులు మైపూఁత గంధము పరిమళింప, ధరణివిభుఁ డొప్పె సాక్షాత్కందర్పుఁ డనఁగ.

వ. ఇవ్విధంబున నవ్విభుండు సకలాలంకారమనోహరాకారుండై క్రీడామందిరంబునఁ బీఠమర్దకవిటవిదూషకప్రముఖప్రియజనంబులతో నిష్టగోష్ఠివినోదంబులం బ్రొద్దు పుచ్చుచు నుర్వశీసంభోగాపేక్ష క్షపాకాలంబునకై నిరీక్షింపుచుండె నయ్యుర్వశియు శుద్ధాంతమందిరంబున సఖీసహస్రసంసేవితయై మజ్జనభోజనాదు లనుభవింపుచు గంధపుష్ప దుకూలాభరణాద్యనుభవంబుల నుల్లాసవికాసమానయగుచుం బురూరవస్సమాగమోత్కంఠ నిమిషంబులు యుగంబులుగాఁ గ్రమింపుచుండె నప్పుడు. 169

## సూర్యాస్తమయాదివర్ణనము.

చ. అపరమితోన్నతం బగుబలాభ్యహజారపుపైఁడిమేడపై
విపులసరోజరాగమయవిస్ఫుటహాటకకుంభమో యనన్
అపరధరాధరేంద్రశిఖరాగ్రతలంబు నలంకరించెఁ దా
నపుడు పతంగబింబము జపారుణకాంతిరమావిడంబమై. 170

తే. అస్తమయవేళ నినునియం దాత్మలీల, నావహించిన శ్రీవాసుదేవమూర్తి
ఱొమ్ముకౌస్తుభరుచులు పైఁ గ్రమ్మినట్లు, సూర్యబింబంబు బంధూకశోణమయ్యె. 171

సీ. వరుణశుద్ధాంతయువతిచారుసీమంతసిందూరరజముతోఁ జెలిమిచేసి
వనధిరాజోద్యానవనవాటికాతరుకిసలయశ్రేణితోఁ గ్రీడసల్పి
పాశభృత్కేళికాపద్మాకరోత్ఫుల్లహల్లకవ్రజముతో నలఁగి పెనఁగి
ప్రాచేతసోజ్జ్వలప్రాసాదములఁ బొల్చుకురువిందమణులతో సరసమాడి

తే. నిండుకొనియె సమస్తదిఙ్మండలమున, సాంధ్యరాగంబు తాండవసంభ్రమభ్ర
మన్మహానటపటుజటామకుటఘటిత, ఫణిఫణామణిగణఘృణిప్రచుర మనఁగ. 172

ఉ. తమ్మినయమ్ము దప్పఁ గుముదమ్ము ముదమ్మున నొప్పఁ జక్రవా
కమ్ములు జోడువిప్పఁ దమకమ్మునఁ బాంథులపై మరుండు పూ
టమ్ములు గుప్పఁ జీకటి భయమ్మునఁ దిక్కులఁ గప్ప భాస్కరుం
డమ్మెయి నస్తమించె నుదయమ్మయి మించె నుడుప్రభావళుల్. 173

సీ. కల్పించెఁబో నీలకైరవమాల్యసంబంధముల్ ధమ్మిల్లబంధములకు
విరచించెఁబో మనోహరకురంగమదతిలకముల్ వరఫాలఫలకములకుఁ
గలిగించెఁబో నీటుకాటుకరేఖలయందము నయనారవిందములకుఁ
గదియించెఁబో లసత్కాలాగురువిలేపయోగముల్ ఘనకుచాభోగములకుఁ

తే. జేసెఁబో నీలివన్నియచీరముసుఁగు, వేయునదుపాయములు మృగకాయములకు
నంధకారం బకారణబంధు వగుచు, జాదులను జేరఁ జనునభిసారికలకు. 174

క. తమిమించె నంతకంతకుఁ, దమిమించెను చిన్నవయసుదంపతులమదిన్
దమకింపుగఁ గలయుటకై, దమకింపుచు మరుఁడు సేయుతహతహలవన్. 175

తే. అరికి నరెయయ్యె నవ్వేళ నదియుచితము, గాక తమ్ములకహితమ్ముగాఁగ మిత్రు
నకునమిత్రత గాఁగఁ దానడచె నెట్టి, తగవు దోషాఖ్యవర్తించుఁ దామసులకు. 176

మ. సమయాధోరణశేఖరుండు తిమిరస్తంబేరమోత్తంసముం
బ్రమదంబారఁగ నిల్పి సాంద్రకరతారావారముక్తామణీ
సముదీర్ణస్థితి నొప్పవిష్ణుపదపుఞ్ జొడోలు పైనెత్త వే
గమె వాహ్యాళికి వెల్వడం గల శశాంకస్వామికిన్ ముందటన్. 177

క. పాండిమముదోఁచె సైంధవ, మండలధరగర్భభరసముంచిత యగుచా
ఖండలదిగ్భామినిముఖ, మండలమున లోధ్రకుసుమమాలాద్యుతియై. 178

తే. ఉదయపర్వతసంగతి నొప్పి ధవళ, కిరణబింబము సైరక్తిమ వహించె
నాత్మనిర్లిప్తుఁ డయ్యు దేహాప్తివలనఁ, గర్మఫలభోక్తవలెఁ దోఁచుకరణిగాఁగ. 179

చ. చలువవెలుంగు వెల్లులరసాయనపుందొన పాలవెల్లిలో
మొలచినముద్దుపాపఁడు కుముద్వతివేడుకకాఁడు తమ్మిలోఁ
గిలిగలచంద్రబింబముఖికిన్ సయిదోడు చకోరభోజనం
బులనెఱదాత చందురుఁడు పూర్వదిశాస్థలి నొప్పె నయ్యెడన్. 180

తే. అంతకంతకు రాగంబు నపనయించి, శుచివహించి సత్సంగతి సొంపుగాంచి
విష్ణుపదమాశ్రయించి యాద్విజవిభుండు, సుగతి సైకొని జగములు పొగడఁదనరె.

సీ. కకుబంతకుడ్యభాగములపైఁ బ్రసరించి పాలసున్నపుఁ గచ్చుపగిదిఁ దనరి
చంద్రకాంతగ్రావచయముపైఁ బ్రసరించి చెలమేటిజాలు పెంపొలయఁ జేసి
క్రీడించువిటవిటీశ్రేణిపైఁ బ్రసరించి రతిహెచ్చరికమందు రహిఁ వహించి
యలచకోరంపుఁగుంపులమీఁదఁ బ్రసరించి యాఁకటిపంటకొల్చై యెసంగి
తే. భువనహితచారుచంద్రికల్ భూనభోంత,రాళమున నిండుకొనియె హేరాళముగను
హారహీరతుషారమందారగంధ, సారఘనసారఫేనవళివిస్తార మగుచు. 182

క. చూపట్టె నిర్మలజ్యో, త్స్నాప్తిప్రాప్తిక మగుచు భువన మంతయు సర్వ
వ్యాపకుఁడు శంభుఁ డనియెడి, యాపలుకవ్వేళ దృష్టమయినవిధమునన్. 183

శా. మార్తాండాతపధనసేవచేతను జగన్మర్త్యాంకు ప్రాలేయశీ
తార్తింబాసి తదీయవైకృతివిదాహం బొందఁ దద్బాధని
ర్వార్తింపం గ్రియచేసె యుక్తిచెలువారం బూర్ణచంద్రోదయ
స్ఫూర్తిం గాలభిషగ్వరుండు పయిపై జ్యోత్స్నారసముల్ దేరఁగన్. 184

ఉ. కూరిమినెచ్చెలుల్ సొగసుగుల్కఁగ వెన్నెల నించి చెంతలం
జేరి యొసంగ ఘల్లుమని చేతులకంకణనాద మొప్ప నొ
య్యారముతోడ నందుకొని యాత్మపుటంబులఁ బీల్చికొంచు హా
లారసపానలీలలఁ జెలంగిరి వారలతాంగు లయ్యెడన్. 185

ఉ. కారణమేమిలేకయె వికావికనవ్వును నిర్నిమిత్త మె
వ్వారలనైన నుం బిలిచి వాదుకుఁబోవు నిరర్థకంపుహుం
కారముతోఁ జెలంగు సరికన్నుబొమల్ ముడివెట్టు వట్టియా
స్వైరము సేయు సీధురసవిభ్రమయైనమృగాక్షి యత్తఱిన్. 186

సీ. ఒకటాడఁబోయి వేఱొకటాడు మాటలఁ బదములఁ దొట్రుపాటొదవు నడలు
సొక్కుచూపులకెంపు సొంపారు కన్నులు మదఘూర్ణితములైన మానసములఁ
జనుదోయిఁ గప్పడ జాఱుపయ్యెదకొంగు లలికంబుఁ గుప్రాలు నలకచయము
శ్రమబిందువుల చేఁ గరంగుకస్తురిబొట్టు లవశతదూఁగాడునంగలతలఁ
తే. గలిగి మధుపానజనితవికారపార,వశ్యలాలసగాత్రలై వేశ్య లపుడు
విటులభావంబులకు నొకవింతవేడ్క, యొసఁగఁగాఁ జేసి రన్నిశావసరమునను. 187

సీ. బతిమాలినను బయల్పడసేనియంగముల్ సొరిది ముచ్చటదీఱఁ జూచిచూచి
ప్రార్థించినను నోరనంటనియ్యనిమోవి కసిదీఱఁ గంట్లుగాఁ గఱచికఱచి
వేఁడుకొన్నను గేలు వేయనియ్యనిగుబ్బ లాసదీఱఁగఁ బట్టి యలమియలమి
యడుగుకొన్నను మొగంబిడనీని చెక్కిళ్లు ప్రేమదీఱఁగ ముద్దుపెట్టిపెట్టి

తే. వారుణీరసపానవికారమత్త, ఖండితావార్యరతిసౌఖ్యకలన గాంచి
పల్లవులు మెత్తు రత్తఱిఁ బ్రాణబంధు, వగుట నిదియాసవాహ్వయం బయ్యెననుచు.

వ. అట్టినిశాసమయంబున నప్పురూరవుండు. 189

సీ. ఘనతరస్తంభసంఘటితమాణిక్యముల్ దీప్తదీపావళీస్థితి వెలుంగ
వాతాయనాయాతవాతపోతంబులు చామరవిక్షేపసౌఖ్య మొసఁగ
నపరంజిమెఱుఁగు నిద్దపుఁగీలుబొమ్మలు పరిచారికలరీతిఁ బనులు సేయ
ముత్యాలపంజరమ్ములఁ గీరశారికల్ శృంగారకథలు వచింపుచుండ
తే. వజ్రసోపాననీలకవాటచంద్ర, కాంతకుట్టిమమరకతఖచితకుడ్య
పుష్పరాగవితర్దికాస్ఫూర్తి నధిక, సుందరంబైన కేళికామందిరమున. 190

చ. పగడపుఁగోళ్ల వజ్రములపట్టెల నైకపుఁబట్టుపట్టెడన్
జిగిబిగినైన యల్లికవిచిత్రపటావృతహంసతూలికన్
మిగుల రహించుపానుపున నించినజాజులు గానరాఁ బయిన్
దగువలిపంపురాజుపధానము గల్గినశయ్యమీఁదటన్. 191

తే. పవ్వళించినఁ దన్మనోభావ మెఱిఁగి, ప్రౌఢనెచ్చెలు లుర్వశిఁ దోడితెచ్చి
యమ్మహారాజుసన్నిధి కనిచి రపుడు, మణితులాకోటిసిక్వణక్వణన మొసఁగ. 192

క. లోలాక్షి ప్రౌఢయయ్యును, బాలికయునుబోలె సత్రపామందగతిన్
డోలాయమానమానస, యై లోపలికరిగె మోహమట్టిద కాఁడే. 193

క. వచ్చినఁ గనుఁగొని గొబ్బున, గ్రుచ్చి కవుంగిటను జేర్చి కోర్కులు మదిలో
హెచ్చఁగ శయ్యకుఁ దార్చి శరచ్చంద్రనిభాస్యమనసు రంజిలఁ బల్కెన్. 194

సీ. తరుణి నీముఖచంద్రదర్శనాపేక్షఁ జూపులకుఁ బున్నమ యొక్కప్రొద్దు లాదవె
నళివ నీమధురవాగమృతపారణవాంఛ శ్రుతులకు నిరశనవ్రత మొసంగె
నాతి నీపరిరంభణస్వర్గభోగేచ్ఛ దేహంబునకుఁ దపస్స్థితి ఘటించెఁ
జాన నీపొందుబ్రహ్మానందగతిరతి నెమ్మది నద్వైతనిష్ఠ వొడమె
తే. నని తదాసక్తి నయనకర్ణాంగమాన, సములు నీయందుఁ జేర్చు నామమత దెలిపి
మొగముచూపి భాషింపుచుఁ బిగువుకౌఁగి, లిచ్చి కలసి కావింపు మభీష్టసిద్ధి. 195

ఉ. చన్నులు పద్మకోశములు చక్కనిచేతులు పల్లవాకృతుల్
నెన్నుదు రర్ధచంద్రరమణీయము ముష్టికరప్రమాణతన్
జెన్నగు మధ్య మంగములచే భరతాభినయం బెఱుంగఁ గా
చున్నది నిన్నుఁ జూచినఁ దలోదరి యాటకు జాణవౌటనో. 196

విరివిల్తుమూఁకలు విఱుగుచూపె ననంగఁ గ్రొమ్ముడివీడి ముంగురులు చెదర
దర్పకతూర్యనాదము లణంగె ననంగ మణిభూషణధ్వనుల్ మట్టుపడియె
తే. నావిలాసిని నవసురతావసాన, సమయజగ్లాని సౌమ్యభావము వహించె
వర్తమానపరాభవావస్థ నున్న, చిలుకతేజీవజీరునికలకతోడ. 215

ఉ. ప్రాయపుదంపతుల్ బెగడుపాటున నొండొరుఁ గౌఁగిలించి యా
హా యిదె తెల్లవారెఁగద యంచుఁ బునారతివాంఛ నర్మవా
చాయుతిఁ దాపులంటుచు వెసం దమిరేఁచి రమింపఁ గొక్కొరో
కోయని తామ్రచూడములు కూయఁదొడంగె నడంగెఁ జీకటుల్. 216

చ. అపుడు తమంబుచొప్పుఁ దెలియన్ సమయోచితవేషధారియై
తపనునియాజ్ఞఁ గైకొని ముదంబున వేగునకేగుదెంచు దూ
తపగిదిఁ జూడనొప్పె నుదితంబయి తూర్పున వేగుచుక్క యా
నెపముననో తదాఖ్య ధరణిం బ్రతిపాదితమాట దానికిన్. 217

సీ. సురతవిముఖతచేసోలుపద్మినికి శంకిని మహోత్సాహంబుఁ గీలుకొలిపి
పగలఁ గుందెడుచక్రవాకంబులకుఁ జకోరంబులయుల్లాసరస మొసంగి
స్వపరజాగ్రద్వధూచాతుషంబులకు దీపములశోణద్యుతి పాదుకొల్పి
వసివాడుదేరియున్నసరోజరాజికిఁ గుముదసౌభాగ్యంబుఁ గుదురుపఱిచి
తే. యానిదురమబ్బు శంకిని కావిచార, దశచకోరకములకు సాధవళిమంబు
దీపికల కానిమీలనస్థితిమువ్వ,తికినిఁ గల్పించె సమయమాంత్రికవరుండు. 218

మ. జలజాతాహితుతో రతింబెనఁగుచో పర్యాటపున్రాపుచే
ష్టలఁ జెల్లాచెదరైనహారగుళికాజాలంబు తావేకువం
దొలఁగం జూచుచు నేఱి పుచ్చుకొనియెం దోడ్తో నిశాలీనకుం
తల యన్నట్లపరూపతం బొరసె భ్రాంతస్సాంద్రతారావళుల్. 219

ఉ. వీచెఁ బ్రభాతవాత మరవిందవనంబుల మేలుకొల్పుచుం
దోఁచె విటీవిటావలికిఁ దుందుడుకుల్ విడలేనికూర్ములన్
సోఁచె మయూఖమాలి కరశాఖలు పూర్వనగంబుచెంతఁ జె
య్యాఁచె మనోభవుండు విరహార్తుల నొంచుట మాని శాంతుఁడై. 220

మ. సరసీకేళిగృహంబునం గుముదినీసంభోగలీలన్ నిశా
కరుఁ డాత్మప్రతిబింబసంభమున వేడ్కల్సల్పి తాజోడువా

సరుగన్ ఖిన్నతనొందెఁ గైరవిణి తా నంతంతకున్ వెల్లనై
జరిగెం బొం దెడలైనదంపతులకుం జాలాట యాశ్చర్యమే. 221

క. దధిమథనఘుమఘుమధ్వని, యధికంబై వల్లవీగృహంబులఁ జెలఁగెన్
మధుకరవేణీకంకణ, మధురఝుణత్కారమిళితమసృణం బగుచున్. 222

సీ. వనవాటికలయందు వరవిహంగవిహంగసమాజకూజితకలరవంబు
ప్రాసాదములయందుఁ బాఠకోద్గీతభూపాళాదిగీతికాబహుళరవము
గోస్థానములయందు గోపకాహ్వానోత్సుకారంభసురభికాంభారవంబు
నళినాకరములందు నవనవోత్ఫుల్లారవిందబృందచలన్మిళిందరవము
తే. స్నానఘట్టంబులందు మజ్జనవిధాన, నిరతవిశ్వంభరామరనికరపఠిత
సుప్రసిద్ధాఘమర్షణసూక్తరవము, శ్రావ్యమైయొప్పె నయ్యుషస్సమయమునను. 223

తే. వనజబంధుండు దనుఁ జేరవచ్చునపుడు, ప్రథమదిక్స్త్రీమ రాగసంపద వహించె
ననఘు లగువారు దనయింటి కరుగుదేరఁ, గోరి యనురాగ మందనివారు గలరె. 224

మ. నలినీపుణ్యఫలంబు కోకమిథునానందాలవాలంబు ది
గ్వలయాలంకరణంబు మోక్షపదపీఠుంటాపథం బంబర
స్థలమాణిక్యము బ్రహ్మవిష్ణుశివతేజఃపుంజ మహాపాసకో
జ్జ్వలనిక్షేపము భానుబింబము ప్రకాశం బయ్యెఁ బ్రాచీదిశన్. 225

సీ కమలాసనమున సాకల్యహైమాంగుఁడై యాత్మమండలములో హరి వెలుంగఁ
బెంపుతో మాతరప్పంగళోద్దండాదిపారిపార్శ్వకకోటి బలసికొలువ
సౌరసూక్తముల సంస్తవము గావింపుచు వాలఖిల్యాదులు ప్రోల నిలువ
గరుడాగ్రజుఁడు హరిద్ధరిసప్తకంబును ఛాత్కారరవములతోఁ జబుకునేయ
తే. హృద్యగంధర్వమర్దళవాద్యరంజ, కాప్సరోనాట్యసంరంభ మతిశయిల్ల
రుచిరరత్నవిమానసంరూఢుఁ డగుచు, నుదయగిరిశృంగమునఁ బొల్చె నుష్ణకరుఁడు.

తే. పూర్వపశ్చిమదిగ్భాగముల నలంకృ, తంబులై సూర్యశశిమండలంబు లపుడు
హరుని తేరికి బండికండ్లైననాఁటి, చంద మిటువంటిదని తెల్పె జగములకును. 227

వ. అట్టిప్రభాతకాలంబునందు. 223

ఉ. చెక్కులచుంబనాంకములు చెందొగచాయల మోవిమీఁది ప
ల్నొక్కులు నిద్రదేరెడుకనుంగవ వీడినకీలుగంటునుం
జిక్కులు వడ్డహారములు సిబ్బెపుగుబ్బల గోటినాటులా
చక్కెరబొమ్మకున్ రతిరసస్ఫుటచిహ్నము లొప్పె వేకువన్. 229

సీ. ఎడఁబాయలేమి ననిచ్ఛతో లేచుచు మోహార్తి నిడుకొన్నముద్దుసొగసు
మఱుఁగుగా నవ్వుల మరలిపడిన సెవి ముడిగొల్పి పయ్యెదయిడినసొబగు
పిఱుఁదుపై వ్రాలెడు నెఱికురు లసడుగాఁ గొని కేలఁబొదివిన కొప్పువింత
పదముల జాఱవాపావాలు దొడిగి చప్పు డెఱుఁగరావుండ నడుచుహొయలు
తే. కని కరంగెడువిభుని నెమ్మనము నపుడు, ముదితరాగరసాంబుధి ముంచి యెత్తె
మరలి చూచిన సురతజాగరపుఁగెంపు, సిగ్గుఁ గనుచూపుచే శయ్యడిగ్గి చనుచు. 230
సీ. చెలువకౌఁగిటినొక్కుచే నెద నేర్పడ్డ నవరత్నహారచిహ్నములతోడఁ
బూఁబోఁడిచుంబనంబులఁ జెక్కులంటిన తాంబూలరసరక్తిమంబుతోడఁ
గొమ్మ కన్నులనద్దుకొనుటచే గళమునఁ గనుపట్టుకజ్జలాంకములతోడ
ముదితపల్లొత్తుల మోవిపైఁ జెలువొందు సరసంపుఁగెంపులవరుసతోడ
తే. మెలఁత మొనగోటినాటుల మిగుల నంద, గించు సందిళ్ళచంద్రరేఖికలతోడ
మొదలిచెలువంబునకు వింతమురిప మెసఁగఁ, గేళిసదనంబు వెడలి భూపాలకుండు.

వ. స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి నిత్యోచితదానంబుల మహీసురసంతర్పణంబు గావించి షడ్రససంపన్నంబు లయినభక్ష్యభోజ్యచోష్యలేహ్యపానీయంబులం దృప్తుండయి కిరీటకుండలగ్రైవేయకేయూరకంకణోర్మికామేఖలాంగదాదిదివ్యమణిఖచితజాంబూనదాభరణమనోజ్ఞదుకూలాదుల నలంకృతుండయి సామంతమంత్రి పురోహిత సేనానాయకవిద్వత్కవివందిమాగధవిలాసినీపరిచారికాదులు నిజాధికారానుగుణంబుగాఁ గొలువ సేయ రాజ్యభారధురంధరుండయి యుండె నయ్యుర్వశియు శుద్ధాంతమందిరంబున సఖీసహస్రసంసేవితయై మజ్జనభోజనాదు లనుభవించుచు నుచితంపువిధంబున మెలంగుచుండె నవ్విధంబున నయ్యుర్వశీపురూరవస్సు లిష్టోపభోగంబుల నిరతసురతక్రియాసౌఖ్యంబులం దేలుచు. 232
క. మేడల మెలఁగుచుఁ బొన్నల, నీడలఁ జెలఁగుచు నటద్వనీతటపుళిన
క్రీడలఁ బనరుచు నింపగు,జాడల నలరుదురు వారసతియుం బతియున్. 233
ఉ. ఒక్కనిమేషమైన నొకరొక్కరిమోములు చూడకుండినన్
మిక్కిలి జాలినొందుదురు మేనులుజీవము లొక్కరూపుగా
మక్కువలం దలంపుదురు మాటికి వెన్నవలెం గరంగుచున్
సొక్కుదు రొండొరున్ దనువుసోఁకిన వారలమోహ మెట్టిదో. 234
మ. జనవాథాగ్రణికిన్ లతాంగికి యథేచ్ఛక్రీడలన్ నిత్యనూ
తనవార్తాప్తియె కాని నెమ్మది విషాదం బింతయున్ లేదు లే

దననేఁజా కల దొక్క వేళ భరితప్రాంచన్మణీహారపుం
జనిరోధాంతరితోపకూహముల నిచ్చక ముచ్చటల్ దీఱమిన్. 235

క. ఇవ్విధమున నవ్వేఁటపు,జవ్వనియును నవ్విభుండు సరసలపులతో
నివ్వటిలం బువ్విలుతుని, యవ్వింతలఁ గొంత కాలమట్లు మెలఁగఁగాన్. 236

## ఇంద్రునిపంపున గంధర్వులూర్వశికై భూలోకమునకు వచ్చుట.

ఉ. అంతట నొక్కనాఁడు దివిజాధిపుఁ డయ్యమరావతీసభా
భ్యంతరసీమయందుఁ గొలువై బలువైభవమొప్ప నృత్యమ
త్యంతనిరూఢి నప్సరసలాడఁగ జూచుచు నుండె నుండ య
క్కాంతల నందఱం గలయఁగన్గొని యూర్వశి గానరామికిన్. 237

తే. తగవిచారించి యచటిగంధర్వవరులఁ, బిలిచి నాకూర్వశిని భరాస్థలికినంపి
తిమిగదా నాఁటనుండియుఁ దిరిగిరాక,యుండఁ గారణమేమి భూమండలమున. 238

క. అనవుడు గంధర్వులు త, ద్వనితావృత్తాంత మెల్లఁ దనతోఁ దెలుపన్
విని యేయుపాయమున నై, నను గోమలిఁ దోడితెండు నాకంబునకున్. 239

ఆ. అని యనుజ్ఞసేయ నవనికి నేతెంచి, యుర్వశియు నృపాలుఁ డున్నయట్టి
చెలిమిఁగాంచి యెడలు సేయుటకై వేళ, గాంచి యుండి రప్రకాశవృత్తి. 240

ఉ. ఆయెడ నొక్కనాఁటిరేయందుఁ దటాంతనికుంజపుంజపు
ష్పాయతదివ్యగంధమిళితాగతవాతపరంపరన్ సుఖ
శ్రీ యొసఁగంగ నొక్కనదిచెంతను సైకతవేదికాస్థలిన్
ప్రేయసియున్ బ్రియుండును గడుఁ బ్రేమలఁ గొంకలిరాకుశయ్యపై. 241

వ. ఉన్నయెడ. 242

క. కుసుమశరశాస్త్రవిద్యా, రసికతఁ జౌషష్టికళలఁ బ్రౌఢిమఁ జూపెన్
ముసిముసినగవులు మొగమునఁ, బ్రసరింపఁగ యువతి యువపతులం బతికిన్. 243

కవిరాజవిరాజితము:—

ముడిచినపువ్వులు జల్లలరాలఁగ మూపునఁ బ్రేలెడు క్రొమ్ముడియున్
గడుసుజనుంగవ జవ్వడుపన్ గడుగంపము నొందెడుహారములున్
నడుము వడంక మృదుధ్వని నుత్పతనంబులు సల్పెడు బల్పిఱుఁదుం
బొడగని సొక్కె విభుండు కళావతిపూరుషభావరతిక్రియలన్. 244

క. సమకాలసుఖజలోదయ, శమితస్మరయుద్ధతంత్రసన్నాహములన్
రమణియు రమణుఁడు సొక్కన,నమరంగనుమూఁయుచున్న యాసమయమునన్. 245

తే. సమయభంగంబునకు నిది సమయమనుచు, దవిలి తటివేచి యున్న గంధర్వవరులు
వారి కనతిదూరంబున వరసభిజ, నోపకంఠంబునను గట్టియున్న యట్టి. 246

ఉ. మేషయుగంబుఁ బట్టుకొని మెల్లనె పోవ భీతిఁ గూయఁ ద
ద్ఘోషము వీనుసోఁకిన దిగుల్గొని గొబ్బున లేచి తీవ్రసం
భాషల లెమ్ములెమ్ము నరపాల తగళ్ల మరల్పు దొంగలన్
భీషణశక్తిఁ దోలు మని ప్రేయసి వల్కఁగ నిద్రమబ్బునన్. 247

తే. లేవకుండిన రోషంబు లేదునీకు, జెగడి నే మొఱవెట్టంగ మగతనంబు
దక్కి వినియును వినినచందమున నున్నఁ, వాఁడ వెందైన నిటువంటివారు గలరె. 248

క. కూరిమి బిడ్డలవలెఁ బ్రియ,మారఁగ నేఁ బెంచుకొన్న యట్టితగళ్లం
జోరులపాల్పఱచితి నీ, వీరత్వము నమ్మి యింక వేయననేలా. 249

మ. అని యక్కోమలి దూఱనాడు పరుషవ్యాహార మేపాటి సోఁ
కెనొ కర్ణంబుల ప్రేటువడ్డపులిభంగిం దిగ్గునన్ లేచి య
జ్జననాథుం డదె పోకుపోకు మనుచున్ శాతాసివిక్షేపసం
జనితోద్యద్ద్యుతి యంధకార మణగించం దూఁడె వేగంబునన్. 250

క. నిద్రాభంగవికారము, రౌద్రావేశమును విస్మరత యొదవింపం
దద్రాజమౌళి జఘనజ,హృద్రాజితవస్త్రుఁ డగుచు నరిగె నెఱుఁగమిన్. 251

వ. అట్లు కదిసి. 252

క. దాకొని వడిగంధర్వుల, మైకిన్ లంఘించి వ్రేసెఁ బటుహస్తనట
ద్భీకరకరవాలమున భ,యాకులతఁ దగళ్ల విడిచి యవ్వల జరుగన్. 253

తే. తస్కరులమీఁద నుఱుకుచో ధరణివిభుఁడు, వీరరసమున భైరవాకారుఁ డయ్యె
నంతమాత్రమె కాదు వీతాంబరత్వ,కారణమునను భైరవాకారుఁ డయ్యె. 254

తే. అట్లు గంధర్వులను దోలి యాఁపొటేళ్లఁ, బట్టితెచ్చిన విభుఁగాంచి ప్రమద ప్రమద
మంది యెదఁజేర్చుకొనఁ బోయి యతని మేనఁ, జీర లేమికిఁ గలుషితచిత్త యగుచు.

క. ఆలింగన మొసఁగని జవ, రాలంగని తెలిసి వేగ మంబరము కటిన్
జాలిం గట్టెడు నానృప, మౌళిం గలకంఠి వికలమతిఁ గనుఁగొనుచున్. 256

చ. పలికె నరేంద్రుతోఁ గుముదబంధుకులోత్తమ హీనుభంగి యి
ట్లలుకువలేక వస్త్రరహితాకృతి నాకడ నిల్వఁ బాడియే
యల సమయోక్తియుం దలఁపవైతివి వీడనిపొందు వీఁడుకో
వలసెఁ గదా యిఁకం గలలవంటివిగావె ఋణానుబంధముల్. 257

క. నావలనఁ గొఱఁతగల్గుగదు, నీవచనము దప్పె నింక నిన్ననఁ నేలా
దైవకృతం బటువంటిది, భూవర నాఁకొఱకు వగలఁబొందకు మింకన్. 258

తే. పోయివచ్చెద దయయుంచుమీయటంచు,జనియె నూర్వశి చెలులుఁ దానునుయటేచ్చఁ
బ్రియునివలవంత మనసునఁ బెట్టవయ్యె, వారకాంతలవలపు లెవ్వరికివశము. 259

తే. అపుడు కెలన నున్న యట్టిగంధర్వులు, కోమలాంగిఁ జూచుకొనుచుఁ జనిరి
ముదితశాపదోషమును మునుమును లను, గ్రహము చేసినట్లు రహితమయ్యె. 260

క. అంతటఁ జింతాక్రాంత, స్వాంతుండై వంతనొంది వసుధాకాంతుం
డెంతయు నకటా వలచిన, యింతిం బాసినవిచార మింతనవశమే. 261

వ. అప్పుడు. 262

సీ. సింహాసనోపస్థితి యొల్లక లతాంగి తనుమన్ననీమయంపమె తలంచు
భూచక్రపరిపాలనోచితక్రియ మాని తఱలాక్షి సెఱుఁదుచందమె తలంచుఁ
ఘనకుంభకుంభివాహనకేళి చాలించి కలికిపాలిండ్లపొంకమె తలంచుఁ
బాహాస్త్రధారణాసక్తి లేక నెలంత భ్రూకటాక్షవిలాసములె తలంచుఁ
తే. గనకసంపద లార్జించుకాంక్ష విడిచి, యతివసిద్ధంపుమేనిచాయలె తలంచు
నహిపుఁ డిబ్భంగి రాజ్యభోగాభిలాష, వదలి మేఁప్రొద్దుఁ దన్మయావస్థనొందు. 263

క. అసురుసురని సొలయుఁ గ్ఱా, జసురేంద్రుఁడు మలయపవనుచలికిసరునకుఁ
బిసరుహశరుశరవిసరపు, ముసురునకుం బడిసి కిసలములఁజిసరునకున్. 264

ఉ. కన్నులనీరునించుఁ బులకంబులు దాల్చు వహించుఁ గంపముఁ
విన్నఁదనంబు నొందుఁ దనువిస్వరతం బలకించు ఘర్మబిం
దూన్నతిఁ జెందు టెచ్చవడి యుంచును మూర్ఛిలు నంతనింతిపై
గొన్నటులైన లేచు వగఁగుందుచు భూపతి సాత్త్వికార్తిచేన్. 265

వ. ఇవ్విధంబున నవ్విభుండు విరహవ్యాకులితచిత్తుండై పురంబు చొరనొల్లక యూర్వశి నన్వేషింపుచుండ నమ్మహీభర్తవర్తనం బరయుటకయి వచ్చి యచ్చేడియ యతని దైన్యం బవలోకించి యూఱడించుటకయి సరస్వతీతటనికటంబున సఖీసమేత యయి పొడచూపిన. 266

ఉ. గుండియ జల్లు జల్లనియెఁ గోమలిఁజూడగఁ జూచినంతలోఁ
నిండె జలంబు కన్నులను నీకొఱకై యిటులున్న వాఁడ నో

యండజయానయంచుఁ దనయార్తత దెల్పుచుఁ బల్కుఁ బల్కులో
మెండుగఁదోఁచె గద్గదిక మేదినినాయకుకూర్మి యెట్టిదో. 267

తే. ఇట్లు కరుణంబు నొంది యయ్యింతిఁ గదిసి, వర్తులోత్తుంగదృఢకుచద్వంద్వలిప్త
చందనద్రవ మెదకాఁక చల్లఁజేయ, గాటముగఁ గాంక్షకొలఁదినిఁ గౌఁగిలించి. 268

వ. ఇట్లనియె. 269

ఉ. నామది నిన్నుజీవముగ నమ్ముటకా పగదానికైవడిం
గాముని కప్పగించితివి కట్టఁడిదాన యఱుంగు నీమనం
బేమిటఁ జేసెనో యెఱుఁగ నింతదలంచినదాన పక్కటా
యేమిటి కింత నన్ను భ్రమియించితివే పయిపూఁతకూర్మలన్. 270

తే. మానవతి నీవు కట్టఁడిమనసుదాన, వగుట నే నేల తెలియలే నైతి మున్నె
హృదయసీమాబహిర్గతాగేంద్రకఠిన, చణభవత్కుచకుంభముల్ చాటుచుండ. 271

క. కులుకుచు జిలిబిలిపలుకులు, పలుకుచు రసమొలుకుచూపు వదనాబ్జముపైఁ
జిలుకుచుఁ బలుమొననొక్కుల, నులుకుచు రతివేళఁ జొక్కుచుందువు తరుణీ. 272

క. వదలెడు కొమ్ముడి వదలియుం, వదలనిలజ్జాభరంబు వడికూటములం
గదలెడు నడుమును గదలియుఁ, గదలనిచనుదోయి దలఁచి కరఁగెద రమణీ. 273

చ. పిలుపులయింపు ముద్దుగొను పెంపుఁ జనుంగవయుబ్బరింపుఁ జె
క్కుల చెమరింపు మైపులకగుంపు వదల్పనికౌఁగిలింపుఁ గ
న్నులయదలింపుఁ గీలుజడనొంపుఁ దలంపునవేడ్కనింపు నీ
కలయిక సొంపు నేమఱవఁగాఁగలనా కలనైనఁ గోమలీ. 274

మ. అనిదైన్యోక్తుల దూఱుప్రాణవిభు నూఱార్చెన్ లతాతన్వి చుం
బనదానంబుల దంతబాహులతికాబంధంబులం జల్పితా
నునయాలాపములన్ జపాకుసుమకాంతుల్గుల్కుకెమ్మోవిక్రొ
న్ననమాధుర్యరసంపువిందులఁ గృతానందంబు లొప్పొందులన్. 275

వ. ఇట్లయ్యిందువదన రాజకందర్పు డెందం బానందంబు నొందఁజేసి యిట్లనియె. 276

మ. తగునే రాజకుమార మన్మథమనస్తాపంబుచే నింత నె
వ్వగలం బొందఁగ ధైర్యశాలివిగదా వారాంగనాస్నేహమో
హగుణంబుల్ చపలాయితాయతము లెంతైనన్ సతంబేలగున్
వగరే లోకులు నీమనం బిటులుమగ్నంబైన రాగాంబుధిన్. 277

ఉ. నీకడ నిన్నినాళ్లవలె సేవసియింపఁగరాదు దేవతా
లోకమునన్ సురేంద్రసభలోఁ నిఁక నిచ్చలుఁ గొల్వుసేయుటన్
నాకడ కీవిభావరి సనన్ మఱి మీఁదటిరేయి రమ్ముసౌ
ఖ్యాకరవృత్తిఁ గూడఁగ నుపాయ మగుం జను మిప్పు డింటికిన్. 278

వ. అని మఱియుఁ బ్రియాలాపంబుల నూఱడించి యుర్వశి గంధర్వులం గలసి దేవలోకంబున కరిగెఁ బురూరవుండును నక్కలికిపలికినపలుకున కర్థంబు విచారించి యారేయి గడపి తనకడకు వచ్చునది యని యాదేశించుటను దరుణిగర్భధారిణిగా నెఱింగి యొకదినంబు మితంబుసేయుట మనుష్యమానంబున సంవత్సరం బని తెలిసి ప్రతిష్ఠానంబున కరిగి యథోచితంబుగా రాజ్యపాలనంబు సేయుచు నుర్వశీవిరహితం బగుట భోగంబులయం దాసక్తిలేక వఱసి వల్లమి ననుభవించుచుండె. 279

తే. ఉహములెల్లను దద్విధూహావభావ, మహురభివ్యక్తకృతము దావహములుగను
నిశలు దత్కుచపరిరంభనిర్భరసుఖ, కారణస్వప్నదశలుగాఁ గడపుచుండ. 280

క. ఏఁడయ్యె నొకదినంబొక, యేఁడై యరుగంగ మానవేంద్రున కదిపె
క్కేఁడు లనితోఁచ రెండవ, యేఁడు ప్రవేశించె నతని కెలమియొసంగన్. 281

వ. అటనుర్వశియుం బురూరవశికళాభరితప్రదీపితం బయిన గర్భంబువలన శుభముహూర్తంబున నవమోహనాకారుం డగునాయు వనుకుమారుం గాంచి గారవంబునఁ బెనుచుచుండె. 282

తే. అప్పు డతఁ డుర్వశీదర్శనాభిలాష, బుద్ధినేగుచుఁ గనకాద్రిప్రాంత వనవి
హారపరత సఖీయుక్త యగుచు వచ్చి, మెలఁగుచున్నట్టి యవ్వెల్పుమెలతఁ గాంచె.

క. ఆరమణియుఁ బ్రియ మగునుప,చారంబులఁ బ్రీతుఁ జేసి జనవల్లభుతోఁ
గూరిమి నిట్లను విను మొక, నేరుపు ననుఁ గలిసియుండ నీకెఱిఁగింతున్. 284

శా. నేగంధర్వుల యాజ్ఞచేఁ మెలఁగుచున్కిం జేసి నీతోడిసం
యోగక్రీడలఁ దొంటియట్ల మెలఁగన్ యుక్తంబుగా దింకనీ
వాగంధర్వుల వేఁడికొమ్ము వినయం బారంగ నట్లైన సం
భోగార్థంబుగ నీకు నిచ్చెదరు నన్ భూపాలచూడామణీ. 285

తే. అనుచుఁ బల్కిన నట్లకా కనుచు నాతఁ, డొక్కవిజనస్థలంబున నొక్కరుండు
బొసఁగఁ గూర్చుండి గంధర్వపుంగవులను, భక్తియుక్తి నుద్దేశించి ప్రస్తుతించె. 286

సీ. సంగీతరసవిలాసమునఁ గేశవశివబ్రహ్మల మెప్పించుప్రౌఢులార
చక్కఁదనంబున శంబరారికినైనఁ జాలమిపుట్టించుసరసులార

యణిమాదికములైన యష్టవిభూతుల సిద్ధులైనట్టి ప్రసిద్ధులార
యఖిలరాగంబులయందు హవిర్భాగభోక్తలై పెంపొందుపుణ్యులార
తే. కోరి మిమ్ము భజించెద గారవమున, నాకు మీరు ప్రసన్నులై నామనోర
థంబు లీడేర్పరయ్య గంధర్వులార, ధామధామాస్యవిజితగాంధర్వులార. 287

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించిన దివ్యజ్ఞానసంపన్ను లయిన గంధర్వు లతని స్తవంబునం బ్రీతులయి యతనికిం బ్రత్యక్షంబయిన నతం డుర్వశి నిమ్మని యడిగిన వార లమ్మచ్చకంటి నిచ్చుట యుక్తంబుగా దనుతలంపున పయోరూపలక్షణాదుల నుర్వశింబోలియున్న యగ్నిస్థాలి యనుసిలవేణి నిచ్చిన యవ్వసుంధరారమణుండు గంధర్వమాయామోహితుండయి యుర్వశియకా తలంపుచు నయ్యంగనం గయికొని దానితోఁ గొన్నిదినంబులు సురతసుఖం బనుభవింపుచునుండి యవ్వెలంది చేష్టితంబులు వేఱొక్కభంగి యగుటకు సంశయింపుచుం దనమనంబున. 288

ఉ. ఆసరసోక్తు లానగవు లానెనరూనినచూపు లామహో
ల్లాసరసాప్తి యాముఖవిలాసవ యాహృదయానుగుణ్యలీ
లాసురతక్రియల్ మదిఁ దలంచిన నిచ్చెలియందుఁ గల్గవే
మో సుగుణాభిరామ యగునుర్వశిగాఁ దిది నిక్కమారయన్. 289

క. వంచించిరి గంధర్వు ల,టంచుఁ దరుణి నచట నునిచి యాత్మపురికి నే
తెంచి ధర యేలుచుండెఁ గు,ణాంచిత నుర్వశిఁ దలంచి యసురుసురనుచున్. 290

తే. అంతఁ ద్రేతాయుగము చొచ్చె నప్పు డతని, బుద్ధికామ్నాయములు కర్మబోధకంబు
లగుచుఁ ద్రివిధంబులై తోఁచ యాగవిధులు, తదనుగుణముగ నొనరించుతలపుతోడ.

సీ. వెడలియగ్నిస్థాలి కడకేగి యవ్వనంబున శమీగర్భసంభూతమైన
యశ్వత్థమును గాంచి యందరణులు రెండు గొని క్రిందనొక్కటి యునిచి మీఁద
నొకటి చేతులఁబట్టియురవడిఁ ద్రచ్చుచు నొనరఁ బూర్వారణి యుర్వశియును
దగనుత్తరారణి దానును నడుమఁ బుత్రుండుగాఁ దలఁపుచోఁ దొడరిమంత్ర
తే. ముచ్చరించుచు నుండ నం దుదయమయ్యె, హవ్యవాహుండు తనయుఁడై యప్పురూర
వక్షితీశున కిహపరావార్యసౌఖ్య, గరిమఘటియింపఁ జేయఁ దాఁ గర్తయగుచు.

వ. అట్లు సంజాతుండయిన వీతిహోత్రుని శాస్త్రోక్తప్రకారనిర్మితయాగశాలాంతకుండంబులం బ్రతిష్ఠించి వసిష్ఠాదు లయినమునిశ్రేష్ఠులు విశిష్టప్రకారంబునం దదనుష్ఠానంబు నడిపింప గోభూహిరణ్యరత్నాంబరాదినానావిధదానంబులఁ దృప్తులం జేసి దీనార్థివ్రాతంబుల నభీష్టవస్తువులం దనిపి పరమేశ్వరుండు ననంతుండును నాశ్రితవత్సలుండును,

నఖిలజగత్కర్తయు నగు శ్రీమన్నారాయణస్వామిం గుఱించి యనేకయాగంబు లొనర్చి యంతం బురందరప్రముఖదేవత లతనికిం బ్రసన్నులయి యభీష్టవరంబు లొసంగి యూర్వశీకాముకుం డగుట నతనియభిప్రాయంబు దెలిసి యవ్విలాసిని నతని కిచ్చి నరసురలోకంబుల యథేచ్ఛావిహారంబులం జరియించు నట్లు దివ్యత్వం బొసంగి రంత. 293

తే. ధరణినాహవనీయంబు దక్షిణాగ్ని, గార్హపత్యంబు నన విభక్తములు చేసి
త్రివిధమున హోమవిధులు వర్తిల్లఁజేసెఁ, గర్మపరులకు సులభంబుగా నతండు. 294

క. తనకు వశంగతురాలై, యనవరతము, చెలులుం దాను నరమర లేక
త్యనుకూలత నయ్యుర్వశి, చనువున మెలఁగంగ మదనసౌఖ్యాన్వితుఁడై. 295

తే. పచ్చకపురంబువంటి సుపర్వభోగి, నీలకామంబుచనువు దకోర్కెలుఁగొనియెఁ
బంతమున నానృపాలుఁడు భాగ్యవంతుఁ, డెంతఁదలఁచిన సఫలమౌ నిది నిజంబు. 296

సీ. వేదశాస్త్రపురాణవిదితమై గణుతింపఁ దగుసదాచారవర్తనమువలన
న్యాయార్జితములైన నవరత్నకనకసామజహయప్రముఖసంపదలవలన
మందారసుమహారిచందనామోదదివ్యాంగనాసురతభోగాప్తివలన
శ్రీవాసుదేవాంఘ్రిచింతనామృతధారఁ బొరయుబ్రహ్మానందపూర్తివలన
తే. గరిమధర్మార్థకామమోక్షము లనంగఁ, దగినపురుషార్థములు నాల్గుఁ బడసెఁ దామె
సిద్ధమైయుండ సంకల్పసిద్ధుఁ డనఁగఁ, ధారుణీచక్రమేలెఁ బురూరవుండు. 297

వ. అయ్యుర్వశీపురూరవస్సులకు నగ్రసుతుండయి జనియించిన యాయువునకు సహోదరులయి క్రమంబున శ్రుతాయువును సత్యాయువును జయుండును విజయుండును నన నేవురు పుత్రు లుదయించిరి. తత్కుమారషట్కంబువలనఁ గ్రమక్రమంబునఁ బుత్రపౌత్రాభివృద్ధియయి చంద్రవంశపారంపర్యంబు జగద్విదితం బయి వెలసె నని సూతుఁడు శౌనకాదులకుం దెలిపిన నామహర్షులు పరమహర్షరసభరితహృదయు లయి యతనిం బ్రశంసించిరి. 298

క. కవిరాజమనోరంజన, మగునన వక్తకును శ్రోత కతిశుభదంబై
భువి నాచంద్రార్కము కీర్తివెలుంగఁ బురూరవశ్చరిత్రము దనరున్. 299

శా. శ్రీకాంతాకుచకుంభలిప్తసరసశ్రీగంధసత్సౌరభా
శ్రీకాంతాతతబాహుమధ్యరుచిరశ్రీవత్సవాణీధవ
శ్రీకంఠస్తుత శక్రవాయుతనయశ్రీదాదిసంసేవితా
శ్రీకారప్రతిమానకర్ణయుగళా శ్రీరాజగోపాలకా. 300

క. చక్రహితకన్యకాతటి, చక్రోత్పలపత్రఘటనచతురనతసుధీ
చక్రధరాచక్రధరా, చక్రధరాకీర్తిమగ్నచక్రధరార్ద్రా. 301

పృథ్వీవృత్తము :—

గదాకరముదాకరద్యుతివికస్వరా సుస్వరా
సదాశివపదాశివస్తనితశ్లాఘ్య కాభిఖ్యకా
గదాగ్రజపదాగ్రజత్రిపథగావనా పావనా
విదాహితమదాహితప్రకటవిక్రమాశుక్రమా. 302

గద్య. ఇది శ్రీమంగళాచల నృసింహకృపాప్రసాద సంప్రాప్త విద్యావైభవ కనుపర్తి రామనమంత్రితనూభవ సుజనహితకృత్య నిత్యాబ్బయామాత్యప్రణీతం బయిన కవిరాజమనోరంజనం బనుమహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

కవిరాజమనోరంజనము సంపూర్ణము.

# ఆంధ్రగ్రంథములు.



| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలి సొంపు; పీఠిక అతివిపులము. | | 7 | 8 |
| గరుడాచలము, యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 2 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము, సాధారణప్రతి | ... | 1 | 6 |
| డిటో మేలుప్రతి, గ్లేజుకాకితములది | ... | 1 | 10 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | ... | 1 | 2 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) | ... | 0 | 14 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము | ... | 1 | 0 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 2 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము, చక్కనిప్రతి | | 1 | 8 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము | ... | 2 | 0 |
| దస్తాపద్యములు | ... | 0 | 2 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 0 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము, మేలుప్రతి | ... | 1 | 0 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | ... | 0 | 4 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగ్గడ, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవికృతము | ... | 0 | 12 |
| పంచతంత్రము, వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 4 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు | ... | 0 | 8 |

ప్రతి 1-కి రూ. అ.

బసవపురాణము, పిడుపర్తి సోమనాథప్రణీతము ... 2 4
బ్రహ్మోత్తరఖండము ... 1 0
భాస్కరరామాయణము, చక్కనిప్రతి, క్రొత్తకూర్పు ... 4 0
భోజరాజీయము, అనంతామాత్యకృతము ... 1 2
మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాకితములమీఁద స్పష్టమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నారము ... 2 0
భోగినీదండకము ... 0 1
మార్కండేయపురాణము, మారనకృతము ... 1 12
మొల్లరామాయణము, చిన్నసైజు, పెద్దక్షరములు ... 0 10
రసికజనమనోభిరామము ... 0 12
రంగనాథరామాయణము, ద్విపద, క్రొత్తకూర్పు, మేలుప్రతి ... 3 0
రంగరాయచరిత్రము, దిట్టకవి నారాయణకవికృతము ... 0 8
రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము ... 0 3
రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... 2 0
రాజయోగసారము, ద్విపద ... 0 4
రాజశేఖరవిలాసము, కాలికోబైండు ... 0 12
రామరాజీయము, చక్కనిప్రతి ... 0 12
రామాభ్యుదయము ... 1 4
రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి ... 0 6
రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... 0 8
రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... 0 10
లంకావిజయము, (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము ... 1 4
వసుచరిత్ర, సటీక, అనేకనూతనాంశములుగల చక్కని క్రొత్తకూర్పు. 4 0
వసుచరిత్రవిమర్శనము, శ్రీ చినసీతారామస్వామి శాస్త్రికృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు ... 1 0

ఇంకయు అనేకసంస్కృతాంధ్రగ్రంథములు, పెద్దచ్చుశతకములు మాయొద్ద సరసముగా దొరకును.

# ఆంధ్ర గ్రంథములు.

## వచన గ్రంథములు.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు,ఒకేసంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము— | | |
| ,, ఆదిసభాపర్వములు | 4 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 4 | 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 4 | 0 |
| ,, భీష్మద్రోణపర్వములు | 4 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 3 | 0 |
| ,, శాంతిపర్వము | 5 | 8 |
| ,, ఆనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 4 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు | (అచ్చు) | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 1 | 12 |
| ఆంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | 1 | 12 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 4 | 0 |
| ఆర్కియన్‌నైట్సుకథలు | 1 | 4 |
| న్యాయవిచారణ, ప్రహసనం | 0 | 4 |
| తులసీదాసురామాయణము | 12 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు, వచనం | అచ్చు | |
| భారతరమణీమణులు, 1 భా॥ | 0 | 12 |
| డిటో రెండవభాగము | 0 | 10 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 8 |
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | 6 | 0 |
| సీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 12 |
| పంచతంత్రము, వచనము | 0 | 12 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 8 |
| నీతిరత్నాకరము | 0 | 12 |
| సంగ్రహరామాయణము | 1 | 0 |
| సంగ్రహభారతము | 1 | 8 |
| సంగ్రహభాగవతము | 1 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు | అచ్చు | |
| పతివ్రతలచరిత్రలు | 2 | 8 |
| దక్కనుపూర్వకథలు | 2 | 8 |
| భోజునికథలు | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | 0 | 12 |
| భోజకాళిదాసకథలు, 1 భా॥ | 0 | 12 |
| ,, 2 భా॥ | 0 | 12 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| సంస్కృతనాటకకథలు | 2 | 0 |
| దశకుమారచరిత్రము | 2 | 0 |
| మదనకామరాజుకథలు, | 0 | 14 |

| ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|
| రాజశేఖరుడు, గోపాలుడు | 0 | 8 |
| విక్రమార్కునికథలు | 0 | 8 |
| చార్ దర్వేషుకథలు | 0 | 8 |
| తాతాచార్యులకథలు | 0 | 6 |
| వైద్యులకథలు | 0 | 4 |
| బేతాళునికథలు | 0 | 8 |
| వీరాంగనలు | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | 0 | 3 |
| నలుగురుమంత్రులకథలు | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు | 0 | 6 |
| రేచుక్కపగటిచుక్కకథ | 0 | 3 |
| సత్యసేనవిజయము | 0 | 6 |
| ఋషులచరిత్ర | 0 | 8 |
| పురాణగాథలు I | 0 | 12 |
| ,, II | 0 | 12 |
| బాజీరాయని చరిత్ర | అచ్చు | |
| రఘువంశకథ | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర | 1 | 0 |
| వివేకానందవిజయము | 2 | 8 |
| పరిహాస్యవినోదకథలు | 0 | 12 |
| ఈసబునీతికథలు, 1-వ భా॥ | 0 | 8 |
| డిటో 2-వ భా॥ | 0 | 12 |
| పంజాబుఅల్లరి | 0 | 8 |
| శుకసప్తతికథలు | 0 | 6 |
| మర్యాదరామన్నకథలు | 0 | 3 |
| మైరావణచరిత్ర | 0 | 1 |
| షేక్స్పియర్ నాటకకథలు | అచ్చు | |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | 0 | 12 |
| ప్రహ్లాదచరిత్ర, ప్రతిమలతో | 0 | 6 |
| శకుంతల ,, | 0 | 6 |

| ప్రతి 1-కి | | రూ. | అ. |
|---|---|---|---|
| నల | ,, | 0 | 8 |
| సావిత్రి | ,, | 0 | 6 |
| హరిశ్చంద్ర | ,, | 0 | 8 |

## నవలలు.

| | | | |
|---|---|---|---|
| సీతారామము | | 1 | 8 |
| ఐవన్హో, | నవల | 0 | 8 |
| మదాలస | ,, | (అచ్చు) | |
| సుజనరంజని | ,, | 0 | 8 |
| విజ్జలదేవి | ,, | 1 | 8 |
| ఉన్మాదిని, | నవల | 0 | 4 |
| రాధారాణి | ,, | 0 | 4 |
| అస్తమయము | ,, | 2 | 0 |
| దుర్గేశనందని | ,, | 0 | 12 |
| కపాలకుండల | ,, | 0 | 12 |
| లక్షణ | ,, | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ | ,, | 1 | 8 |
| లీల | ,, | 0 | 6 |
| రాజర్షి | ,, | 1 | 8 |
| తారాబాయి | ,, | 1 | 0 |
| దిలారామ | ,, | 1 | 8 |
| కోవలన్ కన్నకి | | 0 | 1[illegible] |
| మనోహరి | ,, | 0 | [illegible] |
| వీరబాల | ,, | 0 | [illegible] |
| ఆనందమఠ | ,, | 1 | [illegible] |
| లాలాబాయి | ,, | 0 | [illegible] |
| ఆంధ్రరాష్ట్రము | ,, | 1 | [illegible] |
| రోషినార | ,, | 0 | 12 |
| బాలాదిత్య | ,, | 3 | 0 |
| దేశభక్తుడు | | 1 | 8 |
| శంభుతోనొకనాటిసహవాసం | | 0 | 4 |
| చంద్రగుప్తుడు, నవల | | 2 | 8 |